# శ్రీమద్రామాయణం - మానవీయ సంబంధాలు

బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు శర్మ



శాంతా - వసంతా ట్రస్టు
ప్లాట్ నెం : **16 & 17,** గ్రీన్ వాక్ వేస్,
రాజేంద్రనగర్, హైదరాబాద్

**Srimad Ramayanam - Maanaveeya Sambandhaalu**
(Human Relations in Srimad Ramayanam)

*By :* **Brahmasree Chaganti Koteswara Rao Sarma**



ముద్రణ : **17 నవంబర్, 2023**
ప్రతులు : 1000

అక్షరీకరణ : శ్రీ పత్రి అశ్వనీ కుమార్
ముఖచిత్రం : శ్రీ పురుషోత్త్ కుమార్
ముద్రణ : రెయిన్ బో ప్రింట్ ప్యాక్, హైదరాబాద్

వెల : అమూల్యం

ప్రచురణ :
**శాంతా - వసంతా ట్రస్ట్**
**ప్లాట్ నెం.16, 17, గ్రీన్ వాక్‌వేస్**
**రాజేంద్ర నగర్,**
**హైదరాబాద్-500 030**
**email : svcthyd@gmail.com**
**www.shanthavasanthatrust.org**

# ప్రవచనధార అక్షరమాలగా...

ఆధునిక సమాజంలో నానాటికి దిగజారిపోతున్న నైతికవిలువల పరిరక్షణకు, ప్రపంచమంతటా ప్రబలుతున్న అసుర ప్రవృత్తి నిరోధానికి, మన ప్రాచీన వాఙ్మయం, పురాణేతిహాసాలు, ఎంతగానో ఉపకరిస్తాయి. మన ఆర్ష సంస్కృతికి అద్దం పట్టే ఆదికావ్యం శ్రీమద్రామాయణం. ధర్మాలను, ధర్మసూక్ష్మాలను అవగతం చేసుకోవడానికి, కాల ప్రవాహంలో కరిగిపోతున్న సంస్కృతీ సంప్రదాయాల పరిరక్షణకు, దృఢమైన మానవీయ సంబంధాలు మరుగునపడి మాసిపోకుండా కాపాడుకోవడానికి శ్రీమద్రామాయణ మహాకావ్యం పఠనీయం – కానీ యీ మహద్గ్రంథాన్ని చదివి, ఆసాంతం ఆకళింపు చేసుకోగల భాషా సమర్థత, సమయం లేని సగటు మానవజాతిగా నేటి మన సమాజం తయారయ్యింది –

అలాంటి యీ నవీన సమాజానికి సరస్వతీమాత కానుకగా, ఏ పురాణాన్నైనా, ఏ ఇతిహాసాన్నైనా మనకు అర్థమయ్యే రీతిలో, మనస్సుకు హత్తుకొనే తీరులో, మనలో ధర్మాచరణం పట్ల ఆసక్తి కలిగించగలిగే ప్రభావంతో అనేకానేక అనుగ్రహ భాషణాలు చేస్తున్నారు పూజ్యగురువులు బ్రహ్మశ్రీ డా॥ చాగంటి కోటేశ్వరరావు గారు.

వారు సరస్వతీ మాత కటాక్షంతో, నిరంతర అధ్యవసాయ పరంపరలతో వాగ్వైభవాన్ని సాధించుకొన్న పూజ్యగురుదేవులు. ఏ ప్రవచనమైనా హృదయపులోతుల్లోంచి, కంఠశ్వాసలోంచి మధ్యమ స్వరంలో సంస్కార సంపన్నమై, కల్యాణ గుణయుతమై వినేవారి

హృదయాలను అలరిస్తూ అనుగ్రహ భాషణం చేస్తారు.

వాగ్ధారలో వైభవం, ప్రతిభలో ప్రాభవం ధారణలో ధారాళత్వం కలసిన త్రివేణీ సంగమం బ్రహ్మశ్రీ చాగంటివారు. వెయ్యేళ్ళ తెలుగు పద్యాలను, 24వేల రామాయణశ్లోకాలను పుక్కిట బట్టిన ఆగస్త్యులు, ఆపురూప ఆపూర్వ ధారణా సంపన్నులు పూజ్యగురువులు శ్రీ చాగంటి వారు.

మరి, విననివారో? వారికోసం, వారికీ అమృతధార అందించాలన్న సత్సంకల్పంతో వారు పలికిన ప్రతి అక్షరాన్ని ఒడిసి పట్టుకొని, అక్షరం, అక్షరం పొదిగి యీ పుస్తకంగా రూపొందించారు యువభారతి నిర్వాహకులు – నేనూ వారి సత్సంకల్పంతో భాగస్వామినయ్యే అదృష్టవంతుడినయ్యాను–

ఇది పూజ్యగురుదేవుల కృప, కరుణ, దీవెన – కాబట్టే వారి వాక్కు అక్షర రూపంగా శాశ్వతంగా మనందరికీ పదే పదే మననం చేసుకోవడానికి వీలైనరీతిలో చేతిలో పుస్తకంగా అవతరించింది – చదవండి – తరించండి –

**– వరప్రసాద్ రెడ్డి**

**ప్రచురణ కర్త**

# 1

శుక్లాంబరధరం విష్ణుం, శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్, సర్వ విఘ్నోపశాంతయే ॥

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ॥

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరం ।
ఆరుహ్య కవితాశాఖామ్ వందే వాల్మీకి కోకిలమ్ ॥

శృతి స్మృతి పురాణానాం ఆలయం కరుణాలయం ।
నమామి భగవత్పాద శంకరం లోక శంకరం ॥

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే ।
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ ॥

సూక్తిం సమగ్రైతునః స్వయమేవ లక్ష్మీః
శ్రీ రంగరాజ మహిషీ మధురై కటాక్షైః ।
వైదగ్ధ్యవర్ణ గుణగుంభన గౌరవైర్యాం ఖండూర
కర్ణ కుహరాహ కవయో ధయంతీ ॥

**హైమోర్ధ్వ పుండ్ర మకుటం సునాసం**
**మందస్మితం మకర కుండల చారుగండం ।**
**బింబాధరం బహుళ దీర్ఘకృపాకటాక్షం**
**శ్రీవేంకటేశ ముఖమాత్మని సన్నిధత్తాం ॥**

**విమల పటీ కమల కుటీ పుస్తక రుద్రాక్ష శస్త హస్త పుటీ ।**

**కామాక్షి పక్ష్మలాక్షి కలిత విపంచి విభాసి వైరించి ॥**

**మనోజవం మారుత తుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।**
**వాతాత్మజం వానరయూధ ముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి ॥**

**ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం ।**
**లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం ॥**

**హరి:** ఓం.. పరమేశ్వర స్వరూపమైన సభకు నమస్కారం.

శ్రీ రామాయణము మానవీయ సంబంధములు. కోరి కోరి దశావతారాల్లో ఒకటైన రామావతారం పరిపూర్ణమైన మనుష్యుడిగా ఈ భూమి మీద అవతరించింది. అలా అవతరించడానికి కారణం కేవలం రావణసంహారం ఒక్కటే కాదు. ఆ కాలంలో రామచంద్రమూర్తి అవతార స్వీకారం చేయడానికి ఉన్న నేపథ్యాన్ని పరిశీలిస్తే ఋషుల దగ్గర నుండి అందరూ కూడా మనుష్య జన్మని అవమానించినవారే. మనుష్యజన్మను చాలా తక్కువచేసి మాట్లాడినవారే. అటువంటి పరిస్థితులలో మనుష్యజన్మ గొప్పతనాన్ని నిరూపించడానికి వచ్చిన అవతారం – మానవ అవతారంగా వచ్చిన రామావతారం. అంత గొప్ప తపస్సు చేసిన రావణాసురుడు బ్రహ్మగారు ప్రత్యక్షమైతే నాకు వారివలన మరణం ఉండకూడదు వీరివలన మరణం ఉండకూడదు అని అనేకమంది పేర్లు చెప్పి, చిట్టచివర మాత్రం ఒక మాటన్నాడు.

**తృణభూతా హితే మన్యే ప్రాణినో మానుషాదయః**

నాకు మనుష్యుల వలన మరణం ఉండకూడదని నేను అడగను. ఎందుకని అంటే వాళ్ళు నాకు గడ్డిపరకతో సమానం. గడ్డిపరకతో సమానమైన మనుష్యుడు చేతిలో నాకు మరణం ఉండకూడదని ప్రత్యేకంగా వరమడగ వలసిన అగత్యమేమున్నది? అందుకని నేను అడగనే అడగను అన్నాడు. అంటే అవి మనిషి జన్మని అంత చులకన చేసిన రోజులు.

రావణుడే కాదు మీరు రామాయణాన్ని పరిశీలనంచేస్తే, అనేకచోట్ల ఋషులు కూడా, మనుష్య జన్మని ఆ కాలంలో తక్కువచేసి మాట్లాడటం కనపడుతుంది. కానీ భగవంతుడి దృష్టిలో మనుష్యజన్మకన్నా గొప్పది వేరొకటి లేదు. ఎందుకంటే మూడురకాలుగా వెళ్లగలిగే జన్మ – మనుష్య జన్మ ఒక్కటే. ఎవరు మానవుడిగా జన్మించారో, ఆయన పుణ్యకర్మలు చేసి వీటి వలన నాకు ఫలితం కలగాలి అని కోరుకుంటే, దేవతా పదవులలోకి వెళ్లి కూర్చోగలడు. అదే మనుష్యుడు నాకు శాస్త్రం అక్కర్లేదు, గురువు అక్కర్లేదు నాకు ఒంట్లో ఓపిక ఉన్నది కాబట్టి ఇచ్చ వచ్చినట్లు ప్రవర్తిస్తానని పాపకర్మలు చేసి ఉత్తరోత్తర జన్మల్లో తిర్యక్కుగా అంటే భూమికి వెన్నుపాము అడ్డంగా ఉండే ప్రాణిగానూ పుట్టవచ్చు. "నాకు పుణ్యమూ వద్దు, పాపమూ వద్దు నేను ఈశ్వరుడు ఏది చెప్తాడో అది నిమిత్తమాత్రంగా చేసుకుంటూ వెళ్ళిపోతున్నాను" అన్నవాడు ఈశ్వరుడి కృపచేత జ్ఞానమును పొంది ఆ జ్ఞానము వలన మళ్ళీ ఇక పుట్టవలసిన అవసరంలేని మోక్షాన్ని పొందవచ్చు.

మూడు రకాలుగా విడిపోవడానికి అవకాశం ఇచ్చే గొప్ప జన్మ మానవజన్మ. అందుకే "జంతూనాం నరజన్మ దుర్లభం.." అంటారు. అసలు నరజన్మ లభించడం అంత తేలిక విషయం కాదు. అంత గొప్పదైన నరజన్మను ఈసడించినవాడు రావణాసురుడు. అందుకే రామావతారం యొక్క ప్రధాన ప్రయోజనంగా కనపడేది కేవల రావణసంహారం కాదు. మనుష్య జాతి వైభవాన్ని నిలబెట్టడం. అందుకే మీరు గమనిస్తే ఆయన రావణసంహారం

తర్వాత అవతార పరిసమాప్తి చేస్తానని చెప్పలేదు. రావణసంహారం అయిపోయిన తరువాత కూడా "దశ వర్ష సహస్రాణి దశ వర్ష శతానిచ.." పదకొండు వేల సంవత్సరములు ఈ భూమి మీద ఉండి నేను భూమిని పరిపాలన చేస్తాను అని చెప్పాడు. అంటే శాస్త్రాన్ని పట్టుకుని అనుష్ఠించిన వ్యక్తి. పరిపాలన చేసినా శాస్త్రాన్ని ఆదర్శంగా తీసుకుని పరిపాలన చేసిన వ్యక్తి ఎంత శాంతి సుస్థిరతలతో కూడుకున్న రాజ్యాన్ని స్థాపించగలడో లోకానికి నిరూపించడం కోసం శ్రీరామావతారం వచ్చింది. అందులో రావణసంహారం కూడా ఒక ప్రధాన ప్రయోజనం. అంతకన్నా ప్రధాన ప్రయోజనం, మనుష్యుని గొప్పతనాన్ని లోకానికి చాటడం. అందుకే మీకు ఎన్నో అవతారాలు ఉన్నా రామావతారం మనుష్యునికి దగ్గరగా జరిగినంతగా, మిగిలిన అవతారాలు జరగవు.

మనిషి జన్మకి చాలా చాలా గొప్పది ఏదీ అంటే గురువుగారి అనుగ్రహం. గురువుగారి అనుగ్రహాన్ని మించిన లోకంలో ఇంకొకటి ఉండదు. 'గురువు' అన్న శబ్దం మిగిలిన ఏ ప్రాణికి అన్వయం కాదు. 'గురువు' అన్న శబ్దం ఒక్క మనుష్య ప్రాణికి మాత్రమే అన్వయం అవుతుంది. గురువు అంటే శ్రద్ధకి ప్రతిరూపం. గురువు అంటే ఏదో ఒక వ్యక్తి కాదు – ఆయన కర చరణాదులతో ఈ భూమి మీద తిరుగాడే పరబ్రహ్మమే అని ఈశ్వరుడు గురుగీతలో పార్వతీదేవితో అంటాడు..

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥**

ఆయనే సృష్టికర్త – ఆయనే స్థితికర్త – ఆయనే ప్రళయకర్త. గురువు అజ్ఞానాన్ని తొలగించి జ్ఞానాన్ని అనుగ్రహిస్తాడు. పరిపూర్ణావతారమైన శ్రీకృష్ణావతారం, సాందీపని మహర్షిని గురువుగా సేవించింది. అసలు శ్రీరామావతారంలో ఆయన గురువుల్ని సేవించినట్లుగా, మీకు ఎక్కడా అంత అద్భుతమైన సేవానిరతి, ఆ భక్తి తత్పరత కనపడవు.

నిజానికి శ్రీరామాయణ ప్రారంభమే మనుష్యుల మధ్య ఉండవలసిన గొప్ప అనుబంధాలలో చాలా గొప్ప అనుబంధం గురువుగారితో ఉండే అనుబంధాన్ని సూచిస్తుంది. ఎందుకని అంటే మిగిలినవారితో ఉన్న అనుబంధం పరిమితమైనది. తల్లి తండ్రి ఉన్నారనుకోండి. చాలా గొప్పవాళ్ళు – అందులో సందేహం లేదు. కానీ వాళ్లు ఈ జన్మకి జన్మనిచ్చారు. మళ్లీ వచ్చే జన్మలో వేరొకరు జన్మ నిస్తారు వాళ్ళు తల్లిదండ్రులు అవుతారు. కానీ ఇక జన్మ ఎత్తవలసిన అవసరం లేని జ్ఞానమును ఇవ్వగలిగిన వాడు ఎవరు అంటే గురువు. అటువంటి గురువు రుణాన్ని తీర్చుకుంటాము అనగలిగినవాడు ఉండడు.

భాగవతం దశమ స్కంధంలో రుక్మిణిదేవి అగ్ని జ్యోతనుడిని ఉద్దేశించి చెప్తూ

**జలజాతేక్షణు దోడితెచ్చితివి నా సందేశమున్ జెప్పి; ననున్**
**నిలువంబెట్టితివి; నీకృపన్ బ్రతికితిన్ నీకన్న పుణ్యాత్మకుల్**
**గలరే? దీనికి నీకున్ బ్రత్యుపకృతిన్ చేయంగ నేనేర నం**
**జలిఘటియించెద భూసురాన్వయమణీ సద్బంధుచింతామణీ!....**

అంటుంది.

గురువుకి ఇది ఇవ్వగలను అన్న మాట అన్వయం కాదు. ఎందుకని అంటే గురువు ఎప్పుడు పరబ్రహ్మమునందు రమించడంలో సంతోషాన్ని పొందుతూ ఉంటాడు.

**యోగరతోవా భోగరతోవా సంగరతోవా సంగ విహీనః ।**
**యస్య బ్రహ్మణి రమతే చిత్తం నందతి నందతి నందత్యేవ ॥**

అటువంటి గురువు యొక్క శరీరాన్ని కాపాడుకోవడం ఎందుకు? అంటే ఆయన చాలాకాలం శరీరంలో ఉంటే మనకు ఉపకారం జరుగుతుంది కాబట్టి. అటువంటి గురువైభవంతోటే అసలు శ్రీరామాయణ ప్రారంభం.

అందుకే

**తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్ ।**
**నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్ ॥**

వాల్మీకి సామాన్యమైనటువంటి మహానుభావుడు కాదు. ఆయన మునిపుంగవుడు. ఎప్పుడూ మననము చేసే లక్షణం ఉన్నవాడు. అంటే తాను ఏది చదువుకున్నాడో ఏది నేర్చుకున్నాడో ఆ బ్రహ్మమును నిరంతరము మనసులో తిప్పే లక్షణం ఉన్నవాడు. అటువంటి వాడి దగ్గరికి నారద మహర్షి బయల్దేరి వచ్చారు. గురుతత్త్వం ఎలా ఉంటుంది అంటే అది శిష్యుడికి ప్రబోధం చేస్తున్నంతసేపు తాను గురుస్థానం. అది అయిపోగానే నేను కూడా పరమ సామాన్యం అన్న వినయ భావంతో గురువు వెళ్ళిపోతాడు తప్ప నేనింత గొప్పవాణ్ణి అన్న భావం అంటిపెట్టుకుని ఉండదు. అట్లా ఉంటే అది అతిశయం కింద, గర్వం కింద మారిపోయే అవకాశం ఉంటుంది అటువంటి వాల్మీకి మహర్షి ఆశ్రమానికి నారద మహర్షి వచ్చారు. ఎవరా నారదుడు అంటే –

తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్ .. ఆయన నిరంతరము తపస్సు చేసే లక్షణం ఉన్నవాడు. వేద వేదాంగములను అర్థముతో తెలుసుకున్నవాడు. పరబ్రహ్మమును అనుభవంలోకి తెచ్చుకున్నవాడు. అంత గొప్ప గురువు అయిన నారదమహర్షి వాల్మీకి మహర్షి ఆశ్రమానికి వచ్చారు. గురువుగారే వస్తే ఏం చేయాలి అంటే –

నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్ – పరిపప్రచ్ఛ అంటే గురువుగారు కనపడగానే ముందు చేయవలసినదేది అంటే వినయ విధేయతలు చూపించడం. నా అంతవాణ్ణి నేను అని మాట్లాడటం కాదు. నేనెంతటివాణ్ణి అన్న భావన ముందు గురువు దగ్గర ఉండాలి. అందుకే – గురువుగారని ఎందుకు అంటారంటే – ఆయన గురువుగారు అయ్యారు అంటే నేను లఘువును అయ్యాను అని గుర్తు. నా గురువుగారు నాకు

కనపడ్డారు అనుకోండి వెంటనే నా యందు లఘుభావన కలగాలి. లఘువు అంటే? నేనెంతటివాణ్ణి ఆయన మహానుభావుడు. ఆయన పరబ్రహ్మం ఆయన దగ్గర నేను వినడం తప్ప, ఆయన దగ్గర నేను ఎక్కువ మాట్లాడకూడదు. ఆయన చెప్పినది శాసనం. గురువుగారు చెప్పినది ఈశ్వర వాక్కు కాబట్టి ఆయన చెప్పినది నేను వింటాను తప్ప నేను ఆయనకి చెప్పడం ఏమిటి? ఆయన అడిగితే చెప్తాను అన్న భావనతో మాట్లాడటం.

రెండవది – గురువుగారి దగ్గర మాట్లాడేటప్పుడు కానీ గురువుగారిని అడిగేటప్పుడు కానీ పరమ వినయంతో వారి శరీరానికి ఏ విధమైన క్లేశము కలగదు. వారికి అసౌకర్యం కలగట్లేదు అన్న విషయాన్ని రూఢి చేసుకున్న తర్వాత నేను దీనికి అధికారినైతే అర్హతను పొందిన వాడినైతే, మీరు నన్ను యోగ్యుడని భావిస్తే నాకు ఈ విషయం చెప్పండి అని వినయంతో అడిగితే “పరిప్రశ్న చేశారు..” అంటారు. భగవద్గీతలో మిగిలినవారిని ప్రశ్న చేస్తారు. ఒక్క గురువుగారి దగ్గర మాట్లాడినప్పుడు మాత్రం పరిప్రశ్న చేస్తారు. పరిప్రశ్న అంటే ?

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః..** అంటారు.

అంటే ఆయన బ్రహ్మమును తెలిసి ఉన్నవారు గురువు. అటువంటి గురువు దగ్గరికి వెళ్లి మాట్లాడడం ప్రారంభం చేయగానే మొట్టమొదటి చేయవలసినది నమస్కారం. నమస్కారం చేయడం దేనికి అంటే లోపల ఉన్న పరమోత్కృష్టమైన సంస్కారవంతమైన భావనను ప్రకటించడం. నమస్కారం అనేక విధాలుగా ఉంటుంది ఎట్లా చేసినా వినయం ప్రధానం. గురువుగారి దగ్గర ప్రణిపాతం – నేల మీద సాగిలపడ్డారు అనుకోండి. దాని అర్థం ఏంటంటే ఇంకా ఇంతకన్నా కింద పడటానికి ఏం లేదు అంత కింద పడిపోయిన వాడిని మీరు నన్ను ఉద్ధరించాలి అని గుర్తు. ఈ చేతులతో ఈ బుద్ధితో ఎన్నో చేయకూడని పనులు చేశాను ఇప్పుడు నన్ను సక్రమమైన

పనుల వైపుకు తిరిగి నడిపించవలసిన కర్తవ్యం మీమీద పెడుతున్నాను అని చెప్పడం – చేతులు జోడించి తలవంచి వినయంతో నమస్కరించడం. అంతటి వాల్మీకి మహర్షి కూడా నారద మహర్షి వచ్చినప్పుడు పరిప్రశ్న చేసి మాట్లాడారు అన్నారు. అంటే? అసలు మొట్టమొదట మానవీయ సంబంధములను ప్రారంభిస్తూ మానవరూపంలో ఉన్నా, మానవుడు కానివాడు; సాక్షాత్తు నడిచి వెళుతున్న పరబ్రహ్మమే.

గురుగీతలో పరమేశ్వరుడు పార్వతీదేవితో– జ్ఞానానల ప్రభావేన తస్మై శ్రీ గురవేనమః – అంటాడు. జ్ఞానాగ్ని ఒక రూపాన్ని ధరించి నడిచి వెళ్ళిపోతుంటే అదే గురువు. అటువంటి గురువు దగ్గర మాట్లాడేటప్పుడు నమస్కరించి వినయంతో పరిప్రశ్న చేసి మాట్లాడాలి. అసలు మొట్టమొదట మనకి నేర్పింది రామాయణం. మొదటి శ్లోకం దగ్గరే –

**తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్ ।**
**నారదం పరిపప్రచ్ఛ ర్వాల్మీకిర్మని పుంగవమ్ ॥**

అప్పుడు నారదుడిని వాల్మీకి మహర్షి అడిగారు.

**కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్ ।**
**ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః ॥**
**చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః ।**
**విద్వాన్ కః కః సమర్థశ్చ కశ్చైక ప్రియదర్శనః ॥**
**ఆత్మవాన్ కో జిత క్రోధో ద్యుతిమాన్ కః అనసూయకః ।**
**కస్య బిభ్యతి దేవాః చ జాత రోషస్య సంయుగే ॥**

పదహారు గుణములు పరిపూర్ణముగా కలిగినటువంటి మనిషి ఈ కాలమునందు ఈ దేశమునందు ఎక్కడైనా ఉన్నాడా అని అడిగారు. అడిగితే ఉన్నాడు. ఆయనే శ్రీరామచంద్రమూర్తి అని, రాముని కథని సంక్షిప్తంగా చెప్పాడు నారద మహర్షి. సంక్షేప రామాయణం అంటారు. గురువుగారు

ఏదైనా చెప్పి వెళ్ళిపోయారు అనుకోండి. గురువుగారు చెప్పినదానిమీదే మనస్సు లగ్నమై తిరుగుతోందనుకోండి. అది పరమోత్కృష్టమైన శిష్య లక్షణం. అది ఉండవలసిన లక్షణం. కాబట్టి వచ్చిన నారద మహర్షి గురుస్థానంలో కూర్చుని చెప్పవలసిన విషయాన్ని చెప్పేసి వెళ్ళిపోయారు. ఇప్పుడు వాల్మీకి మహర్షి శిష్యుడిగా ఉన్నారు. ఆయన – ఏది నారదుడు చెప్పి వెళ్ళిపోయారో ఆ సంక్షేప రామాయణాన్ని మనసులో స్మరిస్తూ, మధ్యాహ్న కాలమునందు స్నానం చేయడానికి తమసానదికి బయలుదేరి వెళ్లారు. అంటే ఏమిటి ?

**యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః ।**
**సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥**

నువ్వు వంద ఉపన్యాసాలు చెప్పడంకన్నా సంధ్యావందనం చేయడం మంచిది. సంధ్యావందనం మానేసి ఉపన్యాసం చెప్పడంకన్నా సంధ్యావందనం చేసి సభకు ఆలస్యంగా వెడితే వచ్చిన నష్టం ఏమీ లేదు

విహిత కర్మాచరణం విహిత కర్మాచరణమే. నువ్వు ఏది చేయాలో అది చేసి తీరాలి. అది వదిలిపెట్టి లోకోద్ధరణ కోసం నేను వెళతా అంటే అంగీకరించరు. నీకు ఏది విహిత కర్మయో అది నువ్వు చేయాలి. కాబట్టి ఇప్పుడు మాధ్యాహ్నిక సంధ్యావందనం చేయాలి మహర్షి. ఆయన అంత జ్ఞానంతో రగిలిపోతున్న వారు. అయినా లోకానికంతటికీ ఆదర్శవంతంగా ఉండాలి అంటే తాను ఏది చేయాలో అది చేసి చూపాలి. అందుకే ఆయన సంధ్యావందనం చేయడం కోసమని బయలుదేరి తమసానది స్నానానికి వెళుతున్నారు. అక్కడే గంగ ఉంది కానీ తమసానది తీరానికి వెళ్లి స్నానం చేయడానికి ఉద్యుక్తులౌతుంటే మహర్షి అద్భుతమైన ప్రారంభం చేస్తాడు.

భరద్వాజుడని ఒక శిష్యుడు ఆయనను అనుగమించాడు. ఎట్లా అనుగమించాడంటే – ఎంత అందమైన మాట చెప్పారంటే గురువుగారు ఏ

పని మీద బయలుదేరుతున్నారో ఆ పని మీద బయలుదేరినప్పుడు గురువుగారికి ఏ ఏ వస్తువులు అవసరమై ఉంటాయో తెలుసుకుని, శిష్యుడు వాటిని పట్టుకుని బయలుదేరడం ఉత్తమ శిష్య లక్షణం. గురువుగారి వెనకాల వెడుతున్నారంటే గురువుగారితో వెళ్లిపోవడం కాదు, గురువుగారు ఇప్పుడు ఈ పని మీద వెడుతున్నారు కాబట్టి ఈ పని మీద గురువుగారు వెళ్లినప్పుడు ఆయనకి ఈ వస్తువుల అవసరం కావచ్చు అని ఎవడు సిద్ధం చేసుకుని వెళుతున్నాడో ఆయన ఉత్తమ శిష్యుడు. అందుకే "ప్రా యచ్ఛత మునే స్త స్య వల్కలం నియతో గురోః" భరద్వాజుడు వెళ్ళేటప్పుడు ఏం పట్టుకు వెళ్ళాడంటే – ఒక కలశ పట్టుకు వెళ్ళాడు. గురువుగారు స్నానం చేసేటప్పుడు స్నాన శాటి అని ఒక వస్త్రం కట్టుకుని స్నానానికి దిగుతారు. ఆయన స్నానం చేసి బయటకు వచ్చిన తర్వాత ఆ బట్ట వదిలేసి, ఒక పొడి బట్ట కట్టుకుంటారు. ఒళ్ళు తుడుచుకుంటారు.  కాబట్టి ఇప్పుడు గురువుగారు స్నానం చేయడానికి ఒక బట్ట కావాలి. స్నానంచేసి బయటికి వచ్చిన తర్వాత కట్టుకోవడానికి ఓ పొడి బట్ట కావాలి; ఒళ్ళు తుడుచుకోవడానికి తువ్వాలు కావాలి; ఒకవేళ ఆయన లోపలికి దిగడానికి సిద్ధం ఐతే ఒక కలశ దగ్గర ఉండాలి;  స్నానం అయిపోయిన తర్వాత కలశతో నీరు పట్టి గురువుగారితో వెళ్లాలి. ఎందుకని అంటే గురువుగారు సంధ్యావందనం చేసుకోవడానికి నీళ్ళు అక్కడ పెట్టాలి. ఇవన్నీ మహర్షి చెప్పకుండా చెప్పడం ఋషివాక్కు.

మానవీయ సంబంధాల్లో ఒక గురువుని శిష్యుడు అనుగమించడం అన్న మాటకు అర్థం – గురువుగారి హృదయాన్ని తెలుసుకొని ఆయన ఎప్పుడు ఏది చేయాలో దానికి అనుగుణంగా శిష్యుడు ప్రవర్తించడం. అందుకని గురువుగారు స్నానం చేసి "నాయనా బట్ట ఏది?" అని అడిగితే "మీరు చెప్పలేదుకదా గురువుగారూ తెమ్మని?" అంటే ఇంకేం గురు శిష్య సంబంధం? వెంటనే భరద్వాజుడు ఆ వస్త్రాన్ని ఆయనకు అందించాడు. స్నానం అయిపోయింది.

అంటే దాన్నిబట్టి చెప్పకుండానే మహర్షి ఏం చెప్తున్నారు? గురువు విషయంలో శిష్యుడికి ఎప్పుడు ఉండవలసిన శ్రద్ధ మూడు రకాలుగా ఉంటుంది. గంగానది ఎట్లా మూడుగా ప్రవహిస్తుందో శిష్యుడు ఎప్పుడూ గురువు విషయంలో మూడింటిని ఆలోచిస్తూ ఉంటాడు.

మొదటిది స్థాన శుశ్రూష. అంటే గురువుగారు ఎక్కడ నివాసం చేస్తున్నారో అక్కడ గురువుగారు సౌకర్యంగా ఉన్నారా గురువుగారు అసౌకర్యంగా ఉన్నా మనకు చెప్తారా? నాకు ఇది అసౌకర్యంగా ఉంది – నాకు అది కావాలి.. ఇది కావాలి.. అని గురువుగారు అడుగుతారా? అడగరు. కానీ ఆయన అసౌకర్యంగా జీవిస్తున్నారు అనుకోండి. ఆయన ఆయుర్దాయం తగ్గిపోతుంది. ఆయన ఆయువు తగ్గిపోతే ఆయనకి శరీరం శాశ్వతం కాదని రూఢముగా తెలుసు కాబట్టి...

**నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।**
**న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః ॥**

ఆత్మని అనుభవంలోకి తెచ్చుకున్నవాడు కాబట్టి తృణప్రాయంగా శరీరం వదిలిపెట్టేస్తాడు. కానీ గురువుగారు శరీరం వదిలి పెట్టేస్తే దానివలన ఎవరికి అపకారం? – శిష్యులకు. గురువుగారి దర్శనం ఏది? ఏదైనా అనుమానం వస్తే ఎవరి దగ్గరికి వెళ్తారు? మనశ్శాంతి కోసం ఎవరి దర్శనం చేస్తారు? ఎవరి దర్శనం అభ్యున్నతి కారణం? అటువంటి గురువు శరీరంతో ఉండాలి అంటే స్థాన శుశ్రూష చెయ్యాలి. మీకు అందుకే పురాణాలు పరిశీలిస్తే కావ్యాల్లో కొన్ని విషయాలు కనపడతాయి. గురువుగారు ఉన్న ప్రదేశాన్ని శిష్యులు శుభ్రం చేశారు, అలికారు, ముగ్గు పెట్టారు ఇవన్నీ ఏమిటంటే స్థాన శుశ్రూష.

ఇక రెండవది దేహ శుశ్రూష. గురువుగారి శరీరం ఎక్కువ బడలి పోకూడదు. అయినా వయసుని దృష్టిలో పెట్టుకుని.. ఆయన ఇట్లాగే ఉంటే.. ఆయన బడలిపోతే ఆ బడలిక ఆయన అనారోగ్యానికి కారణం అవుతుంది.

అట్లా కాకూడదు. ఆయన ఆరోగ్యంగా ఉండి పదిమందికి తన విద్యా సంపత్తిని అందించాలి వాక్కుల ద్వారా. ఇది జరగాలి అంటే ఆయన శరీరాన్ని కాపాడుకుంటారు శిష్యులు దీన్ని దేహ శుశ్రూష అంటారు.

మూడవది ఆత్మ శుశ్రూష. గురువుగారు ఏం చెప్పారో దాన్ని ఒక్క అక్షరం కూడా జారిపోకుండా పట్టుకుంటాడు ఎంత బాగా పట్టుకుంటాడు అంటే ఆవు పాలు పితుకుతున్నప్పుడు పొదుగులో సిరను పట్టుకు లాగుతున్నప్పుడు ఆవుపాలు గిన్నెలోనే పడేటట్లుగా ఎంతజాగ్రత్తగా పిండుతారో, గురువుగారు మాట్లాడుతున్నప్పుడు ఆయన నోటి వెంట వచ్చిన మాటలు చెదిరిపోకుండా అంత జాగ్రత్తగా చెవులతో జుర్రుకుంటాడు శిష్యుడు. జుర్రుకొని దాన్ని బాగా జ్ఞాపకానికి తెచ్చుకుని దాన్ని అనుష్ఠానపర్యంతంలోకి తెచ్చుకుంటాడు. మా గురువుగారు చెప్పారండి నేను చేస్తున్నాను అంటాడు. దాన్ని ఆత్మ శుశ్రూష అంటారు.

ఈ మూడు శుశ్రూషలు మీకు వాల్మీకి వెనక వెళ్లిన భరద్వాజునిలో కనపడతాయి. అందుకే ఆయన ఏమీ మాట్లాడడు కానీ గురువుగారికేం కావాలో అన్నిటినీ పట్టుకుని బయలుదేరుతాడు. మహర్షికున్న గొప్పతనం ఏమిటంటే – శ్రీ రామాయణంలో ఏ కితాబులు ఇవ్వరు. చూడండి భరద్వాజుడు ఎంత బాగా వెంట వెళ్లాడో.. చూడండి వాల్మీకి ఎంత గొప్ప గురువుగారో.. చూడండి నారదుడు ఎంత గొప్ప గురువుగారో... ఇలా ఏమీ మాట్లాడరు. కావ్య భాష. అందంగా రామాయణ రచన వెళ్ళిపోతూ ఉంటుంది. మీరు చదువుతుంటే మీకు అందులో మానవీయ సంబంధాలు ప్రస్ఫుటంగా కనపడతాయి. ఓహో – ఇదన్నమాట రామాయణం నుంచి నేర్చుకోవలసింది. ఇందుకు రామాయణం వేదోపబృంహణం అయింది.

మనం ఎవరి దగ్గరైనా సరే ఏదైనా అడగొచ్చు వారు చెప్పింది సలహా కాబట్టి మనం వింటే వినొచ్చు లేకపోతే వదిలేయవచ్చు. కానీ గురువుగారిని అడిగితే మాత్రం అది శాసనం. అట్లా ఉండగలిగితే జీవితానికి గౌరవం అని

తెలుసుకోవడం రామాయణ కావ్య పఠనము చేత చేకూరుతుంది.

ఇప్పుడు స్నానం చేయడానికి సిద్ధపడిన మహర్షి ఒకసారి అటూ ఇటూ అడవిలో తిరుగుతున్నారు. ఎందుకంటే ఆయన మనసులో నారదుడు చెప్పిన రామాయణం అదేపనిగా తిరుగుతోంది. అకస్మాత్తుగా అక్కడకు వచ్చిన ఒక వేటగాడు క్రౌంచమిథునం. మగ పక్షి – ఆడపక్షి. క్రౌంచ పక్షులు విహరిస్తున్నాయి. విహరిస్తుంటే బాణం పెట్టి మగపక్షిని కొట్టాడు. ఆ మగపక్షి బాణపు దెబ్బ తగిలి కిందపడి నెత్తుటిలో కొట్టుకుంటుంది. అరణ్యం ఉన్న తర్వాత అటువంటివి సాధారణంగా సంభవిస్తాయి. కానీ మహర్షి హృదయం కదిలిపోయింది..

**మానిషాద ప్రతిష్ఠాం త్వమగమ: శాశ్వతీస్సమాః ।**
**యత్ క్రౌంచ మిథునాదేకమ్ అవధీ: కామ మోహితమ్ ॥**

**...**అన్నారు

"కామమోహితమైన రెండుపక్షులలో ఒకదానిని కూలవేసినటువంటి ఓ నిషాదుడా..!! నీవు చాలాకాలము జీవించకుండా ఉండెదవు గాక..!!" అంటే శపించాడు.

అదేమిటి? దానికి శాపం ఇవ్వడం ఏమిటి? మరి ఆయన పక్షిని కొట్టడా ఏమిటి? అంటే.. కాదు.. రామాయణం విన్న కారణం చేత ఆయన మనసు ఆర్ద్రం ఐపోయింది. ఎక్కడ అంత ప్రేమ తడి తగులుతుందో.. ఎక్కడ మనసు అంత మెత్తన అయిపోతుందో.. అక్కడ తప్ప రామాయణ రచనకు అధికారం ఇవ్వలేదు. రామాయణ రచన చేయాలన్నా, రామాయణం మాట్లాడాలి అన్నా నిజానికి మనసు మెత్తదైతే తప్ప బ్రహ్మగారు అనుగ్రహించరు. దానికి అర్థం – సమాజంలో ఉన్న వారి కష్టాన్ని చూసి ఆ కష్టం తమదే అన్నంత బాధపడగలగాలి. వేరొకరి సుఖాన్ని చూసి తన సుఖం అన్నంతగా పొంగిపోగలగాలి. ఈ రెండు లక్షణాలు ఎవరి యందు ప్రకాశిస్తాయో, వారికి రామాయణ రచనకు అధికారం ఇచ్చారు.

అంటే సామాజిక కర్తవ్యాన్ని ఎంత గొప్పగా చూపించారో చూడండి. మనం సాధారణంగా ఋణ త్రయం అని – ఋషి రుణం, దేవఋణం, పితృ ఋణం అని మూడు రకాల ఋణాలు చెప్తాం. భారతంలో వ్యాసుడు సామాజిక ఋణం అని, సమాజానికి కూడా మనం ఋణపడ్డామని చూపించాడు. అందుకే భారతంలో ఎప్పుడెప్పుడు సమాజానికి ఇబ్బంది కలుగుతుందో అప్పుడప్పుడు వ్యాసుడు ప్రత్యక్షమౌతూ ఉంటాడు. అట్లా సమాజానికి ఋణాన్ని ఎలా తీర్చుకోవాలో నేర్పింది రామాయణం కూడా.

కాబట్టి ఇప్పుడు వెనక వస్తున్న భరద్వాజుడు ఆ శ్లోకాన్ని విన్నాడు. నిజానికి అది, ఆయన కోపంతో ఇచ్చిన శాపం అయితే శ్లోకం ఇంత అందంగా రావడానికి వీల్లేదు. ఈ శ్లోకంలో ఏదో మంగళప్రదమైన అర్థం ఉంది. వాల్మీకి మహర్షికి లోపల రామాయణం తిరుగుతోంది. ఆ కారణం చేత అప్రయత్నంగా ఆ శ్లోకంలోనే మానిషాదః "లక్ష్మీదేవికి పతి ఐనటువంటి ఓ శ్రీనివాసుడా, రావణ మండోదరులన బడే దారితప్పి తిరుగుతున్న రాక్షస దంపతుల్లో ఒకరైన రావణాసురుణ్ణి వధించి ధర్మసంస్థాపన చేసిన నీ కథ శాశ్వతముగా భూమి మీద నిలబడి, విశేష కీర్తిని పొందెదవు గాక." అన్న మంగళాచరణం ఆ శ్లోకంలో వినబడుతుంది. అది రామాయణానికి ప్రారంభశ్లోకం అయింది.

మహర్షి మళ్ళీ వెళ్ళి స్నానం చేస్తున్నా బయటికి వచ్చినా ఆయనకి నోట్లో అదే తిరుగుతోంది. "ఇదేమిటి? నేను కోపంతో శాపం ఇచ్చినది నిజమైతే అదే వాక్కు నోట్లో మళ్లీ మళ్లీ తిరగకూడదు కదా. ఇట్లా ఎందుకు జరుగుతోంది?" అని అడిగారు. భరద్వాజుడు, గురువుగారు తన నోటితో ఏ మాట అన్నారో, వెంటనే దాన్ని కంఠగతం చేసుకున్నాడు. గురుహృదయాన్ని పట్టుకున్నాడు. ఇది శాపవాక్కు కాదు. ఇందులో ఏదో మంగళప్రదం అయినటువంటి లక్షణం కనబడుతోంది. పరిశీలనం చేస్తే అది పాట పాడడానికి వీలుగా ఉంది. అది వీణ వాయించడానికి వీలుగా పలుకుతోంది. అంటే ఇందులో ఏదో సామవేదసారం కనబడుతోంది. కనుక "నాయనా భరద్వాజా ఈ శ్లోకం చాలా గొప్పది." అన్నారు గురువుగారు.

ఇద్దరు కలిసి ఆశ్రమానికి వెళ్లారు. ఆశ్రమానికి వెళ్లిన తర్వాత బ్రహ్మగారు వచ్చారు; బ్రహ్మ గారికి శుశ్రూష చేశారు; అర్ఘ్య పాద్యములిచ్చారు; నమస్కరించారు. బ్రహ్మంగారు వరం ఇచ్చారు. ఆయన ఇచ్చినటువంటి వరం చేత వాల్మీకి మహర్షి ఆచమనం చేసి రామాయణ రచనకు కూర్చుంటే, కూర్చున్న ఉత్తర క్షణం నుంచి రామాయణంలో ఉన్న వ్యక్తులయొక్క మనసులలో ఉన్న అభిప్రాయాలు కూడా వాల్మీకి మహర్షికి తెలిసి పోతాయి. అటువంటి వరం ఇచ్చారు. ఎందుకంటే, బయట కథలో ఒకలా కనబడుతూ, మనసులో ఏదైనా అపవిత్రత ఉందేమో అని అనుమానం ఉంటే అది కనపడుతుంది వాల్మీకి మహర్షికి. అటువంటి వరం ఇచ్చారు. అందుకే శ్రీరామాయణం వాల్మీకి మహర్షి కృతమైన దేదైతే ఉందో అది ఆర్షము. పరమ సత్యం. కాబట్టి "నువ్వు ఇప్పుడు ఈ రామాయణ రచన చెయ్యి – నిన్ను అనుగ్రహిస్తున్నాను పర్వతములు, నదులు, సముద్రములు, భూమి ఎంతకాలం ఉంటుందో రామాయణము అంత కాలం ఉంటుంది. రామాయణము వేదోపబృంహణము ఔతుంది." అని వరమిచ్చారు. అప్పుడు రామాయణ రచన చేశారు.

రామాయణ రచన చేసిన వాల్మీకి మహర్షికి ఒక అనుమానం వచ్చింది. ఇంత గొప్పగా ఈ రామాయణ రచన చేశాను. ఇప్పుడు ఇది గానం చేయాలి. నిజానికి రామాయణాన్ని ప్రవచనం చేయమనో, రామాయణ శ్లోకాలు చదవమనో, వప్పచెప్పమనో, మహర్షి ఇవ్వలేదు. మహర్షి ఉద్దేశ్యం ఏమిటంటే శ్రీ రామాయణంలో ఉన్న శ్లోకాలను గానము చేయండి అని ఇచ్చారు అంటే నిజానికి నాకు వ్యక్తిగతంగా అనిపిస్తుంది వాల్మీకి మహర్షి రామాయణంలో ఫలశ్రుతి చెప్పరు. ఎంతెంత గొప్ప విషయాలకి కూడా చెప్పరు. కానీ ఆయన బాలకాండలో సుబ్రహ్మణ్యోత్పత్తికి ఫలశ్రుతి చెప్పారు. గంగావతరణకి ఫలశ్రుతి చెప్పారు. ఆదిత్యహృదయాన్ని ఫలశ్రుతితో ప్రారంభం చేశారు యథార్థమునకు జాతికి అందవలసిన ఏది అంటే వీటిని దోషాలు లేకుండా, తప్పులు లేకుండా స్వరభంగం లేకుండా పాడగలిగిన వారు పాడి ఇంట్లో వినపడితే దేవతలు ప్రసన్నులు ఔతారు.

నిజానికి వాల్మీకి మహర్షి దాన్ని గానం చేయమని ఇచ్చారు. అట్లా గానం చేయగలిగిన వాళ్ళు ఎవరు? ఎవరు శృతి తప్పకుండా పాడతారు? అని ఆలోచన చేస్తూ ఉండగా లవకుశులిద్దరు వచ్చి ఆయన పాదములు పట్టి నమస్కరించారు. ఆయన వెంటనే ఆలోచించారు వీళ్లు మేధావులు. ఏదైనా వింటే బాగా ధారణ చేస్తారు. వేద వేదాంగములను చదువుకున్నారు కాబట్టి నేను వీళ్ళకి ఈ రామాయణాన్ని నేర్పుతాను అని, 24 వేల శ్లోకాల రామాయణాన్ని లవకుశులకు నేర్పాడు. నేర్పినప్పుడు ఆయన ఉద్దేశ్యం ఏమిటంటే దీన్ని గానం చేయండి అని.

లవకుశులు మొట్టమొదట శ్రీ రామాయణాన్ని ఎక్కడ పాడారంటే వాల్మీకి మహర్షి ఆశ్రమంలోనే. పాడినప్పుడు వాల్మీకి మహర్షి దర్శనం కోసం వచ్చినటువంటి ఋషులందరూ కూర్చున్నారు. అందరూ చాలా పరవశించి పోయారు. ఆ విన్న ఋషులు ఎంత ఆనంద పడిపోయారు. ఒక ఆయన లేచి తన కమండలం ఇచ్చేశాడు. ఒక ఆయన యజ్ఞోపవీతం ఇచ్చాడు. ఒకాయన కట్టుకోవడానికి వల్కల వస్త్రాన్ని ఇచ్చాడు ఒకాయన దర్భల కట్ట ఇచ్చాడు. అంటే వాళ్ల దగ్గర అప్పటికి ఏమున్నాయో అవన్నీ బహుమానాలుగా ఇచ్చేశారు. అంటే ఆ పిల్లలు చాలా బాగా పాడారు. ఇప్పుడు లోకంలో రామాయణానికి వ్యాప్తి జరగాలి ఇందులో సకల ధర్మములు చెప్పబడ్డాయి. మహర్షి వాళ్ళకి అనుమతినిచ్చి శ్రీ రామాయణ గానం చేయండి అని పంపించారు.

అసలు మొట్టమొదట రామాయణం బాలకాండ పరిచయసర్గలోనే, గురువు–శిష్యుడు, శిష్యుడు–గురువు ఎన్ని జంటలు కనపడతాయో. నారదుడు గురువు వాల్మీకి శిష్యుడు. వాల్మీకి గురువు భరద్వాజుడు శిష్యుడు. బ్రహ్మగారు గురువు వాల్మీకి శిష్యుడు. వాల్మీకి గురువు లవకుశులు శిష్యులు. లవకుశులు గురువులు లోకం అంతా – అంటే విన్నవాళ్ళు శిష్యులు. ఇట్లా ఎంతమంది గురు శిష్య సంబంధాలతోనో ప్రారంభం. మీరు ఎక్కడ గురుశిష్య

సంబంధంలోనైనా చూడండి ‘గురువుగారు’ అనేటప్పటికి మాత్రం శిష్యుల వైపునుంచి వినయం కనపడుతుంది. అసలు దీనికి అంతటికి పతాకస్థాయి సన్నివేశం ఎక్కడ అంటే శ్రీరామావతారం వచ్చిన తర్వాత. ఎందుకంటే ఆయన సాక్షాత్తు శ్రీమహావిష్ణువు. అందులో అనుమానం లేదు. దశరథ మహారాజు యజ్ఞం చేస్తున్నప్పుడు – శంఖ చక్ర గదా పద్మములను పట్టుకుని, పచ్చని పట్టుబట్ట కట్టుకుని, సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువే సభలోకి వచ్చి “కృత్వాత్మానం చతుర్విధం..” నన్ను నేను నాలుగుగా విభాగం చేసుకుని రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు అన్న పేర్లతో దశరథ మహారాజు గారికి కొడుకులుగా వచ్చి రావణ సంహారం చేసి పదకొండువేల సంవత్సరములు భూమి మీద ఉండి ధార్మికంగా పరిపాలన చేసి మనుష్యుని గొప్పతనాన్ని నిరూపణం చేస్తానని ప్రకటించాడు. అలా ప్రకటించి విష్ణువు తన రూపాన్ని అంతర్ధానం చేశారు కాబట్టి వచ్చిన వాడు విష్ణువే అనుమానం లేదు. కానీ మీరు జాగ్రత్తగా గమనిస్తే విష్ణువు ఏదో అకస్మాత్తుగా విష్ణువుగా వచ్చేశారు అనుకోండి. వచ్చేస్తే రావణసంహారం జరగదు. ఎందుకు జరగదు అంటే కేవల నరుడిగా ఉంటేనే – (ఆయన వరం అడిగాడు) కాబట్టి నరుడిగా మాత్రమే సంహారం చేయాలి. కేవల నరుడిగా రావాలి అంటే నేను భగవంతుడిగా వస్తానంటే కుదరదు. ఇప్పుడు కృష్ణాష్టమి వస్తోంది. ఆ కారాగారంలో దేవకీదేవి గర్భాన పుట్టినప్పుడు

**జలధరదేహు, నాజానుచతుర్బాహు,**
**సరసీరుహాక్షు, విశాలవక్షు,**
**చారుగదాశంఖచక్రపద్మవిలాసుఁ**
**గంఠకౌస్తుభమణి కాంతిభాసుఁ,**
**గమనీయ కటిసూత్రకంకణకేయూర,**
**శ్రీవత్సలాంఛనాంచితవిహారు,**
**నురుకుండల ప్రభాయుతకుంతల లలాటు,**
**వైడూర్యమణిగణవరకిరీటు,**

**బాలుఁ, బూర్ణేందురుచిజాలు, భక్తలోక**
**పాలు, సుగుణాలవాలుఁ, గృపావిశాలుఁ,**
**జూచి, తిలకించి, పులకించి, చోద్యమంది,**
**యుబ్బి, చెలరేగి వసుదేవుఁ డుత్సహించె...**

అంటారు పోతన గారు దశమ స్కంధంలో.

శంఖ, చక్ర, గదా, పద్మాలతో పట్టుబట్ట కట్టుకుని కారాగారంలో దేవకీ వసుదేవులకు దర్శనమిచ్చాడు. వామనమూర్తిగా వచ్చేముందు "అమ్మా – నీ కడుపున పుట్టాలని ఉందమ్మా" అని చెప్పి శ్రీ మహావిష్ణువుగా ప్రత్యక్షమై అదితిని అడిగితే

**చూపుల శ్రీపతి రూపము**
**నాపోవక త్రావి త్రావి హర్షోద్ధతయై**
**వాపుచ్చి మందమధురా**
**లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్.**

సాక్షాత్తు నారాయణుడిగా వామన మూర్తిగా వచ్చేముందు దర్శనమిచ్చాడు. శ్రీరామావతారంలో అలా కుదరదు. సాక్షాత్తు విష్ణువుగా ప్రభవించడానికి సాధ్యం కాదు. నరుడిగానే రావాలి. అందుకే నరుడి పుట్టుకలో ఎంత క్లేశం ఉంటుందో అది నరకం. గర్భస్థ నరకం. అది భగవంతుడికి అవసరం ఏముంది? కానీ మనుష్యజాతి ప్రతిష్ఠ నిలబెట్టడం కోసం ఆయన గర్భస్థనరకాన్ని అనుభవించారు. పన్నెండు నెలలు కౌసల్యా గర్భవాసం చేసి కర్కటరాశిలో సూర్య, చంద్ర, గురు, శుక్ర, శని, కుజ ఇటువంటి గ్రహాలన్నీ ఉచ్చ స్థితిలో ఉండగా ఆయన శుక్ల పక్షంలో నవమి తిథినాడు చైత్రమాసంలో ఆవిర్భవించారు. ఆవిర్భవించిన స్వామి సాక్షాత్తు విష్ణువు కావచ్చు. కానీ నరుడిగా వచ్చాడు.

నరుడిగా వచ్చిన వాడికి తేజస్సు దేని వలన కలుగుతుంది? గురువుగారి

వలన కలగాలి. గురువుగారు పాఠాలు చెప్పకపోతే గురువుగారు విద్య నేర్పకపోతే వచ్చినవాడికి ఎక్కడి నుంచి వస్తుంది విద్య? అకస్మాత్తుగా నేను విష్ణువుని నాకు అన్నీ తెలుసు అంటే? నరుడు ఎట్లా అవుతాడు? కాబట్టి ఇప్పుడు గురువుని సేవించవలసిందే. సేవించి గురువుకి నమస్కరించి గురువు దగ్గర విద్య పొందాలి. ఈ అవకాశం కోసమే ఇక్ష్వాకువంశానికి పౌరోహిత్యం చేశాడు వశిష్ఠ మహర్షి. ఆయన బ్రహ్మర్షి – ఆయనకి ఏమి అవసరం? ఎందుకంటే అక్కడకు వచ్చేటప్పటికి పెద్ద ఆశ్చర్యకరమైన విషయం జరిగింది.

అద్వైతంలో గురుపరంపర చెప్తారు. చెప్పినప్పుడు నారాయణం – పద్మభవం – వశిష్ఠం. నారాయణమూర్తి మొట్టమొదట. ఆయన కొడుకు బ్రహ్మగారు తర్వాత గురువు. బ్రహ్మగారి కొడుకు వశిష్ఠుడు తర్వాత గురువు. అంటే వశిష్ఠుడికి గురువు ఎవరు తండ్రి బ్రహ్మగారు. పరమగురువు ఎవరు నారాయణమూర్తి. ఇప్పుడు పరమగురువు అయినటువంటి నారాయణమూర్తి కనపడ్డాడు అనుకోండి నిజానికి వశిష్ఠుడు, ఆయన గురువుగారు బ్రహ్మగారు కలిసి నమస్కారం చేయాలి. అటువంటి పరమగురువైన నారాయణమూర్తి ఇప్పుడు రామచంద్రమూర్తిగా వచ్చారు. వచ్చి – పరమగురువు అయిన నారాయణమూర్తి, తనకి ప్రశిష్యుడైనటువంటి వశిష్ఠ మహర్షి కాళ్ళకి నమస్కారంచేసి విద్య నేర్చుకుంటున్నాడు. ఎంతమందికి సాధ్యమవుతుంది అలా ఆశ్చర్యకరమైన అదృష్టం?

లోకానికి రామనామం ఇవ్వచ్చు స్మరించడానికి, అందుకు వశిష్ఠుడు పౌరోహిత్యం చేశాడు. కాబట్టి ఇప్పుడు అలా నరుడిగా వచ్చిన రాముడికి లక్ష్మణుడికి భరతుడికి శత్రుఘ్నుడికి విద్యాభ్యాసం ఎవరు చేయించాలి అంటే గురువుగారు చేయించాలి. గురువుగారు పాఠం చెప్పారు ఎంత బాగా చెప్పారు? అసలా గురుశిష్య సంబంధం ఎలా ఉంటుందో ఒకే శ్లోకంలో చెప్పారు మహర్షి.

**"సర్వే వేదవిద శ్శూరాః సర్వే లోకహితే రతాః సర్వే జ్ఞానోప సంపన్నాః సర్వే సముదితా గుణైః"**

పుట్టుకతో ఆయనకా శక్తి లేదు. పెరుగుతుండగా ఆ శక్తి లేదు. కానీ ఆయనకి ఒక గొప్ప శక్తి వచ్చింది ఎక్కడి నుంచి వచ్చింది అంటే ఆయన చదువుకున్నాడు. ఆయన చదువుకున్న తర్వాత ఆయన పేరు పక్కకి కొన్ని అక్షరాలు వచ్చాయి. ఆ అక్షరాలు ఆయన పేరు పక్కకు వచ్చిన కారణం చేత ఆయన ఒక విశేషమైన అధికార స్థానంలోకి తీసుకెళ్లి కూర్చోపెట్టబడ్డాడు. ఇప్పుడు ఆయన ఒక్క చేవ్రాలు చేస్తే – ఒక్క సంతకం పెడితే – ఆయన ఎంత గొప్ప ఉపకారం అయినా చేయగలడు. ఇప్పుడు ఇంత గొప్ప విద్యనంతటిని కూడా నేర్పి ఒక్క సంతకం పెడితే వేలమందికి ఉపకారం చేయగలిగినంత శక్తి అతనిని ఆవహించిఉంది. నిద్రపోతున్నప్పుడు కలెక్టర్ గారు కలెక్టర్ గారు కాదని మీరు అనగలరా ? కలెక్టర్ గారు నిద్రపోతున్నారు నిద్రలేస్తే కలెక్టర్ తప్ప ఆయన కలెక్టర్ కాకుండా ఉండరు. అధికారం ఆయనను ఆవహించి ఉంది. ఇంత అధికారం దేనివల్ల వచ్చింది? అంత శక్తి ఎక్కడి నుంచి వచ్చింది? చదువులో నుంచి వచ్చింది. చదువెవరు నేర్పారు? గురువులు నేర్పారు. కేవలం చదువు ఒకటి నేర్పి గురువు వదిలి వేసాడు అనుకోండి. ఆ వచ్చిన అధికారం, ఆ వచ్చిన తేజస్సు, తన స్వార్థ ప్రయోజనానికి వాడుకోవడం మొదలుపెట్టాడు అనుకోండి. దేశం సర్వనాశనం అయిపోతుంది. ప్రజలకి ధర్మం మీద నమ్మకం నశించిపోతుంది.

అసలు ఎవరికైనా కూడా మనని కాపాడేవాడు ఉన్నాడన్న నమ్మకమే గురువు. గురువు, శిష్యుడికి చదువు నేర్పినప్పుడు తేజస్సు కట్టపెట్టినప్పుడు శిష్యుడికి నేర్పవలసింది ఏమిటంటే నీకు నేను కట్టపెడుతున్న ఈ శక్తిని స్వార్థ ప్రయోజనానికి వాడరాదు. దేశ ప్రయోజనం కోసం, ప్రజలకోసం నువ్వు ఖర్చు పెట్టాలి తప్ప నీ సొంతానికి వాడుకోకూడదు.

అందుకే సర్వే వేదవిద శ్శూరాః. వాళ్ళు నలుగురు వేదవిదులు. గొప్ప శూరులయ్యారు. ఇన్ని అస్త్రాలు నేర్పాడు.

సర్వే లోకహితే రతాః ఎంత శక్తి వచ్చిందో ఆశక్తి అంతా లోకహితానికి తప్ప మనం ఇతరమైన విషయాలకి ఖర్చు పెట్టరాదు మీరు నన్ను క్షమించ గలిగితే నేనొక మాట అంటాను – విద్యా విధానానికి ఉండవలసిన మౌలికమైన లక్షణాన్ని రామాయణం సూచించింది. గురువు శిష్యుడికి కేవలం పాఠాలు చెప్పి తద్వారా విద్యను సముపార్జించి అధికార స్థానాల్లో కూర్చునే యోగ్యతను ఒక్కదానినే కట్టబెట్టడం కాదు. దానితో పాటు లోకహితానికి ప్రవర్తించగలిగిన సమున్నతమైన సంస్కార బలాన్ని అందించగలగాలి.

సర్వే జ్ఞానోప సంపన్నాః వాళ్లకి గొప్ప జ్ఞానం కలిగింది.

సర్వే సముదితా గుణైః ఎవరిని చూస్తే ప్రేమ కలగాలో ఆ ప్రేమ కలగాలి ఆ గుణం కలగాలి. ఎవరికి దానం చేయాలో వారికి దానం చేయాలి. ఆ గుణం ఉండాలి ఎవరిని శిక్షించాలో వారిని శిక్షించాలి. ఎవరికి శుశ్రూష చేయాలో వారికి శుశ్రూష చేయాలి. ఎవరి గురించి తప్పుగా మాట్లాడకూడదో వారి గురించి మాట్లాడుకోకుండా నిగ్రహించుకోగలగాలి. ఇవన్నీ గుణములుగా రావాలి అంటే గురువుగారు పాఠం చెప్పడంలో వింటున్నప్పుడు ఇవన్నీ చెప్పకుండా చెప్పి చెప్పేసాడు. అంత అందంగా చెప్పారు.

నిజానికి రాముణ్ణి చెక్కినవారు ఎవరు? గురువులే! రాముడు అంత గౌరవింప పడుతున్నాడు. ఇవాల్టికి కూడా రామకథ బ్రతికి ఉన్నది. ఎప్పటికీ ఉంటుంది. రామాయణానికి అంత గొప్పతనం వచ్చింది అంటే రాముణ్ణి చెక్కిన శిల్పులు వశిష్ఠ విశ్వామిత్రులు, శరభంగుడు, సుదీక్షణుడు, అగస్త్యుడు. ఈ గురువులందరూ చెక్కారు.

నేను ఒకప్పుడు విశాఖపట్నంలో ఒక సభలో ఈ మాట అన్నాను. అన్న తర్వాత నేను ఆశ్చర్యపోయింది ఏమిటంటే ఎనిమిదో తరగతి చదువుతున్న

ఒక పిల్ల నా దగ్గరికి ఒక చిత్రాన్ని గీసి పట్టుకొచ్చింది. ఒక శిల. ఆ శిలని కొంతమంది ఋషులు కలిసి చెక్కుతున్నారు. అందులో నుంచి రాముడు ఆవిర్భవిస్తున్నాడు. మీరు చెప్పిన దాన్ని నేను ఆదర్శంగా తీసుకుని ఇలా గీశాను అన్నది. ఇప్పటికీ నేను మా ఇంట్లో దాన్ని ఎంతో భద్రంగా దాచుకున్నాను. ఒక పిల్ల అంత బాగా పట్టుకుందే రామాయణాన్నీ అని.

ఒక శిల్పి రాతిలో నుంచి విగ్రహాన్ని చెక్కి ఇచ్చేస్తాడు. దాన్ని దేవాలయంలో ప్రతిష్ఠ చేసి అభిషేకం చేస్తారు; పూజ చేస్తారు. ఆ మూర్తి అనుగ్రహం చేత వాంఛితాలన్నిటినీ నెరవేర్చుకుంటారు. ఒకసారి దేవతాప్రతిష్ఠ అయిపోయిన తర్వాత ఇంకా అందులో పంచలోహాలు ఉన్నాయా? అది దారు శిల్పమా? శిలా శిల్పమా? అని మాట్లాడితే మీకు అక్కడ అమ్మవారు కనపడట్లేదు అని గుర్తు. అందులో పంచలోహాల సంగతి మీకెందుకు ఆవిడ ముందు నుంచుని? ఆవిడ అమ్మవారు అంతే. శారదాదేవి అక్కడ ఉన్నది. అంతేగాని శారదాదేవి పంచలోహ విగ్రహమండీ అంటే? ఆవిడ శారదాదేవి ఎందుకైంది? అవన్నీ మాట్లాడటం కాదు భక్తి అన్న మాటలో మాట్లాడేటప్పుడు ఉండవలసిన మర్యాద తెలుసుకోవాలి. ఇది నామాట కాదు. రామాయణం వాక్కు. అందుచేత –

**“సర్వే వేదవిద శ్శూరాః సర్వే లోకహితే రతాః**
**సర్వే జ్ఞానోప సంపన్నాః సర్వే సముదితా గుణైః”**

అవి గుణములుగా మారాయి. రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల యందు.

అంత కష్టపడి చదువుకున్నారు. ఐతే వశిష్ఠుడు గురుస్థానంలో కూర్చున్నాడు. కూర్చుని శిష్యులకు పాఠాలు నేర్పాడు. నాకూ ఓ అదృష్టం కలగాలి. అసలు రామావతారం ఎందుకొచ్చింది? పరిపూర్ణమైన మనుష్యునిగా తయారు కావాలి. అంటే మనిషి జీవితం గురించి అవగాహన కలగాలి.

రావణ సంహారానికి కావలసిన సమస్త అస్త్రములు రాముడికి ఇవ్వాలి. ఎందుకంటే కేవలం మనిషిగా వస్తే రావణున్ని చంపలేరు. అంత గొప్ప అస్త్రబలం ఉంది రావణాసురుడి దగ్గర. ఆయనతో యుద్ధం చేయాలి అంటే అంత అస్త్రబలం ఉండాలి. ఆరోజులలో అంత అస్త్రబలం ఉన్నవాడు విశ్వామిత్రుడు ఒక్కడే. ఇప్పుడు యోగ్యుడైన శిష్యుడు ఎవరు? రామచంద్ర మూర్తి, ఈయనకి ఇస్తే లోకానికి రక్షణ కలుగుతుంది. రావణ సంహారం జరుగుతుంది కాబట్టి నేను వెళ్లి రాముణ్ణి శిష్యుణ్ణి చేసుకోవాలి. ఇది విశ్వామిత్రుడి తాపత్రయం. దశరథ మహారాజు గారికి నరుడిగా తాపత్రయం. పిల్లవాడు పుట్టాడు పెద్దవాడయ్యాడు; యుక్తవయస్సులోకి వచ్చేస్తున్నాడు తగిన పిల్లను చూసి పెళ్లి చేసెయ్యాలని ఆయన తాపత్రయం. అందుకని –

**“తస్య చింతయ మానస్య మంత్రి మధ్యే మహాత్మనః**
**అభ్యాగచ్ఛన్ మహాతేజా విశ్వామిత్రో మహామునిః”**

దశరథ మహారాజుగారు మంత్రులందరినీ కూర్చోబెట్టుకుని, మా రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు తగిన పిల్లలు ఎవరున్నారు వెతికి తీసుకురండి వివాహం చేస్తానంటున్నాడు. వివాహం చేసేయడం అంటే తగిన పిల్ల అని చెప్పి ఎవరో ఎవర్నో తీసుకొచ్చి వివాహం చేసేస్తే సీతమ్మ..? ఆయనను విడిచిపెట్టి ఉండదావిడ..!! ఆయన ఎక్కడకు వస్తే అక్కడికి అవతారం దాల్చి ఆవిడ వస్తుంది.

**శ్రీరమ సీతగాగ నిజ సేవక బృందము వీరవైష్ణవా**
**చారజనంబుగాగ విరజానది గౌతమిగాగ వికుంఠము**
**న్నారయ భద్రశైల శిఖరాగ్రముగాగ వసించు చేతనో**
**ద్ధారకుడైన విష్ణుడవు దాశరథీ కరుణాపయోనిధీ...!**
**ఆవిడ వెంటనే వచ్చేస్తుంది స్వామితో..!!**

**అనఘ! యాదిలక్ష్మి యైన రుక్మిణితోడఁ**
**గ్రీడ సలుపుచున్న కృష్ణుఁ జూచి**
**పట్టణంబులోని ప్రజ లుల్లసిల్లిరి**
**ప్రీతు లగుచు ముక్తభీతు లగుచు."**

ఆయన కృష్ణపరమాత్మగా వస్తే ఆవిడ రుక్మిణీదేవిగా వచ్చేస్తుంది. నిజానికి ఆవిడ తప్ప రావణాసురుడు అపహరిస్తే తట్టుకోగలిగిన వాళ్ళెవరు? ఆవిడని ఇచ్చి వివాహం చేయాలి. సీతారామకళ్యాణం జరగాలి. వాళ్ళిద్దర్నీ కలిపాను అన్న ఖ్యాతి నాకు దక్కాలి. అస్త్రములను అన్నిటినీ రాముడికి మేము ఇవ్వాలి. ఇది విశ్వామిత్రుడు తాపత్రయం.

పెళ్లి గురించి దశరథుడు మాట్లాడుతుంటే అప్పుడే ముహూర్తం పెట్టుకుని వచ్చినట్లుగా విశ్వామిత్రుడు అప్పుడే వచ్చాడు. విశ్వామిత్రుడు వచ్చాడంటే దశరథ మహారాజుకు భయం ఏమిటంటే అంతకుముందు ఆయన కోపిష్ఠి. ఇప్పుడు బ్రహ్మర్షి. నాడు కోపిష్టి ఎక్కడ కోప్పడతాడో అని గబగబా వచ్చాడు అర్ఘ్య పాద్యాలిచ్చాడు – "అద్యమే సఫలం జన్మ జీవితం సుజీవితం" అన్నాడు. ఇవాల్టితో నా జీవితం సఫలం అయిపోయింది. నా జీవితం గొప్ప జీవితం అయిపోయింది. మీవంటి అతిథి వచ్చాడు. మీకేం కావాలి చెప్పండి ఇచ్చేస్తానన్నాడు. పెద్దాయన అసలేమీ మాట్లాడలేదు. అది పెద్దవాళ్ల లక్షణం. ఏమి మాట్లాడకుండా వాళ్ళు ఉంటారు. మన అజ్ఞానం అంతా మాట్లాడి మనం బయట పెట్టుకుంటాం. అందుకని విశ్వామిత్రుడు అట్లాగే కూర్చున్నాడు ఈయన మాట్లాడడం మొదలు పెట్టేసాడు. "మీరంత వారు గొప్పవారు బ్రహ్మర్షి అయ్యారు మీ తపస్సంత గొప్పది. మీకు ఏం కావాలి చెప్పండి? మీకు ఇచ్చేస్తాను. మీకు ఇవ్వడం కన్నా నాకు ఏం కావాలి?" అని అన్నాడు.

అన్నీ విని ఆయన అన్నాడు – "నేను యజ్ఞం చేస్తున్నాను దీక్షలో ఉంటాను. రాక్షస సంహారం నేను చేయకూడదు. రామలక్ష్మణులని

పంపించండి" అన్నాడు. "వాళ్ళు ఎవరు?" అన్నాడు దశరథుడు. 'మారీచ సుబాహులు' అన్నాడు విశ్వామిత్రుడు. వాళ్ల పేరు చెప్పినప్పటికే ఈయనకి గుండె జారిపోయింది.

**ఊన షోడశ వర్షోమే రామో రాజీవలోచనః**
**న యుద్ధ యోగ్యతామస్య పశ్యామి సహ రాక్షసైః.**

పదహారేళ్ళు కూడా నిండలేదు. ఈ రాముణ్ణి మీతో పంపించనా? ఈ రాముడు యుద్ధం చేస్తాడా? చేయలేడు, రాముడే కాదు. నేను వస్తాను నా సైన్యంతో వస్తానన్నాడు. ఆ తర్వాత రావణాసురుడు గురించి విన్నాడు. అయ్యబాబోయ్ రావణాసురుని పనుపున ఉన్న మారీచ సుబాహుల జోలికి నేను కూడా వెళ్ళలేను. నేనొచ్చి మాత్రం ఏంచేస్తానన్నాడు. విశ్వామిత్రునికి నిజంగా చికాకు కలిగింది. అడక్కుండానే ఇచ్చేస్తాను ఇచ్చేస్తాను ఇచ్చేస్తాను అని వెంటబడ్డావు. తీరా అడిగిన తర్వాత ఇవ్వనని చెప్పవు. ఈ డొంకతిరుగుడు వ్యవహారమంతా మాట్లాడుతున్నావు. అందుకని ఆయన అన్నాడు – "మిధ్యా ప్రతిజ్ఞ కాకుత్సా సుఖీభవ సబాంధవ.." అన్నాడు. "ఓ మాట తప్పిన మహారాజా చాలా కాలం జీవించి ఉండు" అని ఆశీర్వచనం చేశాడు.

మిధ్యా ప్రతిజ్ఞ కాకుత్సా – నువ్వు చేయలేని పని చేస్తానని పెద్ద డబ్బాలు పలికావు కదూ. అటువంటి డంబాలు పలికినందుకు గాను చాలాకాలం జీవించెదవు గాక అని ఆశీర్వచనం చేసి లేచి వెళ్లిపోతున్నాడు.

ఒక గురువు గొప్పతనం ఎవరు కనిపెట్టాలి? ఇంకో గురువే కనిపెట్టాలి. వెంటనే వశిష్ఠుడు లేచి దశరథ మహారాజు గారితో అన్నాడు – దశరథా! విశ్వామిత్రుడు అంటే ఏమనుకుంటున్నావు? ఈయన సామాన్యుడా?

**"ఏష విగ్రహవాన్ ధర్మః... ఏష వీర్యవతాం వరః... ఏష బుధ్యాధికో లోకే... తపసశ్చ పరాయణం..."**

ఇవే తర్వాత శిష్యుడయ్యాడు. అది ముందు ఎవరికున్న బిరుదు అంటే విశ్వామిత్రుడు కున్న బిరుదు.

ఏష విగ్రహవాన్ ధర్మః విశ్వామిత్రుడు అంటే నడిచి వెళ్ళిపోతున్న ధర్మం అదే తరవాత రామో విగ్రహవాన్ ధర్మః గురువును పట్టుకుని తరవాత శిష్యుడు అదే అయ్యాడు. ధర్మం అంటే ఏమిటో చెప్పాలంటే నడిచి వెళ్ళిపోతున్న ధర్మమే విశ్వామిత్రుడు.

'ఏష వీర్యవతాం వరః' వీర్యము అన్న మాటకు అర్థం ఏంటంటే ఎంత మంది ఎదురుగుండా వచ్చి నిలబడనివ్వండి. కోటి మంది వచ్చి నిలబడనివ్వండి. కోటి మంది బాణాలకి తాను బాణమును వేసి ప్రతిఘటించి కోటి మందిని పడకొడుతూ తన మీద బాణం పడకుండా చూసుకో గలిగిన ప్రజ్ఞ. అలా నిలబడితే వీర్యం అంటారు. అది విశ్వామిత్రుడు దగ్గర నేర్చుకున్నాడు రాముడు.

అందుకు –

**భండన భీముడార్తజన బాంధవుడుజ్జ్వల బాణతూణ కో**
**దండ కళాప్రచండ భుజ తాండవ కీర్తికి రామమూర్తికిన్**
**రెండవ సాటి దైవమిక లేడనుచున్ గడగట్టి భేరికా**
**ధాండ డధాండ ధాండ నినదంబులజాండము నిండ మత్త వే**
**దండము నెక్కి చాటెదను దాశరథీ కరుణాపయోనిధీ...** అంటాడు గోపరాజు గారు.

యుద్ధం వస్తే రామచంద్ర మూర్తి భుజములు తాండవం చేస్తాయి అంత గొప్ప శక్తి ఎక్కడి నుంచి వచ్చింది అంటే విశ్వామిత్రుడు పెట్టిన భిక్ష. విశ్వామిత్రుడు నేర్పాడు విలువిద్యంతా. ఆ అస్త్రాలన్నీ ఆయన ఇచ్చాడు కాబట్టి .. ఏష వీర్యవతాం వరః.....

ఏష బుధ్యాధికో లోకే .. ఇక బుద్ధి అంటే విశ్వామిత్రుడే. ఈయన కన్నా గొప్పవాడు లేడు అంత గొప్ప బుద్ధిమంతుడు. "రాముణ్ణి పంపవయ్యా. ఇది గొప్ప అదృష్టం..! అటువంటి మహానుభావుడితో కలిసి వెళితే చాలు ఒక పెద్ద గ్రంథాలయంతో నడిచి వెళ్ళిపోతే అది మాట్లాడితే ఎలా ఉంటుందో గురువుగారితో వెళ్లిపోతే అంతే – అన్ని విషయాలూ తెలుస్తాయి. కాబట్టి పంపు..". ఏష బుధ్యాధికో లోకే..

తపసస్య పరాయణం... తపస్సనేదానికి పర్యాయపదం ఏదైనా ఉంటే అదిగో – అది రూపం దాలిస్తే విశ్వామిత్రుడు. నీ భాగ్యం కదూ – నీ కొడుకు కావాలని పిలవడం..? అనుమానిస్తావేమిటి అని అన్నాడు. ఎప్పుడైతే విశ్వామిత్రుడు చెప్పాడో...

**సపుత్రం మూర్ధ్న్యుపా ఘ్రాయ రాజా దశరథః ప్రియం**
**దదౌ కుశిక పుత్రాయ సు ప్రీతే నాంతరాత్మనా**

ఏమి ఋషి వాక్కులో ... ఏమి వాల్మీకి రచనో... ధర్మం గదు మరీ..

ఒక వయసు దాటిన తరువాత మన కడుపున పుట్టిన పిల్లలు అయినా ఎక్కడ పడితే అక్కడ ముద్దు పెట్టడానికి వీల్లేదు. అంత ప్రేమ కలిగితే వాళ్ళ చెంపలు పట్టుకుని ముందుకు వంచి మూర్ధన్య స్థానం అంటే మాడు మీద వాసన చూడాలి అంటే. అంతే తప్ప ముద్దు పెట్టుకుంటే ఆయుక్షీణం. బిడ్డలకు అయినా కూడా సపుత్రమో ధ్విపా ఘ్రాయా – ధర్మ శాస్త్రం రామాయణం. అందుకనే మూర్ధి స్థానమునందు వాసన చూసి దధౌ కుశిక పుత్రాయా అని ఏం చెపితే అది చెయ్యరా అని ఇచ్చేశాడు. గురువుగారి దగ్గరికి పంపించినప్పుడు మళ్ళీ ఇది చెయ్యి అది చెయ్యి అని చెప్పడం ఏమిటి? ఇప్పుడు ఎంత నమ్మకమో దశరథ మహారాజుకి.

దదౌ కుశిక పుత్రాయ సు ప్రీతే నాంతరాత్మనా మహా సంతోషంతో ఇచ్చేశాడు. అయితే రామాయణంలో చాలా అరుదుగా పుష్పవృష్టి పడుతుంది.

విచిత్రం ఏమిటంటే విశ్వామిత్రుని వెనుక రాముడు బయలుదేరాడు. రాముడి వెనక లక్ష్మణుడు బయలుదేరాడు. వీళ్ళు ముగ్గురు బయలుదేరి వెళుతున్నారు.

**పుష్ప వృష్టిః మహత్యాసీత్ దేవ దుందుభి నిస్వ నైః**
**దేవ దుందుభి నిర్ఘోషా ప్రయతీతు మహాత్మనీ ..**

విశ్వామిత్రుడి వెంట రామలక్ష్మణులు ఇద్దరు బయలుదేరి అంతఃపురం దాటగానే దేవలోకంలో ఉన్న దుందుభులన్నీ మోగాయిట. శంఖములన్నీ మ్రోగాయిట. ఆకాశంలోనుంచి పుష్పవృష్టి కురిసిందిట. అదేమిటి? అప్పుడు పుష్పవృష్టి ఎందుకు? అంటే నరుడిగా వచ్చిన రాముడు రావణసంహారం చెయ్యడానికి కావలసినంత శక్తిని ఇప్పుడు విశ్వామిత్రుడు దగ్గర పొందబోతున్నాడు. ఇంక ఇంతకన్నా లోకానికి మంగళకరం ఏమిటి? అంతటి రాముడు విష్ణువే అయినా, నరుడిగా వస్తే మాత్రం రావణ సంహారానికి కావలసిన శక్తి రావాలి అంటే గురువుని సేవించవలిసిందే. అంత గొప్ప గురువు అంత గొప్ప శిష్యుడు కలిశారు. దేవ దుందుభి నిర్ఘోషా దేవదుందుభులు మోగాయి. రాముడు ధర్మాత్ముడు అంటారు.

**రామో విగ్రహవాన్ ధర్మః సాధు సత్య పరాక్రమః**

రాముడంటే రాశీభూతమైన ధర్మం అన్నాడు. రామాయణంలో దీన్ని ఋషి చెప్పలేదు. మారీచుడు చెప్పాడు. అంత గొప్ప ధర్మమూర్తి రాముడు ఎందుకు కాగలిగాడు అంటే విశ్వామిత్రుడు దగ్గర నేర్చుకున్నాడు ధర్మం యొక్క గొప్పదనం ఏమిటో. ఏష విగ్రహవాన్ ధర్మః వశిష్ఠుడు చెప్పాడు కదా విశ్వామిత్రుడు గురించి. అటువంటి గురువు దగ్గర సేవించి నేర్చుకున్నాడు ధర్మం గొప్పతనం ఏమిటో. నేర్చుకున్నాడు కాబట్టి జీవితంలో ధర్మం మీద నమ్మకం పోకుండా అలాగే నిలబడ్డాడు.

పిల్లలకి రామాయణం ఎందుకు నేర్పుతారంటే – అంటే వాడు ఎంత గొప్పవాడైనా, వంశం నిలబడేది, వంశానికి కీర్తి ప్రతిష్ఠలు వచ్చేది, లోకం

సంతోషించేది వాడి ధర్మ నిరతిని బట్టి. వాడు ఎంత చదువుకున్నా ఎంత గొప్పవాడైనా, ధర్మం వదిలేసిన నాడు వాడికి ఆ కీర్తి ఉండదు. తరించిన వాళ్ళు కూడా కింద పడిపోతారు. ధర్మం ప్రధానం. అంత ధర్మం రాముడికి వచ్చింది అంటే విశ్వామిత్ర మహర్షి గొప్పతనం – అందుకని పడింది పుష్పవృష్టి.

అంటే, రామాయణం మానవీయ సంబంధాలలో అసలు ఒక శిష్యుడు గురువు దగ్గర చేరడం గురువు పట్ల వినయం ఉండడం ఎంత గొప్పదో చూడండి. అయితే ఏం చేశాడు రాముడు? రామాయణం చదవడం ఏమిటండీ? రామాయణం కనపడుతుంది. రామాయణం చదవడం కాదు రామాయణాన్ని మహర్షి ఎలా రాశారంటే ప్రత్యక్ష ప్రసారం చేశారు. అందుకే మీరు రామాయణం చదివితే విచిత్రంగా ఉంటుంది.

జనకుని పనుపున దూతలు బయలుదేరారు... దశరథ మహారాజుగారి సభకు వెళ్లారు.. అనుమతి అడిగారు ... లోపలికి వెళ్లారు... జయజయధ్వానాలు చేశారు.. దశరధుడు సంజ్ఞ చేసి ఎక్కడి నుంచి వచ్చారు మాట్లాడమని మంత్రి ద్వారా అనుమతి ఇచ్చాడు... అప్పుడు వాళ్లు మాట్లాడటం మొదలుపెట్టారు...

మీకు కనపడుతుంది రామాయణం. రామాయణం కనపడేటట్లుగా రచించారు వాల్మీకి మహర్షి. ఏం చేశారు రామలక్ష్మణులు అంటే లేక లేక అరవై వేల సంవత్సరముల వయసు వచ్చిన తరువాత అశ్వమేధయాగం చేసి పుత్రకామేష్టి చేస్తే పుట్టిన పిల్లలు... ఎంత అపురూపం? గురువుగారూ మీ వెనక మేము ఈ నడక ఏమిటి? ఇలా ఎంత దూరం నడవాలి? ఎప్పటికి చేరుతాము? ఏమిటి ఈ పాదయాత్ర? అని అడగలేదు. ముందు గురువుగారు వెళ్ళిపోతున్నారు. వెనక –రాముడు వెళ్ళిపోతున్నాడు. ఆ వెనక – లక్ష్మణస్వామి వెళ్ళిపోతున్నాడు. ఏమిటిట వాళ్లకి ఆనందం. అంటే ఇంతటి మహానుభావుడు ఇటువంటి గురువుగారి వెనకాల వెళుతున్నాం. చాలదా జీవితంలో? ఎన్ని

కోట్ల జన్మలు ఎత్తితే పట్టింది భాగ్యం? గురువుగారు ముందు నడుస్తుంటే గురువుగారి వెనక నడుస్తున్నాం. చాలు. గురువుగారు రా అన్నారు. అంతే వెళ్లిపోవడమే. గురువుగారు ఆగు అంటే ఆగుతా. గురువుగారు కూర్చో అంటే కూర్చుంటా.

ఒకటిన్నర యోజనాల దూరం సరయూ నది దక్షిణతీరంలో నడిచి వెళ్ళిపోయారు. వెళ్ళిపోయాక అకస్మాత్తుగా విశ్వామిత్రుడు వెనక్కి తిరిగి చూశాడు. ఇద్దరు పిల్లలు ఎక్కడా బడలిక గానీ – హమ్మయ్య ఎప్పుడు ఆగుదామా అని చూస్తున్నాం వెనక్కి తిరిగారు. కాసేపు ఆగుదాం అంటారా? అని కానీ ఏం లేదు. గురువుగారు మీరు ఏం చెప్తే అది అన్నట్టుగా ఉన్నారు. గురువుగారు పొంగిపోయారు. ఏమిటి కారణం? శిష్య హృదయం కారణం. అంతే వెంటనే ఒక మాట అన్నాడు విశ్వామిత్రుడు.

**గృహాణ వత్స! సలిలం మా భూత్కాలస్య పర్యయః**
**మన్త్రగ్రామం గృహాణ త్వం బలామతిబలాం తథా**
**న శ్రమో న జ్వరో వా తే న రూపస్య విపర్యయః**
**న చ సుప్తం ప్రమత్తం వా ధర్షయిష్యన్తి నైర్ఋతాః**

రామా! అదిగో సరయూ నదీ జలాలు తీసుకుని ఆచమనం చెయ్ కూర్చో.. నీకు మంత్రముల సమూహాన్ని ఇస్తున్నాను. ఇప్పుడు నీకు ఆ దేవతలందరూ వశపడతారు. దానివలన ఏమవుతుందో తెలుసా? ఎంత యుద్ధం చేసినా నీకు శ్రమ కలగదు. నీకు జ్వరం అంటే బడలిక శరీరం తాపం పొందడం ఉండదు. వాతం పొంది బాణపు దెబ్బలకి రూపం వికృతాకారం పొందడం అనేది ఉండదు. చివరికి నువ్వు నిద్రపోతున్నప్పుడు కూడా రాక్షసులు నీకు అపకారం చేయలేరు. ఈ మంత్రాధిష్ఠాన దేవతలు నిన్ను కాపాడుతూ ఉంటారు. వాళ్ళు ఎవ్వరూ నిన్నేమీ చేయలేరు. అటువంటి మంత్ర గ్రామాన్ని నీకు ఇచ్చేస్తున్నాను అన్నాడు.

ఇప్పుడు చెప్పండి ఎవరి వలన పొందాడు. మనమందరం పొగిడే రామచంద్రమూర్తి, మనమందరం నమస్కరించే రామచంద్ర మూర్తిని చెక్కిన వాడు ఎవరు? విశ్వామిత్ర మహర్షి.

నాకు అందుకే అప్పుడప్పుడు మా కాకినాడ పట్టణం గోశాలలో రామాయణంలో నేను ఏదైనా మంచి తిథులు ఉంటే ఈ విశ్వామిత్ర సంబంధమైనవి విశిష్ట సంబంధమైనవి చదివించి ఎవరైనా విశ్వామిత్ర గోత్రంలో పుట్టిన వారుంటే వాళ్ళకు పూజ చేయిస్తూ ఉంటాను. ఎందుకంటే ఇంక అంతకన్నా రాముని సంతోషానికి ఏముంటుంది. గురువుగారి గోత్రంలో పుట్టిన వారికి పూజ చేస్తే చాలా ఆనంద పడుతుంటాడు.

రాముడు ఆ రాత్రి నిద్రపోతున్నాడు. తెల్లవారుతోంది. ఇంకా సూర్యోదయం అవలేదు. ఎంత గొప్పగా మాట్లాడతాడో విశ్వామిత్రుడు. ఇప్పటికీ ఎక్కడ సుప్రభాతం జరిగినా ఇదే మకుటం. ఇదే ప్రథమ శ్లోకం. అది మొట్టమొదట లోకంలో భగవంతుడు నరుడిగా వచ్చి నిద్రపోతే సుప్రభాతాన్ని పాడిన వాడు విశ్వామిత్ర మహర్షి.

**కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే**
**ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం..**

అది గురువుకు ఉండవలసిన లక్షణం. కర్తవ్యం అన్న మాట సంస్కృతంలో కనపడుతుంది. మిగిలిన చోట్ల బాధ్యత బాధ్యత అని మాట్లాడుతారు. బాధ్యత క్రుంగదీస్తుంది. కర్తవ్యం మనిషిని తేల్చేస్తుంది. నేను ఏం చేయాలో అది చేస్తే నా కర్తవ్యం పూర్తైపోయింది. రామాయణము మానవీయ సంబంధములు. నేను దేని గురించి మొదలుపెట్టి మాట్లాడాలో అది మాట్లాడకపోతే రామచంద్ర మూర్తి సంతోషించడు. అది నేను ఇవాళ మాట్లాడాను. అయిపోయింది నా కర్తవ్యం. అంతేగాని పదిమార్లు మీ దగ్గరికి వచ్చి, మీ ఇంటికి వచ్చి ఏమండీ బావుందా? మీకు అర్థం అయిందా? మీకు నచ్చిందా? మీరు చేస్తారా? అవన్నీ అనవసరం. నీకెందుకు ఆ మెప్పుకోలు? రాముడు సంతోషించాడు చాలు.

నీకు వచ్చింది త్రికరణశుద్ధిగా నువ్వు చెప్పావా? నువ్వేది నమ్ముకున్నావో నీ జీవితంలో అది నువ్వు మాట్లాడావా? నా కర్తవ్యం అయిపోయింది నేను చెప్పవలసింది చెప్పేశాను. పట్టుకోవడం పట్టుకోలేక పోవడం వాళ్ళ ఇష్టం. వెంటపడి నేను చేయించలేను కదా. అది కర్తవ్యతా దృష్టి. కర్తవ్యం అన్న మాట మిమ్మల్ని పైకి తేల్చేస్తుంది ఎప్పటికప్పుడు. తండ్రిగా – నా కర్తవ్యం; భర్తగా – నా కర్తవ్యం; శిష్యుడిగా – నా కర్తవ్యం. అదే ధర్మం. మీ కర్తవ్యం మీరు చేయగానే మీరు విడుదల పొందేశారు. "నేను ఏమైపోయినా వాణ్ని వృద్ధిలోకి తెచ్చేయాలి. వాణ్ని పైకి తేవడం నా బాధ్యత కదండీ". అనుకుంటే నువ్వు ఊబిలోకి దిగుతావు. ఏది చేయాలో అది చేసుకుంటూ వెళ్ళిపో. పట్టుకుని వాడు పైకి ఎక్కాలి. అన్నం వండి పెట్టగలం కానీ తినకపోతే తినిపించగలవా? తినిపించలేవు. కర్తవ్యం చేయడం అంటే నీ ధర్మాన్ని నువ్వు పూర్తి చేస్తూ ఉండడం. అంతే.

కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే.. సూర్యోదయం అవుతుంది రామా..!

యజ్ఞోపవీతం ఉన్నందుకు నీకు అన్నిటికన్నా ప్రధాన కర్తవ్యం ఏమిటి? సంధ్యావందనం. నువ్వు అది చేసి తీరాలి. పూజ చేశావా చేయలేదా కూడా మినహాయింపు ఉంది. సంధ్యావందనం చేయవలసిందే.

కర్తవ్యం దైవమాహ్నికం.. నువ్వు చేయవలసిన కర్తవ్యం అది. కాబట్టి లే! అన్నాడు.

అని ఒకవేళ రాముడు లేవకపోతే వేళ్ళు విరిచేసుకుని, ఎక్కడో కూర్చుని "అంత లేపాను; వీడు లేవలేదు ఏమిటో" — అలా ఏమీ అనడు. నిద్రపోతున్న వాడిని కారణం చెప్పకుండా లేపకూడదు. ఎందుకంటే అది సమాధి స్థితి. కారణం చెప్పేటప్పుడు ఇతర కారణాలు చెప్పకూడదు. దైవం కారణంగా చెప్పాలి. "ఒరేయ్ లే – సూర్యోదయం ఔతోంది — సూర్య భగవానుడికి నమస్కారం చేసుకోవాలి.. లే పార్వతీ పరమేశ్వరులకు నమస్కారం

చేసుకోవాలి.. లే.. మీ అమ్మకి నమస్కారం చేయాలి ఆ కారణం చెప్పాలి. అందుకని..

ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం..

నరుడికి శార్దూలం వంటి వాడివి. నరులకు ఆదర్శప్రాయమైన వాడివి నువ్వు లేకపోతే ఎలా? ఎంత అందంగా చూపిస్తాడో ఆ కర్తవ్యతా బోధ. అసలు నేను ఇలా గురుశిష్య సంబంధం అనుకోండి ఆరు నెలలు చెప్పాలి. కాబట్టి తేల్చేస్తాను కొంతవరకు.

మీరు రామాయణాన్ని చూడండి మీకు ఒక విశేషం కనపడుతుంది. నిజానికి రాముని పెళ్ళికొడుకుని చేసేసింది కూడా యథార్థానికి విశ్వామిత్రుడు. ఎందుకని అంటే అసలు దశరథుడు రాముణ్ణి ఎందుకు పంపించాడు? యజ్ఞ సంరక్షణ కోసం. యజ్ఞ సంరక్షణ అయిపోయింది కదా. అయిపోయిన తర్వాత విశ్వామిత్రుడు ఏం చేయాలి? రామ లక్ష్మణులను ఇంటికి వెళ్లి పొమ్మనాలి. ఇంటికి వెళ్లి పొమ్మనీ అనలేదు. తనతో రమ్మనమని అనలేదు. మిథిలానగరంలో గొప్ప శివధనస్సు ఉంది. మీరు వస్తే చూడొచ్చు అని దగ్గర ఉన్న ఋషులు చెప్పారు. ఉత్తమ క్షత్రియుడిగా జన్మించిన వాడికి అటువంటి ధనస్సును చూద్దామన్న ఉత్సాహం లేకపోతే ఎలా? కాబట్టి తప్పకుండా వస్తాడు. వచ్చిన తర్వాత ధనుర్భంగం జరుగుతుంది. జరిగిన తర్వాత సీతాకల్యాణం జరుగుతుంది. తన ప్రయోజనం పూర్తి అయిపోయింది.

రెండు ఇవాళ బ్రహ్మచారిగా ఉన్నాడు రేపు గృహస్థు ఔతాడు. పెళ్లి అంటే ఏమిటో రాముడికి తెలియాలి. పెళ్లి చేసుకున్న తర్వాత గృహస్థుగా తన కర్తవ్యం ఏమిటో తెలియాలి. భార్యని ఉద్ధరించుకోవడం అంటే ఏమిటో తెలియాలి. భార్య భగవంతుడు ఇచ్చిన స్నేహితురాలు. ఎంత ప్రేమగా మాట్లాడాలో తెలియాలి. భార్య ఒకవేళ తనతో హాస్యం ఆడితే అది పరుషంగా ఉన్నా చనువుతో భర్త కాబట్టి హాస్యమాడింది అని సహృదయంతో స్వీకరించగలగాలి. ఇవన్నీ నిజానికి నేర్పిన వాడు ఎవరు రామాయణంలో?

గురువుగారు ఏదైనా చెప్తే అది శాసనం. అది శిష్యులకు ఉండవలసిన లక్షణం. అది మీకు పదే పదే కనబడుతుంది.

రామావతారంలో, కృష్ణావతారంలో మొట్టమొదట స్త్రీ హత్య. కృష్ణుడికి పూతనా సంహారం; రాముడికి తాటకా సంహారం. విశ్వామిత్రుడు రాముడికి తాటకిని చూపించి బాణం వెయ్యమన్నాడు. రాముడు ఆలోచిస్తున్నాడు. ఇన్నీ నేర్చుకుని మొట్టమొదట స్త్రీ హత్యతో మొదలెట్టనా? అనుకున్నాడో ఏమో కొద్దిగా సందేహించాడు. వెంటనే విశ్వామిత్రుడు అంటాడు.

**నృశంసమనృశంసం వా ప్రజారక్షణ కారణాత్ ।**
**పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సతా ॥**

**రాజ్యభారనియుక్తానామ్ ఏషధర్మః సనాతనః ।**
**అధర్మ్యాం జహి కాకుత్ స్థ ధర్మో హ్యస్యా న విద్యతే ॥**

రాజ్యభారం వహించడం అంటే భోగాలను అనుభవించడం, చుట్టూ రక్షణ వ్యవస్థ పెట్టుకోవడం పెద్ద పెద్ద మర్యాదలు లాంఛనాలు పుచ్చుకోవడం – అది కాదు. పాపం వచ్చినా కూడా దాన్ని మీ ఖాతాలో వేసుకుని ప్రజల్ని రక్షించాలి. అందుకనీ చేయవలసినదైనా చెయ్యకూడదనిదైనా, ప్రజలను రక్షించవలసి వస్తే చేసిన వాడెవడో వాడు రాజు. ఇది సనాతన ధర్మం అన్నాడు. వెయ్యి బాణం అన్నాడు. రాముడు అన్నాడు

**గోబ్రాహ్మణ హితార్థాయ దేశస్యాస్య సుఖాయ చ ।**
**తవచైవాప్రమేయస్య వచనం కర్తుముద్యతః ॥**

**పితుర్వచన నిర్దేశాత్ పితుర్వచన గౌరవాత్ ।**
**వచనం కౌశికస్యేతి కర్తవ్యం అవిశంకయా ॥**

మానాన్న గారు మీతో పంపించినపుడు గురువుగారు ఏం చెబితే అది చేయరా అన్నారు. మీరు చెప్పింది చేయకపోతే నేను నాన్నగారి మాట పక్కన పెట్టినట్లు. మీరు గురువు ఇక మీ మాటకు తిరుగులేదు మీరు ఏది చెప్పారో

అది చేయడమే. గోబ్రాహ్మణ హితం, దేశ హితం కోసం మీరేం చెబితే అది చేస్తానన్నాడు. తాటకా సంహారం చేశాడు. గురుశిష్య సంబంధం ఎలా ఉంటుందో చూపిస్తారు రామాయణంలో.

అలాగే జనక మహారాజు గారు సందేహిస్తున్నారు.

**ఏతద్దర్శయ భద్రం తే కృతకామౌ నృపాత్మజౌ**
**దర్శనాదస్య ధనుషో యథేష్టం ప్రతియాస్యతః**

ఆ శివధనుస్సు ఒకసారి చూపించవయ్యా. పిల్లలు చూసే వెళ్ళిపోతారు అన్నాడు. చూపించమంటే చాలు కథంతా చెప్తాడాయన..! ఒక్కొక్కడికి ఒక్కొక్క బలహీనత. శివధనస్సంటే మామూలు కాదండీ. ఎక్కుపెట్టిన వాడికి పిల్లనిస్తానన్నా నండీ. చాలామంది వచ్చారండి, ఎక్కుపెట్టలేకపోయారండి, జనకుడంతటివాడు నరుణ్ణి అవమానించాడు.

**యద్యస్య ధనుషో రామః కుర్యాదారోపణం మునే**
**సుతా మయోనిజాం సీతాం దద్యాం దాశరథేరహం**

కేవలం ఒక మనుష్యుడు రాముడు శివధనస్సుని ఎక్కుపెడతాడా? ఎక్కు పెట్టమనండి? అయోనిజ నా కూతురు సీతమ్మని కన్యాదానంచేసి నీకిచ్చి పెళ్లి చేస్తానన్నాడు. అన్నీ తెలిసినవాడు బ్రహ్మర్షి విశ్వామిత్రుడు. ఆయన ఎక్కువ మాట్లాడడు. అన్నీ విని విశ్వామిత్రుడు “ఆ ధనస్సు అక్కడ పెట్టు చూస్తాడు” అని అన్నాడు. రాముడు వెళ్లి చూశాడు. గురువుగారు ఏం చెప్పారు? ధనస్సు చూడమన్నారు. అంతేగాని ముట్టేసుకో, పట్టేసుకో, ఎత్తెయ్యి అన్నారా? అనలేదు. గురువుగారి ఆజ్ఞ లేకుండా ఎక్కుపెడితే – చతికిలపడితే? నేను చెప్పానురా నీకు అంటే? ఇంకేం గురు శిష్యులు? అందుకని ఎవరి గౌరవం వాళ్ళు నిలబెట్టుకుంటారు ఇవన్నీ మహర్షి వ్యాఖ్యానంలో ఏమనరు శ్లోకం అంతే రచన చేస్తారు. ఆయన వెళ్లి చూశాడు. చూసి – “గురువుగారు అబ్బా ఎంత గొప్పగా ఉందండీ ఈ ధనుస్సు? మీరు అనుమతి ఇస్తే ముట్టుకుంటా.

మీరు అనుమతిస్తే పట్టుకుంటా. మీరు అనుమతిస్తే ఎత్తుతా. మీరు అనుమతిస్తే వింటినారి సంధిస్తా." అని అన్నాడు.

ఒక్కసారిగా జనక మహారాజు, విశ్వామిత్రుడు "అట్లాగే" అన్నారు. అడిగింది విశ్వామిత్రుణ్ణి. తొందరగా ఆ పనేదో పూర్తైపోతే, పెట్టె లోపల పెట్టేస్తే ఆపని అయిపోతుంది అని జనక మహారాజుగారు. అక్కడికి ఎంతమంది వచ్చారు, ఎన్నివేల మంది ఎత్తడానికి ప్రయత్నించారు – ఎవ్వరూ ఎత్తలేరని ఆయన నమ్మకం. గురువుగారు ఒకసారి "అట్లాగే" అన్నారంటే అది అయి తీరుతుంది. ఇదీ రాముడి నమ్మకం. గురువుగారు అన్న తర్వాత ఎత్తాడు. ఎత్తడమే కాదు – ఆ ధనుస్సు మధ్యకి విరిగిపోయింది. అంటే గురువుగారి మాట శిష్యుడు అంత గట్టిగా పట్టుకుంటాడు.

గురువుగారికి వ్యతిరేకంగా ఎక్కడైనా ఏదైనా ప్రసంగం వచ్చిందనుకోండి. అది కొనసాగడానికి వీల్లేదు. ఆ మాట వినడానికి వీల్లేదు అది సత్యమే కావచ్చు, అసత్యమే కావచ్చు. అది చర్చ దగ్గరికి వచ్చిందంటే – అది కొనసాగకుండా ఉండడానికి అవసరమైతే తను లొంగిపోతాడు. అది రామలక్ష్మణుల గొప్పతనం.

సుగ్రీవుడు ఇచ్చిన మాట తప్పాడు. ఇచ్చిన వేళ దాటిపోయింది. వెళ్లి గుర్తుచేయరా. వాలి వెళ్ళిపోయిన మార్గం ఇంకా మూసుకుపోలేదు. సుగ్రీవుడికి గుర్తు చేయి అన్నాడు. రాముడు మృదువుగా మాట్లాడతాడు. లక్ష్మణ స్వామి వెళ్ళాడు; ధనుష్టంకారం చేశాడు; కోపంతో ఊగిపోయాడు; సుగ్రీవుడి మీద చిందులు వేసేస్తున్నాడు. తార చాలా తెలివైనది. మంచి విదుషీమణి. ఏమి చెప్పినా వినడంలేదు లక్ష్మణస్వామి. ఆవిడ అనుకుంది – వీళ్ళ గురువు గారి ప్రస్తావన తీసుకొస్తే ఇంకేం మాట్లాడడు. అందుకని ఆవిడ అందీ –

**సహిప్రాప్తం నజానీతే కాలం కాలవిదాం వరః**
**విశ్వామిత్రో మహా తేజాః కిం పునర్యః పృథగ్జనః**

"ఏమయ్యా – మీ గురువుగారు ఎంత గొప్పవారయ్యా! అటువంటివాడు బ్రహ్మర్షినౌదామని తపస్సు మొదలెట్టాడు మేనక వచ్చింది. ఆ మేనకతో కలిసి జీవించడంలో కాలం మరిచిపోయాడు. కూతురు కూడా పుట్టేసింది. ఆ తర్వాత ఎప్పుడో గుర్తు వచ్చింది. ఏమిటి తపస్సు కదా చేసుకుంటున్నాను? ఈవిడ వస్తే ఈవిడతో కాపురం పెట్టి ఇలా ఉండిపోయానేమిటి అని. ఏమయ్యా మీ గురువుగారు లాంటి మహానుభావుడు "కాలం కాల విదాం వరః" కాలము విలువ తెలిసిన వాళ్ళలో శ్రేష్ఠుడైన విశ్వామిత్రుడు మేనకతో ఉండడంలో కాలం మరిచిపోయాడు. వానరుడయ్యా సుగ్రీవుడు...!! సామాన్యుడు. ఇన్నాళ్లు అడివిని బట్టి తిరిగాడు. ఇన్నాళ్ళకి రాజ్యం వచ్చింది; భార్య వచ్చింది. ఆయన కాలం మరిచిపోతే పెద్ద ఆశ్చర్యం ఎందుకయ్యా? ఎందుకు అంత గొడవ చేస్తావ్.?" అంది. ఇంకా మాట్లాడితే గురువుగారు మీద ఏ చర్చ వస్తుందో అని తలవంచుకుని ఊరుకున్నాడు. గురుభక్తి అంటే ఎన్నికోణాలలో ఉంటుందో చూపిస్తారు రామాయణంలో.

ఆ గురుభక్తి ఎంత గొప్పగా అనుగ్రహిస్తుందో గురువుకు శాస్త్రం మీద ఎంత విశ్వాసం ఉంటుందో కూడా చూపిస్తారు.

**తతో యుద్ధ పరిశ్రాంతం సమరే చింతయా స్థితమ్**
**రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్**

రామరావణ యుద్ధం జరుగుతుంటే అగస్త్యమహర్షి వచ్చారు...

వచ్చి రామచంద్రమూర్తిని పక్కకి పిలిచాడు. రావణుని రథం గుర్రాలు అలసిపోతే, సారథి పక్కకు తీసుకొని వెళ్ళాడు. రాముణ్ణి పక్కకి పిలిచి, ఆదిత్య హృదయం అన్న మంత్రాన్ని ఉపదేశం చేస్తాను. మూడుమార్లు నువ్వు దీన్ని పారాయణ చేయి ఇక తిరుగులేదు రావణ సంహారం అవుతుందని అన్నాడు. అని ఆదిత్య హృదయం అంతా ఉపదేశం చేశారు. చేసిన తరువాత అగస్త్యుడు ఏమి చేయాలి? అంతమంది దేవతలు, ఋషులు, గంధర్వులు, అందరూ వచ్చి ఆకాశంలో నిలబడ్డారు రామరావణ యుద్ధం చూడ్డానికి. వానరులు

రాక్షసులు కూడా మనం ఎప్పుడైనా కొట్టుకోవచ్చు ఇలాంటి యుద్ధం మళ్లీ వస్తుందేమిటి అని కూర్చుని చూడడం మొదలుపెట్టారు. అందుకని మహర్షి ఉపమానం వేశారు – సముద్రానికి సముద్రమే ఉపమానం, రామ రావణ యుద్ధానికి రామ రావణ యుద్ధమే ఉపమానం అని. అసలు రావణుడు చచ్చిపోతాడా అని ఆశ్చర్యపోయి చూస్తున్నారు దేవతలు ఆకాశం నుంచి.

అగస్త్యుడు వచ్చి ఆదిత్యహృదయం ఉపదేశం చేసాడు. చేసినవాడు ఏం జేయాలి? రావణసంహారం అయిపోయేవరకు ఉండాలి కదా. ఆయనేం చేశాడంటే, ఎలా వచ్చాడో అలా వెళ్ళిపోయారు. అదేమిటి మరి ఆయన ఉండకుండా వెళ్ళిపోవడం ఏమిటి? నేను ఆదిత్య హృదయం ఉపదేశం చేసిన తర్వాత రాముడు దాన్ని పారాయణం చేసిన తర్వాత రావణుడు ఇంకా బ్రతికి ఉంటాడేమిటి? నేనిచ్చిన మంత్రం మీద నాకు అంత నమ్మకం – కాబట్టి రావణుడు పోయినట్టే – అందుకే నేను వెళ్ళిపోతున్నాను.

గురువుకి తన చదువుకున్న చదువు మీద నమ్మకం ఉండాలి. అసలు తను చదువుకున్న చదువు మీద గురువుగారికి నమ్మకం లేదనుకోండి. ఆయన మాట్లాడే మాటల్లో దానిమీద నమ్మకం ఎక్కడ కనబడుతుంది? ఆయనకేఅనుమానం.ఆయనకేదానిమీదనమ్మకంలేదు.నమ్మకంలేనాయన నమ్మకం ఉన్నట్లు మాట్లాడుతున్నాడు అనుకోండి Macbeth నాటకంలో Shakespere చెప్పినట్టు వదులైన బట్టలు హాస్యగాడు వేసుకున్నట్లు ఉండదూ? నమ్మకం ఉండాలి ముందు. నువ్వు ఏది చదువుకున్నావో దానిమీద నీకు పరిపూర్ణమైన విశ్వాసం ఉంటే నువ్వు మాట్లాడిన వాక్కులో విశ్వాసం కనబడుతుంది. ఆ విశ్వాసం అగస్త్యుడిది. అందుకే ఉపదేశం చేసిన తర్వాత ఆయన అక్కడ నిలబడలేదు వెళ్ళిపోయాడు. అంటే గురుశిష్య సంబంధం ఎంత అపూర్వంగా ఉంటుందో చూపిస్తారు. మానవీయ సంబంధాల్లో గురుశిష్య సంబంధం అంత గొప్పది.

మానవీయ సంబంధాల్లో సర్వసాధారణంగా మనం విస్మరించేది అన్న అంత పెద్ద మాట నేను అనను. మీరందరూ ప్రాజ్ఞులు; సంస్కారవంతులు. కానీ అందరూ ఎప్పుడూ గుర్తుపెట్టుకోవలసిన ఒక మాట అంటాను. తన వంశం మీద తన వంశంలో ముందుపుట్టిన వాళ్ళు జన్మనిచ్చిన తల్లి మీద, తండ్రి మీద, తాతగారి మీద, నాయనమ్మ మీద, ఆ ముందు పుట్టిన ముత్తాతగారి మీద, ముత్తవ్వ మీద, ప్రేమ ఉండాలి. వాళ్ళ జీవితాల గురించి తెలియాలి. అసలు ఒక పిల్లవాడు ఎందుకు పాడౌతాడు అంటే వాడు ధనవంతుడవ్వడం వలన పాడవ్వడు. ఆ ధనం వాడికి ఎలా వచ్చిందో తెలియని కారణానికి పాడవుతాడు. ఈ ధనం రావడం వెనక మా పెద్దలు ఇంత చెమటోడ్చారు. ఇంత కష్టపడ్డారు. వాళ్లంత కష్టపడితే నేను ఈ ఐశ్వర్యానికి వారసుడైనానన్న విషయం పిల్లవాడికి తెలియనప్పుడు నేను ఐశ్వర్యవంతుడిని అన్న భావన వాణ్ని పాడుచేస్తుంది. ఇది తెలియాలి. తన ఇంటి పెద్దలు ముందు ఎంత కష్టపడ్డారు? ఎంత కీర్తి సంపాదించారు? వాళ్ల గౌరవం ఎలా నిలబెట్టాలి? అన్నది తెలియనప్పుడు మనుష్య జన్మకు అర్థం లేదు.

84 లక్షల జీవరాశులలో తనకు ముందు పుట్టిన తండ్రి; తనకు ముందు పుట్టిన తాత; తనకు ముందు పుట్టిన ముత్తాత వాళ్ళని స్మరించడం, తద్దినం పెట్టడం గౌరవించడం ఇది ఏ ప్రాణీ చెయ్యదు. ఒక్క మనిషి చేసి తీరాలి. అది మనిషికి గుర్తుండి తీరాలి. ఆ విషయాన్ని రామాయణం ఎంత గొప్పగా జ్ఞాపకం చేస్తుందో. ఎన్నో సందర్భాల్ని నేను ఉటంకించను గానీ, పెద్దల విషయంలో గౌరవం అంటే సగర చక్రవర్తి వృత్తాంతం చెప్పుకోవచ్చు. సగరునికి ఇద్దరు భార్యలు – పెద్ద భార్య పేరు కేశిని. రెండవ భార్య పేరు సుమతి. సుమతి గరుత్మంతుని చెల్లెలు. ఇద్దరు భార్యలు. పెద్దభార్య కేశినికి వంశ కారకుడైన కొడుకు పుడతాడు అని భృగు మహర్షి వరమిచ్చాడు. సుమతికి కూడా భృగు మహర్షే వరం ఇచ్చాడు. నీకు అత్యుత్సాహం కలిగిన వాళ్ళు పుడతారు అన్నాడు. అరవైవేల మంది పుట్టారు. వాళ్ళే సగరులు

అయ్యారు. ఇంతమంది పేర్లు ఎక్కడ గుర్తుపెట్టుకుంటారని సగరుని కొడుకులు అన్నారు.

పెద్దల యందు గౌరవం అంటే ఏమిటో తెలుసా? పిల్లలు లేకపోతే ప్రశ్రవణ పర్వత గుహలోకి వెళ్లి భార్యలతో కలిసి పిల్లల కోసం తపస్సు చేశాడు సగరుడు. సగరుని పెద్దభార్య కొడుకు అసమంజసుడు. వంశకర్త. రాజ్యానికి ఉత్తరాధికారి. ఆయనకో దురలవాటు ఉండేది. సాయంకాలం పిల్లలందరినీ కూడా ఆడుకుందాం రండి అని సరయూ నదికి తీసుకెళ్లి ఆ పిల్లల్ని మెడ పట్టి నీళ్లలో ముంచేస్తే, వాళ్ళు ఊపిరాడక కొట్టుకు చచ్చిపోతే వీడికి సంతోషం. అలా రోజూ ఒకరిద్దరు పిల్లల్ని చంపి ఇంటికి వెళ్లిపోయేవాడు. రాజుగారికి లేక లేక పుట్టిన కొడుకు, చెప్తే బాగుండదని సహించారు. ఆఖరికి దురాగతాలు ఎక్కువైపోతున్నాయని సగరుడికి, మీ అబ్బాయి పిల్లల్ని ఇలా చంపుతున్నాడు అని చెప్పారు.

"మా అబ్బాయి కదా... కాబట్టి ఇప్పుడు వాడికి అనుకూలంగా సాక్ష్యాలు మార్చెయ్యాలి కదా... వాడికి అనుకూలంగా మాట్లాడాలి కదా.... లేక లేక పుట్టిన కొడుకు కదా"... ఇది కాదు సగరుడు ఆలోచించింది..!! "నా వంశంలో ముందు ఉన్న పెద్దలు ఎంత త్యాగం చేసి ఎంత ధార్మికంగా బ్రతికితే నా వంశానికి ఇంతకీర్తి వచ్చింది. ఆ కీర్తికి కళంకం తెచ్చి రాజ్య ప్రజలను ఇబ్బంది పెడుతున్న వాడు కొడుకైనా వాడికి పడవలసిన శిక్ష పడవలసిందే." అని ఆలోచించాడు. వెంటనే కొడుకుని పిలిచి నువ్వు ఇటువంటి పనులు చేస్తున్నావన్న విషయం నాకు తెలిసింది. కాబట్టి నిన్ను సామ్రాజ్యం నుంచి బహిష్కరిస్తున్నాను. అని వెళ్లిపోమన్నాడు. అది ఎవరైనా చేస్తారండి అది ధర్మం అంటే.

అలా – బిడ్డలనైనా సరే – ధర్మం తప్పి ప్రవర్తిస్తోంటే పెద్దలు సంపాదించిన కీర్తి పోతోంది అంటే సామ్రాజ్యం నుంచి వెళ్లగొట్టారు. వెళ్ళిపోయేటప్పుడు అసమంజసునికి ఒక కొడుకు ఉన్నాడు అంశుమంతుడు.

సగరుడు తన మనుమడు అంశుమంతుణ్ణి దగ్గర పెట్టుకున్నాడు ఈ సగరులు యజ్ఞంలో యాగాశ్వాన్ని ఇంద్రుడు ఎత్తుకుపోయాడని ధూర్తతనంతో కపిలమహర్షి మీద కఠినమైన రోషం ప్రకటించారు.

**శ్రుత్వా తు వచనం తేషాం కపిలో రఘునందన ।**
**రోషేణ మహతాऽऽవిష్టో హుంకారమకరోత్ తదా ॥**

**తతస్తేనాప్రమేయేణ కపిలేన మహాత్మనా ।**
**భస్మరాశీకృతా స్సర్వే కాకుత్ స్థ సగరాత్మజాః ॥**

కపిల మహర్షి ఒక్క హూంకారం చేశారు. ఆ హూంకారానికి అగ్నిహోత్రం వచ్చి అరవైవేల మంది బూదికుప్పలై పడిపోయారు. ఇప్పుడు ఆ బూదికుప్పలై పోయిన వారిదగ్గరే ఆ యజ్ఞాశ్వం ఉంది. దాన్ని తీసుకు వెళ్దామని అంశుమంతుడు బయల్దేరి వచ్చాడు. సగర చక్రవర్తి దీక్షలో ఉన్నాడు. లేవకూడదు. అంశుమంతుడు వచ్చి ఈ యాగాశ్వాన్ని తీసుకెళ్తూ అరవైవేల బూది కుప్పలని చూశాడు. "అయ్యో..!! నా ప్రపితలు ఎలా బూది కుప్పలకింద పడిపోయారు. వీళ్ళకి ముందు ఉదకంతో తర్పణం ఇవ్వాలి" అని గబగబా వెళ్లి అక్కడ ఏటిలో ఉన్న నీటిని తీసుకువస్తున్నాడు. మేనమామగారు గరుత్మంతుడు కనపడి అన్నాడు – "వీరు మహర్షి తేజస్సుకి మరణించారు. అలా మరణం పొందిన వాళ్లకి నువ్వు ఉదకం ఇచ్చినా అది ఆకాశంలో అంతర్హితమై పోతుంది. అది వాళ్లకి చెందదు. వాళ్లకి చెందాలంటే ఆకాశగంగ భూమి మీదకు రావాలి. ఆకాశగంగా జలాలతో తర్పణ చేయా"లన్నాడు. "ఇప్పుడు నేను ఆకాశగంగతో ఎలా చేయగలను?" అని గుర్రాన్ని తీసుకెళ్ళి పోయాడు. యజ్ఞం అయిపోయింది.

ఆ అరవైవేల మందికి జలతర్పణం చేయాలని బ్రతికున్నంత కాలం సగర చక్రవర్తి ప్రయత్నించాడు. "పోతే పోయారులే మనం ఏం చేస్తాం ధూర్త గుణం ప్రదర్శించారు" అని అనలేదు. అరవై వేల మంది నా వారిని ఉద్ధరించుకోలేనప్పుడు నా బ్రతుకు ఎందుకని ఏడ్చి ఏడ్చి ధార్మికంగా

పరిపాలన చేసి, సగరుడు స్వర్గానికి వెళ్లిపోయాడు. ఆ తర్వాత అంశుమంతుడు పరిపాలన చేసినంతకాలం వాళ్ళను ఉద్ధరించడానికి ఆకాశగంగని ఎలా తేవాలా అని ప్రయత్నించాడు. కుదరలేదు. ఆ తర్వాత దిలీపుడు వచ్చాడు. దిలీపుడు పరిపాలన చేసినంతకాలం ప్రయత్నించాడు తేలేకపోయాడు. ఆ తర్వాత భగీరథుడు వచ్చాడు. మంచి యవ్వనంలో రాజ్య పరిపాలన చేస్తూ భోగాలను అనుభవించ వలసిన వయస్సులో హిమవత్పర్వతాలలో గోకర్ణ క్షేత్రానికి వెళ్లి..

**ఊర్ధ్వబాహుః పంచతపా మాసాహారో జితేంద్రియః**
**తస్య వర్షసహస్రాణి ఘోరే తపసి తిష్ఠతః**

రెండు చేతులు పైకెత్తి నాలుగువైపులా అగ్నిహోత్రాలు పెట్టుకుని సూర్యుడిని కనురెప్పవెయ్యకుండా చూస్తే పంచాగ్ని హోత్రం అంటారు. ఆ పంచాగ్నిహోత్రం మధ్యలో నెలకి ఒకసారి ఆహారం తింటూ జితేంద్రియుడై వెయ్యేళ్ళు తపస్సు చేశాడు. ఎవరికోసం? ఎక్కడో తన వంశంలో ఉన్నటువంటి ప్రపితరులు పాడైపోయారే, భస్మరాశులై ఉన్నారు; వాళ్ళు ఊర్ధ్వ లోకాలకు వెళ్లలేదని, వాళ్లకి జలతర్పణ జరగలేదని అంత తపస్సు చేశాడు వెయ్యి ఏళ్ళు.

బ్రహ్మగారు ప్రత్యక్షమై ఏం కావాలని అడిగాడు. నా వంశంలో ఎప్పుడూ ఇబ్బందే. పిల్లలు పుట్టరు. కాబట్టి మా వంశాన్ని నిలబెట్టమని అడగాలి ముందు. అది అడగలేదు. మీరు రామాయణం చదవండి ఆశ్చర్యం వేస్తుంది. మొదటి వరం ఏమడిగాడంటే – నా వంశంలో పుట్టిన ప్రపితరులు 60 వేల మంది బూదికుప్పలై పడిపోయి ఉన్నారు. వంశానికి అప్రతిష్ఠ. "ఇక్ష్వాకు వంశంలో పుట్టిన 60 వేల మంది బూదికుప్పలై ఉన్నారు, వాళ్లకి జలతర్పణం కూడా జరగలేదు.." అని చెప్పుకుంటారు. ఆకాశగంగని భూమిమీదకు వదిలి పెట్టమన్నాడు. "ఇంకేమైనా కూడా అడుగు." అన్నాడు బ్రహ్మగారు. నా వంశంలో ఎప్పుడూ పిల్లలు లేక ఇబ్బంది, పిల్లలు కలిగేటట్లుగా అనుగ్రహించు. నా వంశం ఆగకూడదు అని అన్నాడు. రెండో వరం

ఇస్తానన్నాడు. ఒకటో వరం ఇవ్వనన్నాడు. ఎందుకు ఇవ్వవు అని అడిగాడు. అంటే –

**గంగాయాః పతనం రాజన్ పృథివీ న సహిష్యతి**
**హే వీర తాం ధారయితుం న అన్యం శూలినః పశ్యామి**

"ఆ గంగ ఆకాశం నుంచి భూమి మీద పడితే, ఆ ధాటికి భూమి తట్టుకోలేదు. దాన్ని పరమశివుడు ఒక్కడే తట్టుకోగలడు. పరమశివుణ్ణి వచ్చి నువ్వు గంగ పట్టని నేను చెప్పలేను. అది సాధ్యం కాదు కాబట్టి నువ్వు శివుని వేడుకో." అన్నాడు. ఆయన మళ్లీ బొటనవేలు మీద నిలబడి అక్కడే తపస్సు చేశాడు శంకరుడి కోసం. అందుకు భోళా శంకరుడన్నారు. ఆయన అమాయకుడు కాదు. భక్తికి వశపడి మర్యాద అని చూడకుండా ఒప్పుకుంటాడు. ఏమండీ మీరంటే మాకు ఎంత ప్రేమో ..!! వచ్చి మా ఇంట్లో కింద నుంచోండి. రెండో అంతస్తులో నుంచి బిందెతో నీళ్ళు పోస్తాం అంటే వస్తారా ఎవరైనా? ఆయన ఒప్పుకుంటాడు. భక్తులయందు ఆయన ప్రీతి అటువంటిది. శివుడు అన్నాడు..

**ప్రీతస్తేఽహం నరశ్రేష్ఠ కరిష్యామి తవప్రియమ్**
**శిరసా ధారయిష్యామి శైలరాజసుతామహమ్**

"గంగను నేను భరిస్తానయ్యా భగీరథా..!" అన్నాడు. వచ్చి నిలబడ్డాడు. ఆ నిలబడడం కూడా విజయవాడ కనకదుర్గమ్మ గుడిలో శివలింగ దర్శనానికి వెళ్తున్నప్పుడు చిత్రం ఉంటుంది. రెండు చేతులూ పాండురంగనిలా నడుము మీద పెట్టుకుని ఇలా పైకి చూస్తూ ఉంటాడు. ఎందుకు చూస్తుంటాడు అంటే–

**సా కథంచిన్మహీం గంతుం నాశక్నోద్యత్నమాస్థితా**
**నైవ నిర్గమనం లేభే జటామండల మోహితా ..** అని.

ఆ గంగమ్మ అహంకారంతో క్రిందకు ఉరికింది. "వీణ్ణి పాతాళానికి

ఈడ్చేస్తాను ఏమో అనుకుంటున్నాడు. నా శక్తి తెలియట్లేదు. గంగని పట్టుకోగలం అనుకుంటున్నాడు." పెద్ద పెద్ద ధారలతో పాములతో ఇతర జలప్రాణులతో కలిసి పడిపోతోంది. శివుడు గంగమ్మ హృదయాన్ని కనిపెట్టాడు. వెంట్రుకలతో కుండగా చేసి ఆ ధారలను అన్నిటినీ పట్టేశాడు.

అలా ప్రవహిస్తూనే ఉంది. అదే రావణాసురుడు స్తోత్రం చేశాడు. శివుడు తాండవం చేస్తున్నప్పుడు తల మీద బిందెలో నీళ్ళు ఎలా తిరుగుతాయో అలా తిరుగుతూ ఉంటాయిట. పాపం అమాయకుడు భగీరథుడు మళ్ళీ శివుడు గురించి ప్రార్థన చేసి, మీ పట్టుదలలు బాగున్నాయి మా వంశం ఏమైపోతుంది స్వామి అని అడిగాడు. కృపాళువై గంగను వదిలిపెట్టాడు. అంత గంగను ఒక్కసారి వదిలాడేమో – తూర్పుకి మూడు ప్రవాహాలు వెళ్ళిపోయాయి ఆ తూర్పుకి వెళ్ళినవే హ్లాదిని, పావని, నళిని. పశ్చిమానికి మూడు వెళ్ళాయి – సింధు, సీత, సుచక్షు. ఒకటి భగీరథుడు ఎటు వెళితే అటు వెళ్ళింది. ముందు రథంలో భగీరథుడు వెళ్తున్నాడు. వెనక గంగా ప్రవాహం వెళుతోంది. ఆ వెళ్లడంలో జహ్ను మహర్షి యొక్క ఆశ్రమాన్ని ముంచెత్తింది. ఆయనకి కోపం వచ్చేసి వెంటనే గంగనంతటిని కూడా పానం చేసేసాడు.

అయ్యో పాపం ఈ భగీరథుడు ఇంత కష్టపడి తీసుకొచ్చాడు...

**గగనాత్ శంకరశిరః తతో ధరణి మాశ్రితా**
**వ్యసర్పత జలం తత్ర తీవ్ర శబ్ద పురస్కృతమ్**

ఆకాశంలో నుంచి గంగ అంత చప్పుడుతో శివుడి జటాజూటం మీద పడి, అక్కడి నుంచి కిందపడి భూమిమీద ప్రవహిస్తుంటే అందులో మొసళ్ళు, చేపలు, ఎండ్రకాయలు ఆ మెరుపులు ఆ వేగం ఆ తీపి ఆ తెలుపు ఆ నురగ, ఆ తుంపర్లు...

**రంగత్తుంగ తరంగసంఘములతో రంజిల్లు ఘోషంబుతో**
**బంగారంబగు పొంగుతో నురగతో పువ్వాట తుంపర్లతో**

**బంగుల్ సల్పుచు జంగలించుచు నభో భాగంబునుండి జారన్
గంగమ్మన్నువుదాల్చితే శిరమునన్ రంజిల్లుచున్ శంకరా**

అటువంటి గంగావతరణం. వెంటనే గంధర్వులు, దేవతలు, మహర్షులు, "వీళ్ళందరు ఇది గంగరా..! ఈ జలాన్ని తలమీద చల్లుకుంటే చాలు, తలపెట్టలేము, ఆకాశం నుండి పడుతుంది. చల్లుకుంటే చాలు మళ్ళీ పుణ్యం వచ్చి స్వర్గలోకానికి వెళ్ళిపోతాం..!" అని చెప్పి, చల్లుకుని స్వర్గానికి వెళ్ళిపోయారుట. అటువంటి గంగని జహ్నువు తాగేశాడు. అందరూ వచ్చి, పాపం భగీరథుడు ఇంత కష్టపడి తెచ్చుకున్నాడు, వదిలిపెట్టు అన్నారు. సరే నని, జహ్ను మహర్షి మళ్ళీ వదిలిపెట్టాడు. అలా జహ్ను మహర్షి శరీరంలోనుంచి వచ్చింది కాబట్టి, గంగ జాహ్నవి అయింది. అరవై వేల బూది కుప్పల మీదినించి ప్రవహించింది. అప్పుడు వాళ్ళందరూ ఉత్తమలోకాలకు వెళ్ళారు. అప్పుడు భగీరథుడు సంతోషపడిపోయాడు.

ఏమిటండీ ఆయన – అన్నీ విడిచిపెట్టి ఎక్కడో ప్రపితరులు. వారిని సంతోషపెట్టాలని చెప్పి, ఇంత తపస్సు చేసి గంగను భూమి మీదకు తీసుకువచ్చి, భూమి నుంచి పాతాళానికి తీసుకెళ్ళి, పాతాళలోకంలో ఉన్న బూదికుప్పల మీద ప్రవహింపజేసి గంగని త్రిపథగ చేసి, ఆకాశంలో ప్రవహిస్తే మందాకినీ, భూమి మీద ప్రవహిస్తే భాగీరధి, పాతాళంలో ప్రవహిస్తే భోగవతి మూడు పేర్లతో గంగ ప్రవహించి ఆఖరికి భగీరథుని పేరుమీద భాగీరథి అని పేరు వస్తుందని బ్రహ్మగారు వరమిచ్చారు.

వరం ఇవ్వడం కాదు. ఈ గంగావతరణానికి వాల్మీకి మహర్షి ఫలశ్రుతి చెప్పారు. ఈ గంగావతరణం అనేది చాలా అద్భుతమైనటువంటి ఘట్టం. ఏ అవసరం తీరక బాధ పడుతున్నారో, ఆ అవసరం తీరుతుంది గంగావతరణం వింటే. ఆయువు పెరుగుతుంది, గండములు తొలుగుతాయి. ఈ గంగావతరణ ఘట్టం అంత గొప్పది అన్నారు.

కేవలం గంగావతరణం కాదు తన వంశంలో పుట్టిన పెద్దల గురించి ఎంత గౌరవంతో ఆలోచన చేసి వాళ్ళని ఉద్ధరించడానికి భగీరథుడు ప్రయత్నం చేశాడో మనం అర్థం చేసుకుంటే...అసలు రామాయణము మానవీయ సంబంధములు అన్న విషయం మనకి బాగా అర్థమౌతుంది. ఒక మనిషిగా పుట్టినందుకు మనకు ఉండవలసిన ప్రప్రథమ లక్షణం ఏది? తల్లి తండ్రులను గౌరవించడం. వాళ్ళు ఇంత కష్టపడి మనకి శరీరాన్ని ఇచ్చారు తల్లిదండ్రులు. చదువు చెప్పించారు. ఇల్లు ఇచ్చారు. ఐశ్వర్యం ఇచ్చారు. డబ్బు ఇచ్చారు. వాళ్ళని జ్ఞాపకం పెట్టుకుని వాళ్లపై గౌరవం ప్రకటించడం, ఇంట్లో వాళ్ళ చిత్రపటాలు ఉండడం, వాళ్లకి నమస్కారం చేయడం, ఈ కృతజ్ఞత లేకపోతే ఆ మనుష్య జన్మ మిగిలిన ప్రాణుల కన్నా ఏ రకంగా గొప్పది అవుతుంది?

వంశంలో ఉన్న పెద్దల పట్ల ఎంత గౌరవం ఉండాలి అన్నదానికి శ్రీరామాయణం నిలువెత్తు నిదర్శనంగా నిలబడుతుంది. అందుకే రామాయణము మానవీయ సంబంధములు అన్న విషయాన్ని మీరు పరిశీలన చేసినప్పుడు అసలు పెద్దల పట్ల ఎంత గౌరవాన్ని చూపించాలో విశ్వామిత్ర మహర్షి చెప్పాడు రాముడికి. రాముడు ఆశ్చర్యంతో వింటున్నాడు ఓ.. వంశంలో పుట్టినటువంటి పెద్దవాళ్ల మీద ఇంత గౌరవం చూపించాలా? అనుకున్నాడు.

పెళ్లి అంటే ఏమిటో చెప్పకుండా ఎంత గొప్పగా చెప్పాడు. కుశనాభుడు అని ఒక రాజు. ఆ రాజుగారికి నూరుగురు కుమార్తెలు గలిగారు. వాళ్ళందరూ మహా సౌందర్య రాశులు. మహా అందగత్తెలు. వాళ్ళు ఒకనాటి ప్రదోషంలో వివిధ వాద్య పరికరాలు మోగిస్తూ ఒక ప్రదేశంలో ఆడుకుంటున్నారు. వాయుదేవుడు వచ్చి అన్నాడూ – "ఎంత కాదన్నా మీరు నరకాంతలు. కాబట్టి మీ యవ్వనం శాశ్వతంగా ఇలా ఉండదు. నాకు భార్యలు కండి. మీ యవ్వనం శాశ్వతం ఔతుంది" అన్నాడు. పరీక్షించాలి అనుకున్నాడు.

వాళ్ళు అన్నారు –

**పితాహి ప్రభురస్మాకం పరమం దైవతం హి నః**
**యస్య నో దాస్యతి పితా స నో భర్తా భవిష్యతి**

ఈ దేశంలో ఆడపిల్ల తన భర్తని తానే నిర్ణయించుకునే దుర్దినము రాకుండు గాక..! ఎవరు తన పక్కన భర్త స్థానంలో కూర్చుంటే ఆడపిల్ల జీవితం అభ్యున్నతిపథంలోకి వస్తుందో అది నిర్ణయించవలసిన వాడు నా తండ్రి.

నా తండ్రి అనుమతి తీసుకో.. మేమందరం నీకు భార్యలు అవుతాం అన్నారు. ఆయనకి కోపం వచ్చి వాళ్ళ శరీరంలో వంకరటింకరగా తిరిగాడు. వాళ్లకి గూని వచ్చి నేల మీద పడిపోయారు. తండ్రి వచ్చి – అమ్మా ఎంత ఓర్పు పట్టారమ్మా..!! మీరూ శాపం ఇవ్వగలరు కానీ –

**క్షమా దానం క్షమా యజ్ఞః క్షమా సత్యం హిపుత్రికాః**
**క్షమా యశః క్షమా ధర్మః క్షమయా విష్ఠితం జగత్**

అమ్మా – ఓర్పు కన్నా గొప్పగుణం లేదమ్మా. ప్రతి దానికి సహనాన్ని కోల్పోతే లోకం ఎక్కడ నిలబడుతుంది? ఆయన పెద్దవారు అన్న గౌరవం ఎప్పుడు ఉంటుంది? ఓర్పు పట్టినప్పుడు. ఆ ఓర్పు తొందరగా కోల్పోయేవాడు ఎట్లా గౌరవనీయుడు అవుతాడు? ఎంత గొప్ప వాళ్ళయ్యారమ్మా..! అంత శాపం ఇచ్చినా, మిమ్మల్ని ఇలా చేసినా, మీరు ప్రతిశాపం ఇవ్వలేదా అని బ్రహ్మదత్తునికి ఇచ్చి వారి వివాహం చేసి, వాళ్ళని ఉద్ధరించుకున్నాడు. 'సోమద' అని అత్తగారు ఈ పిల్లల్ని కోడళ్ళుగా చేసుకుంది. తన కొడుకు చేయి పట్టుకోగానే అందరూ మామూలుగా అయిపోయారు.

అసలు అత్తా కోడళ్ళ సంబంధం. ఎంత గొప్పగా ఉంటుందో చూడాలంటే రామాయణంలో వినాలి ఈ మానవీయ సంబంధం గురించి. 'సోమద' అంత గొప్ప అత్తగారు. ఎందుకంటే వివాహం స్వంత నిర్ణయం

కాకూడదు. ఎందుకని అంటే అది మీ జీవితం పండడానికి, అనుభవజ్ఞులై, నీమీద ప్రేమ గల్గిన పెద్దల సలహా అందులో ఉండాలి. మీ జీవితం బాగుండాలనే ఆ సలహా చెప్తారు.

రామాయణం ఇటువంటి విషయాలు ఎన్నో మాట్లాడుతుంది. అంతవరకు ఎందుకు సీతారామ కళ్యాణ ఘట్టంలో మీకు ఒక అద్భుతమైన విశేషం కనబడుతుంది. నిజానికి బాలకాండ మీరు చూస్తే సీతారామ కళ్యాణం ఒకలా కనపడుతుంది. అది కాదు పూర్ణంగా సీతారామ కళ్యాణం. ఇవాళ సర్వసాధారణంగా సీతారామ కళ్యాణం అంటే లోకంలో ప్రచారంలో ఉన్నది ఏది కూడా యథార్థమైన సీతారామ కళ్యాణం కానేకాదు. వాల్మీకికృతమే యథార్థం. అసలు సీతారాములు ఇద్దరూ ముందు ఎప్పుడూ చూసుకోలేదు. రాముడు వెళుతుంటే సీతమ్మ పూలు కడుతూ చూడడం, గోడ ఎక్కి చూడడం ఇలాంటివి ఎప్పుడూ చేయలేదు.

రామచంద్రమూర్తి గురువుగారైన విశ్వామిత్ర మహర్షితో కలిసి వెళ్లాడు మిథిలానగరానికి – జనకమహారాజు దగ్గర ఉన్న శివధనస్సు చూడమన్నాడు విశ్వామిత్రుడు. ధనస్సు ఎక్కుపెట్టాడు. ధనుర్భంగమైంది. వెంటనే జలకలశ పట్టుకుని పరిగెత్తుకుంటూ వచ్చారు జనకమహారాజుగారు. ఆ శబ్దానికి అందరూ స్పృహ తప్పి పోయారు. స్పృహలో ఉన్నవారు నలుగురే – జనకుడు, విశ్వామిత్రుడు, రాముడు, లక్ష్మణుడు. ఇన్నాళ్ళకు నా ప్రతిజ్ఞ నెరవేరింది. శివధనుర్భంగం చేసిన వాడికి పిల్లనిస్తానన్నాను. నా అల్లుడెవరో నాకు తెలిసింది. ఈమె అయోనిజ. రాముడంటే పరబ్రహ్మ మన్నమాట. నరుడు నరుడు అనుకున్నానని పూర్ణ కలశ పట్టుకుని గబగబా వచ్చాడు. "రామా నీకు సీతనిచ్చి వివాహం చేస్తాను – కన్యాదానం చేస్తాను' అన్నాడు.

మీకు రామాయణంలో బాలకాండలో సీతారామకళ్యాణ ఘట్టం కొంత కనపడుతుంది. నిజానికి పూర్తిగా సీతారామ కళ్యాణం ఎక్కడ కనపడుతుంది అంటే అయోధ్యకాండ చివరలో సీతమ్మ అనసూయమ్మ కి చెప్తుంది.

అనసూయమ్మ అడుగుతుంది. "నీ వివాహం గురించి నేను ఎన్నో విన్నాను. అసలు ఏం జరిగిందో చెప్పు సీతా..!" అంటుంది. అప్పుడు సీతమ్మ చెప్తుంది అసలు రహస్యం.

జలకలశ పట్టుకుని జనకుడు వచ్చినపుడు, రాముడు తీసుకోవడానికి అంగీకరించలేదు. విశ్వామిత్రుడు పిల్లని పెళ్లి చేసుకో అని అనలేదు. ఎందుకనలేదంటే విశ్వామిత్రుడికి తెలుసు – పెళ్లి అంటే నేను నిర్ణయించుకునేది కాదు మా తండ్రిగారు నిర్ణయించాలని రాముడు అంటాడు. ఆ మాట ఆయన అన్న తర్వాత నా పరువేం ఉంటుంది. అందుకు విశ్వామిత్రుడు పెళ్లి చేసుకో అని అనలేదు. ఎవరి గౌరవం వాళ్ళు కాపాడుకుంటారు. శిష్యహృదయం గురువుకు తెలుసు.

సీతమ్మ చెప్పింది అనసూయమ్మతో –

**దీయ మానాం న తు తదా ప్రతిజగ్రాహ రాఘవః**
**అవిజ్ఞాయ పితుః ఛందం అయోధ్యాఽధిపతే ప్రభోః**

అయోధ్యపతి అయినటువంటి దశరథుడు నా తండ్రి ఉన్నాడు. ఆయన అంగీకరిస్తేనే ఈమెను నేను ధర్మపత్నిగా స్వీకరిస్తాను అని అన్నాడు. వెంటనే జనకుడు అయోధ్య నగరానికి దూతలను పంపించాడు. అప్పుడు వాళ్ళు బయల్దేరి వచ్చారు. అప్పుడు కూడా వెంటనే రాలేదు. దశరథుడు – వశిష్ఠ, వామదేవ, జాబాలి, కశ్యపుడు వీళ్ళందర్నీ కూర్చోబెట్టి – "జనకమహారాజు గారి వంశం ఎలాంటిది? శీలం ఎలాంటిది? ఆ పిల్లల్ని కోడళ్ళుగా తెచ్చుకోవచ్చా?" అని అడిగాడు. అందరూ 'చాలా గొప్పవాడు చేసుకోవచ్చు సంబంధం' అన్నారు. "ఒకసారి పెళ్లి చేసుకుందామని నిర్ణయించుకున్న తర్వాత నానపెట్టి ఉంచకూడదు; వెంటనే బయలుదేరండి" అని బయలుదేరి మిథిలా నగరానికి వచ్చారు.

మీకు ఇంకా విచిత్రమైన విషయం ఏంటో తెలుసా మానవీయ సంబంధాలు అంటే..? ఒక చోట జనక మహారాజు గారు చేతులు కట్టుకుని మా అమ్మాయి మీ ఇంటికి వస్తున్నది, మీరు చాలా గొప్పవారు అని ఏదో మాట్లాడుతున్నాడు. దశరథుడు అన్నాడూ – అది ఏమిటి? మీరు అలా మాట్లాడుతారు? నేను కదా అలా మాట్లాడాలి అని అన్నాడు.

**ప్రతిగ్రహో దాతృవశః శ్రుతమేతన్మయా పురా**
**యథా వక్ష్యసి ధర్మజ్ఞ తత్కరిష్యామహే వయమ్**

"ఎప్పుడైనా ఇచ్చేవాడు గొప్పవాడు; పుచ్చుకునేవాడు అవసరం తీరడానికి వాడి దగ్గర పుచ్చుకున్నాడు. ఏమయ్యా..! నువ్వు నీ పిల్లల్ని ఇవ్వకపోతే నా కొడుకులుకి భార్యలేరీ? కోడళ్ళు లేనప్పుడు నా వంశం ఏది? నాకు సంతోషం ఏది? నాకు కోడళ్ళని ఇస్తున్న వాడివి నువ్వు. పుచ్చుకుంటున్న వాణ్ని నేను. నేను కదా చేతులు కట్టుకోవలసినవాణ్ని..!" అన్నాడు. అసలు పెళ్ళంటే ఎంత ప్రేమగా జరగాలో రామాయణం చూపిస్తుంది.

దశరథుడు అక్కడికి వెళ్లిన తరువాత స్వాగతం పలికారు; కూర్చోబెట్టారు; మీరు ఏమి ఇస్తారు? ఎన్ని గుర్రాలు ఇస్తారు? ఎన్ని ఏనుగులిస్తారు? ఇవి కాదు పెళ్లి మాటలంటే – అసలు నిజంగా మానవీయ సంబంధాలు అంటే ఏమిటో రామాయణం చూసి నేర్చుకోవాలి. అందులో జనకమహారాజుగారు చెప్పుకున్నాడు.

**అథ మే కృషతః క్షేత్రం లాఙ్గలాదుత్థితా మయా**
**క్షేత్రం శోధయతా లబ్ధా నామ్నా సీతేతి విశ్రుతా**

భూమిని దున్నుతూ ఉంటే ఆమె పైకి లేచింది. పిల్లలా దొరకలేదు పైకి లేచింది..!! ఆ పిల్లను చేతిలో పట్టుకుని ఈమె నాకేమౌతుంది అని అడిగాడు.

**అన్తరిక్షే చ వాగుక్తా ప్రతిమా మానుషీ కిల**
**ఏవం ఏతన్నర పతే ధర్మేణ తనయా తవ**

ధర్మం చేత తనకు ఏ అనుబంధం ఉందో చెప్పే తప్ప తన కర్తవ్యం చేయలేదు. ఇప్పుడు నాకు ఈమె ఏమవుతుందాని అడిగాడు. అప్పుడు అశరీరవాణి పలికింది. ఆమె నీకు కుమార్తె అవుతుంది – అయోనిజ – అయినా నీకు కుమార్తె ఔతుంది అన్నది. అందుకని అయోనిజ దేవతా స్త్రీ కాబట్టి పరబ్రహ్మం ఎక్కడ పుట్టాడో నాకు ఎలా తెలుస్తుంది? శివధనుర్భంగం చేసిన వాడికి పిల్లని ఇస్తానని మిష పెట్టాడు. అందుకని ఆనాడు నేను అలా శివధనస్సుని మిషగా పెట్టాను.

దశరథ మహారాజు గారు అన్నారు – మా రాముడు శివధనుర్భంగం చేశాడు, విశ్వామిత్రుడుతో వచ్చాడు, ఏదో మారీచుణ్ణి చంపాడు; తాటకిని చంపేశాడు, సుబాహుణ్ణి చంపేశాడు అని నీ పిల్లని ఇవ్వకు. మా వంశం ఏమిటో తెలుసుకుని మా వంశక్రమం నీకు నచ్చితే మా వంశంలో ఉన్న పెద్దవాళ్లు గొప్పవాళ్లు మా వంశం గొప్పది అని నీకు నమ్మకం కలిగితే పిల్లని ఇయ్యి. ఎందుకని అంటే ఆ వంశంలో పూర్వం ఉన్న వాళ్ళు అంత గొప్ప వాళ్ళు అయితే ఆ లక్షణాలు ఉన్న పిల్లవాళ్ళు మళ్ళీ వస్తారు. అప్పుడు పిల్లని ఇచ్చినందుకు నీకు – కోడలుగా తెచ్చుకున్నందుకు నాకు సంతోషం. నా వంశం గురించి విను. అప్పుడు నీకు నమ్మకం కుదిరితే నీ పిల్లల్ని ఇయ్యి అని వశిష్ఠుని వంక చూసి మా వంశం గురించి చెప్పండి అని అడిగాడు.

అప్పుడు మహానుభావుడు వశిష్ఠుడు చెప్పాడు. ఈ సృష్టి అంతా ఒకప్పుడు అవ్యక్తముగా ఉండేది. ఆ అవ్యక్తమైన సృష్టిలో నుంచి మొట్టమొదట వచ్చినటువంటివాడు బ్రహ్మ. బ్రహ్మకి మరీచి. మరీచికి కాశ్యపుడు. కాశ్యపునికి సూర్యుడు. సూర్యునికి మనువు. మనువుకి ఇక్ష్వాకువు. ఇక్ష్వాకువుకి కుక్షి. కుక్షికి వికుక్షి. వికుక్షికి బాణుడు. బాణునికి అనరణ్యుడు. అనరణ్యునికి పృథువు. పృథువుకి త్రిశంకు. త్రిశంకువుకి దుందుమారుడు. అతనికి యవనాశ్వుడని పేరు. అతనికి మాంధాత. మాంధాతకి సుసంధి. సుసంధికి ధ్రువసేనుడు, ప్రసేనజిత్తు అని ఇద్దరు పిల్లలు. పెద్దవాడు ధ్రువసేనుడు.

ధ్రువసేనునికి భరతుడు. భరతునికి ఆశితుడు. ఆశితునికి సగరుడు. సగరునికి అసమంజుడు. అసమంజునికి అంశుమంతుడు. అంశుమంతునికి దిలీపుడు. దిలీపునికి భగీరథుడు. భగీరథునికి కకుత్సుడు. కకుత్సునికి రఘువు. రఘువుకి ప్రవృద్ధుడు. ప్రవృద్ధునికి శంఖనుడు. శంఖనునికి సుదర్శనుడు. సుదర్శనునికి అగ్నివర్ణుడు. అగ్నివర్ణునికి శీఘ్రకుడు. శీఘ్రకునికి మరువు. మరువుకి ప్రశిశ్రుకుడు. ప్రశిశ్రుకునికి అంబరీషుడు. అంబరీషునికి నహుషుడు. నహుషునికి యయాతి. యయాతికి నాభాగుడు. నాభాగునికి అజుడు. అజమహారాజుకి దశరథుడు. దశరథునికి రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు. ఇది ఇక్ష్వాకు వంశం. అంత గొప్ప వంశం. ఒక్కొక్క చక్రవర్తిది ఒక్కొక్క చరిత్ర. అదిగో రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు. మీ కుమార్తె అయోనిజ పెద్ద కుమార్తె సీతమ్మకి ఇస్తానన్నారు.

అంతే జనకమహారాజుగారు పొంగిపోయి – “మీరు మీ వంశక్రమం చెప్పారు. మరి నేను నా వంశక్రమం చెప్పాలి కదా. చెప్పకుండా అల్లుళ్లను చేసుకోవడం మర్యాద కాదు కదా. నేను నా వంశక్రమం చెప్తానని అన్నాడు. దశరథుడు వశిష్ఠునితో చెప్పించాడు కానీ జనకుడు స్వయంగానే చెప్పాడు.

మా వంశానికి మూలపురుషుడు నిమి. నిమికి కుమారుడు మిధి. మిధికి ఉదావసువు. ఉదావసువుకి నందివర్ధనుడు. నందివర్ధనునికి సుకేతుడు. సుకేతునికి దేవరాతుడు. దేవరాతుడు వంశంలో ఆరవవాడు. ఆయనకాలంలోనే పరమశివుడు ఆ ధనుస్సుని తీసుకొచ్చి న్యాసంగా ఉంచాడు – రామావతారం వస్తుంది ఇక్కడికి సీతమ్మ వస్తుంది సీతారామ కళ్యాణం జరగాలని. కాబట్టి ఆరవ వాడు దేవరాతుడు. ఆ దేవరాతుని కుమారుడు బృహద్రథుడు. బృహద్రథుని కుమారుడు మహావీరుడు. మహావీరుని కుమారుడు సుధృతి. సుధృతి కుమారుడు దుష్టకేతు. దుష్టకేతు కుమారుడు హర్యశ్రుడు. ఆ హర్యశ్రుని కుమారుడు మరుడు. మరుని కుమారుడు ప్రతీంధకుడు. ప్రతీంధకుని కుమారుడు కీర్తిరథుడు. కీర్తిరథుని కుమారుడు దేవమీఢుడు. దేవమీఢుని కుమారుడు విబుధుడు. విబుధుని

కుమారుడు మహీధ్రకుడు. మహీధ్రకుని కుమారుడు కీర్తిరాతుడు. కీర్తిరాతుని కుమారుడు మహారోముడు. మహారోముని కుమారుడు స్వర్ణరోముడు. స్వర్ణ రోముని కొడుకు హ్రస్వరోముడు. హ్రస్వరోమునికి ఇద్దరు కుమారులు. ఒకడు జనకుడు మరొకడు కుశధ్వజుడు. ఇదిగో నాకు అయోనిజ పెద్ద పిల్ల సీతమ్మ. రెండవ పిల్ల ఊర్మిళ. ఇదిగో మా తమ్ముడు కుశధ్వజుడు. వీడికి ఇద్దరు ఆడపిల్లలు – మాండవి, శృతకీర్తి.

నా పెద్ద కుమార్తె సీతమ్మని రాముడికి ఇస్తాను. రెండవ కుమార్తె ఊర్మిళను లక్ష్మణునికి ఇస్తానన్నారు. అంటే విశ్వామిత్ర మహర్షి లేచి అన్నారు – అక్కడ నలుగురు అన్నదమ్ములున్నారు. మీ తమ్ముడికి ఇద్దరు కూతుళ్ళున్నారు వాళ్ళని ఇవ్వకూడదా అన్నాడు. అన్నగారు కదా తన కూతుళ్ళే. వెంటనే మాండవి, శృతకీర్తులను భరత శత్రుఘ్నులకు ఇవ్వడానికి "త్రిగ్ధదామిది న సంశయః" మూడు మార్లు అంటున్నాను – ఇస్తాను ఇస్తాను ఇస్తాను అదే నిశ్చితార్థం. కాబట్టి మూడు మాటులు అంటున్నాను – దీన్లో న సంశయః అంటే అనుమానం లేదు అన్నాడు. అప్పుడు సీతారామకళ్యాణానికి ప్రయత్నం ప్రారంభమైంది.

అంటే పెద్దలపట్ల ఎంత గౌరవమో చూడండి. వంశం పట్ల ఎంత గౌరవమో చూడండి. వంశాలు చెప్పుకుని పెళ్లి చేసుకున్నారు అంతే తప్ప అన్యధా ఇంకొక రకంగా పెళ్లి జరగలేదు.

అంత గొప్ప రామాయణం మళ్లీ రేపు సాయంకాలం ఆరు గంటల ముప్పై నిముషాలకు ప్రారంభం చేసినప్పుడు నేను మీకు నాచేత సీతారామచంద్ర ప్రభువు, వాల్మీకి మహర్షి దేని గురించి చెప్పించదలచుకుంటే, దాని గురించి చెబుతాను. ఇప్పుడు కళ్యాణం దాకా వచ్చి ఆగింది కాబట్టి దాంపత్యం గురించి కొనసాగుతుందేమో..!!

**హరి:** ఓం..!

★★★★★

# 2

**హరి:** ఓం – పరమేశ్వర స్వరూపమైన సభకు నమస్కారం.

మనకి సనాతనధర్మంలో గృహస్థాశ్రమం అత్యంత ప్రధానమైన ఆశ్రమం. అందునా..

**"చతుర్ణాం ఆశ్రమానాం భిః గార్హస్థ్యం శ్రేష్ఠ మాశ్రమం"**

అని రామాయణంలోనే ఒక చోట చెప్పబడింది. ఉన్న నాలుగు ఆశ్రమాల్లో బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్యాసము నాలుగింటిలో గొప్పదేది అంటే గృహస్థాశ్రమమే. గృహస్థాశ్రమం లేనినాడు అసలు మిగిలిన ఆశ్రమాలకు అవకాశం లేదు. బ్రహ్మచారి, గృహస్థు ఎక్కడ ఉన్నాడో అక్కడికి వెళ్లి, భిక్షాటన చేసి, తీసుకువెళ్లి, ఆ భిక్షగా స్వీకరించిన పదార్థాన్ని గురుపత్నికి ఇచ్చి, ఉన్న విద్యార్థులు, అక్కడ ఉన్న శిష్యులందరూ కూడా తిని వేదాధ్యయనం చేస్తారు. అందుకని బ్రహ్మచారి పోషింపబడాలి అంటే గృహస్థు ఉండాలి. అట్లాగే సన్యాసాశ్రమంలో ఉన్న వాళ్ళందరూ కూడా భిక్షకు గృహస్థు మీద ఆధారపడతారు. గృహస్థు భిక్ష పెట్టకపోతే సన్యాసాశ్రమం మాత్రం ఎలా నిలబడుతుంది? వానప్రస్థు కూడా గృహస్థు మీద ఆధారపడతాడు. కాబట్టి నిజానికి గృహస్థాశ్రమం, మిగిలిన ఆశ్రమాలు అన్నింటికీ కూడా మాతృస్థానీయ. తల్లిలాంటిది.

అటువంటి గృహస్థాశ్రమం ధర్మార్థకామమోక్షములనే నాలుగు విధములైన పురుషార్థములను సాధించు కోవడానికి అత్యంత ప్రధానమైన ఆశ్రమం. అందుకే సనాతనధర్మంలో గృహస్థాశ్రమ స్వీకారం చేయడానికి చేసే క్రతువు వివాహము ఏది ఉందో దానిలో తనకి బాసటగా స్వీకరించే వ్యక్తిని ధర్మపత్ని అని పిలుస్తారు తప్ప కామపత్ని అని పిలువరు. ఆమె ధర్మపత్ని. అంటే సాక్షాత్ ధర్మమునకు ఆమె ఆలంబనమై ఉంటుంది. కామము ధర్మము చేత కట్టబడి పురుషుడు తరించడానికి వీలైన వ్యవస్థ చేకూరడానికి గృహస్థాశ్రమప్రవేశం చేస్తాడు. ధర్మము చేత కామము కట్టబడినప్పుడు ప్రభవించే అర్థమే సంతానం. ఆ కొడుకు పెరిగి పెద్దవాడై, తండ్రి కొడుకు భుజంమీద చెయ్యి వేసుకుని ఊన్చుకోవడానికి అవకాశం కలుగుతుంది. అట్లాగే ఆ కొడుకు పెరిగి పెద్దవాడై తండ్రిని పోషిస్తాడు. కొడుకున్నాడు అన్న ధైర్యంతో తండ్రి ఉంటాడు. ఇంట్లో జరగవలసిన దేవతల ఆరాధన నంతటినీ కూడా ఆ కొడుకు నిర్వర్తిస్తాడు – తండ్రి చేయలేనప్పుడు.

ఆత్మావై పుత్ర నామాసి – కొడుకే తండ్రిగా ఈ భూమి మీద తిరుగాడుతూ ఉంటాడు అని. కాబట్టి అటువంటి కుమారుడు ప్రభవించాలన్నా,

దశ పూర్వేషాం దశా పరేషాం – తాను కాకుండా తనకు ముందు పది తరాలూ, వెనక పది తరాలూ – 21 తరాలు తరించేటట్లుగా, కన్యాదానం చేయడానికి అవకాశం కలుగుతూ కుమార్తె పుట్టాలన్నా గృహస్థాశ్రమ స్వీకారం చేయాలి. చేసి ధర్మము చేత కామము కట్టుబడాలి. అందుచేతనే ఆ గృహస్థాశ్రమం చాలా చాలా గొప్ప ఆశ్రమం. ఆ గృహస్థాశ్రమం పండించుకోగలిగితే, నిజానికి మోక్షం కోసం కొత్త ప్రయత్నం అక్కరలేదు. ధర్మమునకు అర్థ కామములను కట్టడానికి గృహస్థాశ్రమంలో సౌలభ్యం ఎక్కువ. ఎందుకని అంటే దేవీ భాగవతంలో వ్యాస భగవానుడు ఒక మాట అంటాడు –

**ఇంద్రియాణి బలిష్ఠాని నని యుక్తాని మానద**
**అపక్వస్య ప్రకుర్వంతి వికారాం స్తాననేకశః**

ఇంద్రియములు బహు బలవత్తరమైనటువంటివి. అవకాశం చూసి కాట్లు వేస్తాయి. ఎంత పైకెక్కిన వ్యక్తి కూడా కిందకి జారిపోయే అవకాశం ఉంటుంది. అట్లా జారిపోవడానికి అవకాశం లేకుండా సహజముగా ఒక వయసు వచ్చిన తరువాత, మనసునందు పొటమరించేటటువంటి కామమును ధర్మము చేత ముడివేసుకుని తరించడానికి కావలసిన అవకాశాన్ని సువ్యవస్థితం చేసుకోవడానికి అవకాశం ఇవ్వగలిగిన ఆశ్రమం గృహస్థాశ్రమం. ఈ గృహస్థాశ్రమాన్ని పండించుకోగలిగితే, అదే మోక్షమునకు కారణము.

మోక్షము చతుర్విధ పురుషార్థములలో నాల్గవదిగా చెప్పబడినా, యథార్థమునకు మోక్షము కొత్తగా రావడానికి ఏ సాధన అక్కరలేదు. ధర్మమునకు అర్థము, కామము కట్టుబడితే మోక్షము తనంత తానుగా సిద్ధిస్తుంది. దీనికి నేను తరచుగా ఒక ఉదాహరణ అంటూ ఉంటాను. ఒక ఎనిమిది అడుగుల కర్ర తీసుకొచ్చి అక్కడ పెట్టి, మీరు మూడుమాట్లు మాత్రమే నరకాలి, నాలుగు సమాన భాగములు రావాలి అన్నారనుకోండి. రెండు అడుగుల దగ్గర మొదటి నాటుపెడితే రెండు అడుగుల ముక్క వస్తుంది ఆరడుగుల ముక్క మిగులుతుంది. ఇప్పుడు మళ్లీ రెండు అడుగుల దగ్గర నరికారు అనుకోండి – ఇంకొక రెండు అడుగుల ముక్క వస్తుంది. నాలుగడుగుల ముక్క మిగిలిపోతుంది. అక్కడ ఇంకొకసారి రెండు అడుగుల దగ్గర నరికారు అనుకోండి – రెండడుగుల ముక్కలు రెండు వచ్చేస్తాయి. అంటే మూడు మాట్లు నరికితే నాలుగు సమాన భాగములు వచ్చేసినట్లు, ధర్మమునకు అర్థ, కామములు కట్టుబడితే అదే మోక్షమునకు కారణమౌతుంది.

ఈ ధర్మమునకు అర్థ కామములు కట్టడానికి కోటలో ఉండి పోరాటం చేయడం అంత తేలిక అవకాశాన్ని ఇవ్వగలిగిన ఆశ్రమం – గృహస్థాశ్రమం. అందుకే ధార్మికమైన భోగం అనుభవించడానికి గృహస్థాశ్రమంలో అభ్యంతరం లేదు. ఏదైనా అనుభవించేటప్పుడు పరిశీలించవలసిన విషయం ఒక్కటే, ఇది ధర్మచక్రంలో ఇముడుతుందా అని పరిశీలించి, అలా ధర్మచక్రంలో ఇమిడే భోగాన్ని అనుభవించడం దోషం కాదు. గృహస్థాశ్రమం అంటే కేవలం ఒక స్త్రీ, ఒక పురుషుడు ఒక చోట కలిసి జీవించడం కాదు. వాళ్లు ఇద్దరు వ్యక్తులు అయినప్పటికీ కూడా ఇద్దరి మనసులు మాత్రం ఒక్కటైపోవాలి. అంత గొప్పగా ఒకటై పోవడానికి చేసే క్రతువుకే, 'వివాహ క్రతువు' అని పేరు.

సీతారాములు దాంపత్యానికి ప్రతినిధులుగా నిలబడతారు. ఆదర్శ దాంపత్యం అంటే మనం చెప్పేది ఎవరంటే సీతారాములే. నరుడిగా వచ్చిన రాముడు, సీతమ్మని స్వీకరించి ఆదర్శదాంపత్యానికి ప్రతీకగా నిలిచాడు. అందుకే కంచి కామకోటి పీఠాధిపత్యం వహించిన మహాపురుషులు, ప్రాత:స్మరణీయులు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వామి వారు తరచుగా ఒక మాట చెప్తూ ఉండేవారు. శుభలేఖ వేస్తే, సీతారాముల మూర్తి లేకుండా వేయవద్దు అంటూ ఉండేవారు. వాళ్లు ఆదర్శదాంపత్యానికి ప్రతీకలు.

వివాహం అయిన తర్వాత సీతారాముల దాంపత్యం గొప్పతనం గురించి ఎన్నో చోట్ల ప్రస్తావింపబడింది. అందులో అశోకవృక్షం మీద కూర్చుని కింద సీతమ్మని దర్శనం చేసిన హనుమ, సీతారాముల అన్యోన్య దాంపత్యం గురించి ఒక శ్లోకంలో ఒక మాట అంటారు –

**తుల్య శీల వయో వృత్తాం తుల్యాభి జనలక్షణాం**
**రాఘవోఽర్హతి వైదేహీం తంశీల్య మశితేక్షణా**

దాంపత్యం సిద్ధించాలని అంటే ఐదు లక్షణములు ఉండాలి.

'తుల్య శీలా' – శీలము ఇద్దరిదీ సమానమైనదై ఉండాలి. శీలము అంటే స్వభావము. స్వభావం పుట్టుకతో వస్తుంది. కొంతమందిది సాత్వికమైన ప్రవర్తన. కొంతమందిది రజోగుణంతో కూడుకున్న ప్రవర్తన. కొంతమందికి భోగముల యందు అనురక్తి ఉంటుంది. కొంతమందికి మంచి విషయముల యందు అనురక్తి ఉంటుంది. ఎవరికి దేనియందు అనురక్తి ఉన్నదో వాళ్లకి అటువంటి వారితో కలిసి జీవించడం సౌలభ్యంగా ఉంటుంది. సీతారాములు ఇద్దరి స్వభావమేది అంటే – ఆర్తత్రాణ పరాయణత్వం. ఎవరైనా కష్టంలో ఉంటే ఆదుకోవడం. అపారమైన దయ కలిగి ఉండడం వాళ్ళిద్దరికీ ఉండే స్వభావం. అందుకే దాంపత్యం అంత బాగా చేకూరింది. 'పెద్దలు నిశ్చయించినారు గాన' అని శుభలేఖలో ఎందుకు రాస్తారంటే ఈ ఐదు పరిశీలించి వివాహం చేశారా అని.

'వయో' – భర్త భార్యని ధర్మమార్గంలో నడిపించవలసిన వాడు. చేయి పట్టుకుని ప్రస్థానం చేయిస్తాడు. అందుకనే ఆయన అనుభవజ్ఞుడై ఉండాలి. అనుభవము అంటే – వయసు చేత అనుభవం వస్తుంది. అందుకని భార్యకన్నా భర్త వయసులో పెద్దవాడై ఉంటాడు. ముందు పుట్టినవాడు, అధ్యయనం చేసినవాడు. అంతమాత్రం చేత ఆమె అధ్యయనం చేయలేదని కాదు. దార్ఢ్యనికుడై నడిపించగలిగినవాడై ఉండాలి. 'నడిపించగలిగినవాడు' అన్న మాటని మీరు చాలా బాగా అర్థం చేసుకోవలసి ఉంటుంది. అన్నిటికన్నా భార్య హృదయాన్ని బాగా అర్థం చేసుకోగలిగినవాడై ఉండాలి.

ఆమె ఎక్కడో పుట్టిన పిల్ల – అన్నిటినీ విడిచిపెట్టింది. తన ఇంటిపేరు వదిలిపెట్టింది. తన వంశాన్ని విడిచిపెట్టింది. తల్లిదండ్రుల్ని విడిచిపెట్టింది. ఉన్న ఊరు విడిచిపెట్టింది. భర్త చిటికెనవేలు పట్టుకుని ఆయనతో పాటుగా కాపరానికి వచ్చేసింది. అలా వచ్చేసిన పిల్లకి అన్నీ ఆయనే. ఆమెకి ఎప్పుడైనా

ఆగ్రహం వచ్చిందనుకోండి. అక్కసు కలిగిందనుకోండి. ఆమె ఎవరితో మాట్లాడుతుంది? ఆ మాట భర్తతోనే మాట్లాడుతుంది. కానీ అప్పుడు భర్త దాన్ని సహృదయంతో స్వీకరించాలి తప్ప, ప్రతి విషయాన్నీ పరుషంగా తీసుకోవడానికి వీల్లేదు.

మీకు నేను రామాయణంలోనే ఒక ఉదాహరణ చెప్పాలి అంటే – రామచంద్రమూర్తి అరణ్యవాసానికి బయలుదేరుతున్నారు. సీతమ్మ వచ్చి ఎంతో ప్రాధేయపడింది. నేను కూడా మీతో పాటు అరణ్యవాసానికి వస్తాను అని. రాముడు అన్నాడు – నన్ను అరణ్యవాసం చేయమని మా నాన్నగారు చెప్పారు తప్ప నీ భార్యతో కలిసి అరణ్యవాసం చెయ్యి అని నన్ను అజ్ఞాపించ లేదు. పైగా అరణ్యమునందు మృగములుంటాయి, రాక్షసులుంటారు, సర్పములుంటాయి, వాతావరణం చాలా భయానకంగా ఉంటుంది. అటువంటిచోట, నువ్వు కూడా వచ్చి నాతో పాటు వనవాసం చేయడం అంత తేలికైన విషయం కాదు. అందుకని నువ్వు నాతో రావద్దు – అని చెప్పాడు. కానీ సీతమ్మ అంది కాదు కాదు వస్తాను. నాకు కూడా పితృ వాక్య పరిపాలన ఉన్నది. మీ నాన్నగారి వాక్యాన్ని మీరు ఎట్లా అనుష్ఠించి పరిపాలనం చేస్తున్నారో, నేను కూడా మా నాన్నగారి వాక్యాన్ని అనుష్ఠించాలి. ఎందుకని — మా నాన్నగారు కన్యాదానం చేసేటప్పుడు మీతో ఒక మాట చెప్పారు —

**"ఇయం సీతా మమసుతా సహధర్మ చరీ తవ**
**ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా**
**పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా**
**ఇత్యుక్త్వా ప్రాక్షిపద్రాజా మంత్రపూతం జలం తదా"**

"ఈమె పతివ్రత. నిన్ను నీడ ఎట్లా విడిచిపెట్టదో అలా నీడలా అనువర్తిస్తుంది" అన్నారు. నేను కష్టంలో ఉంటే నా నీడ నన్ను విడిచిపెట్టదు కదా. నేను సుఖంలో ఉంటే నా నీడ నాకు దగ్గరగా జరగడం అన్నది ఉండదు

గదా. ఎప్పుడూ కలిసే ఉంటుంది. అలా ఐనప్పుడు మీరు కష్టంలో ఉంటే, మీరు అరణ్యవాసానికి వెళితే నేను అంతఃపురంలో ఉంటే నాకు సంతోషంగా ఉంటుంది అని మీరు ఎలా అనుకుంటున్నారు?

**నా తంత్రీ వాద్యతే వీణా నా చక్రో వర్తతే రథః**
**నా పతిస్సుఖ మేధతే యా స్యాదపి శతాత్మజా**

నిజానికి వీణతీగలు గోటిదెబ్బలు తిని, పెనగి పెనగి మధురంగా మోగుతాయి. కానీ వీణ తీగలు పలుకుతున్నాయి అనరు. వీణ పలుకుతోందంటారు. వీణ తీగలు లేకపోతే నిజానికి వీణకు గౌరవం లేదు. వీణ పలకలేదు. అలాగే రథచక్రాలు ఎత్తుపల్లాల్లో రాళ్ళ మీద, గాజు పెంకుల మీద, ముళ్ళమీద, నలుగుడు పడుతూ వెడతాయి. రథచక్రాలు ప్రయాణం చేస్తున్నాయి అనరు. రథం వెళుతోంది అంటారు. అత్తవారింటికి వెళతానంటాడు అల్లుడు. నిజానికి ఆమెకు అంత గౌరవం రావడానికి ఆయన అంత కష్టపడి అంత ధర్మ మార్గంలో ప్రయాణం చేసి ఆమెకీ వైభవం తెచ్చాడు ఇంటికీ వైభవం తెచ్చాడు. అటువంటి భర్త భార్యకి ఏది ఇస్తాడో అది అపరిమితం. అది తల్లి కాని, తోడబుట్టిన వాళ్ళు కానీ, భర్త ఇచ్చినంత ఇవ్వలేరు.

ఇదే మాట అయోధ్యకాండ చివరలో అనసూయమ్మ సీతమ్మతో చెప్తుంది. ఎందుకు భర్త అపరిమితంగా ఇస్తాడంటే – రెండు కారణములు ఉంటాయి. మొట్టమొదటిది భర్తగారు ఏ సత్కార్యం చేయనివ్వండి, అందులో సగభాగం భార్యకెడుతుంది. అందుకే పుణ్యాన్ని కట్టపెట్టగలిగినవాడు భర్త. ఆమెకి ఎందుకు సగం వెళ్ళిపోతుంది అంటే – ఆయన అసలు ధర్మకార్యాన్ని ఆచరించాలి అంటే ఆయన శరీరం ఉండాలి.

"శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం" అంటాడు కాళిదాసు. శరీరం నిలబడుతోందంటే, దానికి వేళపట్టున అన్నం పెడుతున్నది, ఫలహారం చేసి

పెడుతున్నది, పిల్లల్ని సాకుతున్నది, వంశాన్ని నిలబెడుతున్నది, ప్రసవ వేదన పడినది, ఆయన్ని తండ్రి చేసినది – ఆమే..!! అందుకని ఆమెకి సగభాగం వెళ్ళిపోతుంది. అదికాక ఆమె కూర్చుని రామనామం రాస్తున్నదనుకోండి. పుణ్యకార్యం చేసిందనుకోండి. అందులో ఇక భర్తకి సగం ఇవ్వరు. అందుకే పరమ ధార్మికుడైన భర్త, అతని భార్య ఒకసారే శరీరం వదిలిపెడితే, యథార్థమునకు భర్తగారి పుణ్యం కన్నా భార్యగారి పుణ్యమే ఎక్కువ. ఎందుకంటే ఆయన పుణ్యంలో సగభాగం ఆవిడకి వెళ్ళిపోయింది. అందుకే ఆయన ఇచ్చినంతగా ఇంకెవ్వరూ ఇవ్వలేరు. అపరిమితంగా ఇవ్వగలిగిన వాడు భర్త.

అట్లాగే – ఒక స్త్రీ జీవితానికి పరిపూర్ణత్వం ఎప్పుడంటే అమ్మ అని పిలిపించుకున్నప్పుడు. ఆ అమ్మ అని పిలిపించుకోవడానికి కావలసిన వైభవం భర్త ధార్మికమైన కామనిరతి చేత సమకూరింది. అందుచేత భర్త ఉన్నతస్థానమందు నిలబడ్డాడు అని అంటుంది అనసూయ.

వాళ్లు మాట్లాడినదాంట్లో పక్షపాతాలు ఉండవు. ఎవరినో ఎక్కువచేసి మాట్లాడాలి, ఎవరినో తక్కువచేసి మాట్లాడాలి అని వాళ్లకు ఉండదు. వాళ్లు ఉన్న యథార్థాన్ని మాట్లాడుతూ ఉంటారు. ఎక్కడ భర్త గొప్పవాడో అక్కడ భర్త గురించి, ఎక్కడ భార్య గొప్పదో అక్కడ భార్య గురించి చెప్తారు.

అదే చెప్పిన రామాయణం ఇంకొక మాట కూడా చెప్తుంది. నిజానికి ఒక పురుషుడికి శాంతి, సంతోషం, ఊర్ధ్వలోక ప్రాప్తి, పుణ్య సముపార్జన అన్నీ ఆమె మీదే ఆధారపడి ఉంది. ఆమె రావొచ్చు రాకపోవచ్చు. ఆమె అనారోగ్యంగా ఉండి, ఇంటి దగ్గర ఉన్నా, ఒక రవికల బట్టని, పంచలో బొడ్డులో దోపుకుని పురుషుడు యజ్ఞం చేసేయవచ్చు. ఆమె లేకపోతే తన కడుపున పుట్టిన ఆడపిల్లని కన్యాదానం చేయడానికి కూడా అధికారం లేదు. వేరు దంపతులు కూర్చుని కన్యాదానం చేయాలి. అంటే ఆమే ఆయన

పుణ్యానికి కారణమైంది. ఎక్కడ ఎవరు గొప్పగా ఉంటారో, దాని గురించి ధర్మశాస్త్రం మాట్లాడతారు తప్ప, పక్షపాతాలతో మాట్లాడటం శాస్త్రాలకు ఉండదు. సరిగ్గా పరిశీలించి తెలుసుకుంటే నిష్పక్షపాతంగా మాట్లాడారు అని అర్థం. కాబట్టి –

**నా పతిస్సుఖ మేధతే యస్యాదపి శతాత్మజా**

సీతమ్మ అంది – నూరుగురు కొడుకులు పుట్టినా, వారందరూ ఎంత ప్రేమైకమూర్తులు అంటే, అమ్మ నిద్రలేచిన తర్వాత మంచంమీదినుంచి కాళ్లు కిందకి పెడుతున్నప్పుడు అమ్మ అరికాళ్ళు కందిపోతాయేమోనని వారి అరిచేతులను చాపి, చేతులలో అమ్మ పాదములు వేయించుకుని నడిపించగలిగినంత ప్రేమైకమూర్తులు అయినప్పటికీ, ఆ నూరుగురు కొడుకుల వలన కలిగిన సంతోషము, సుఖము కన్నా, భర్తగారు ఉన్నారన్న మాట, ఆ భర్త పక్కన భార్యగా నిలబడటంలో ఉన్న సంతోషం వేరు. ఆ స్వాతంత్ర్యం వేరు, ఆ పవిత్రత వేరు, ఆ ఔన్నత్యం వేరు.

అందుకని మీతో నేను అరణ్యానికి వస్తాను తప్ప, అయోధ్యలో ఉంటే సుఖపడతావు అంటే, అట్లా ఉండడానికి నేను సిద్ధంగాలేను అంటుంది సీతమ్మ. ఇన్ని చెప్పినా కూడా శ్రీరామచంద్రమూర్తి ఆమెను తీసుకెళ్లడానికి అంగీకరించలేదు. అప్పుడు ఆమెకి మనసు చాలా బాధ కలిగి, ఒక మాట అంది.

**కింత్వామన్యత వైదేహః పితా మే మిథిలాధిపః**
**రామ! జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్**

నువ్వు నన్ను అరణ్యవాసానికి తీసుకెళితే అక్కడ మృగాలు ఉంటాయి, సర్పాలు ఉంటాయి, రాక్షసులు ఉంటారు అని ఇన్ని మాటలు చెప్తున్నావు. నిజానికి మీరు అండగా ఉండగా నాకు ఏ ఆపద కలుగుతుంది? అని మీతో

కలిసి అరణ్యవాసానికి రావడానికి నేను సిద్ధపడ్డాను. ఎందుకనంటే మీరు ఉండగా నన్ను సర్పాలు ఏం చేస్తాయి; మృగాలు ఏం చేస్తాయి; రాక్షసులు ఏం చేస్తారు? నాకా ధైర్యం ఉంది. కానీ మీరు అరణ్యవాసానికి నన్ను తీసుకెళ్లడానికి బాధపడుతున్నారు. ఆ భయాన్ని దాస్తున్నారు. నాకనిపిస్తోంది, మా నాన్నగారు జనకమహారాజుగారు, మిమ్మల్ని చూసి పురుషుడు అనుకుని నన్ను ఇచ్చి వివాహం చేశారు. కానీ నిజానికి మీరు పురుషరూపంలో ఉన్న స్త్రీ. అందుకే నన్ను తీసుకెళ్లడానికి మీరు భయపడుతున్నారు అన్నది.

అంతమాట అన్నప్పుడు మనకి రామాయణం చదువుతున్నప్పుడు రాముడి మీద ఉన్న భక్తికి మనకేమనిపిస్తుందంటే – ఎంతైనా సీతమ్మ అంత మాట అనడం ఏమిటండి? అనిపిస్తుంది. కానీ మీరు ఆలోచించండి – ఆ పరిస్థితుల్లో భర్తని విడిచిపెట్టి ఉండలేదు. భర్తగారితో కలిసి అరణ్యవాసానికి వెళ్ళిపోదామని కోరిక. ఆయన అనుమతించడంలేదు. అక్కసుతో బాధ పడిపోతున్న సీతమ్మ భర్తతో కాకపోతే అప్పుడు అట్లా ఇంకెవరితో మాట్లాడుతుంది? అది సహృదయంతో రాముడు తీసుకున్నాడు. ఈమె తప్ప అలా ఎవరు మాట్లాడతారు, ఈమెకి ఎంత ఆర్తి ఉందో నాకు అర్థం అవుతోంది. అనుకుని వెంటనే ఆమెని కూడా తనతో పాటుగా అరణ్యవాసానికి తీసుకెళ్లాడు.

అంటే భార్య హృదయాన్ని అర్థం చేసుకోగలిగిన లక్షణం భర్తకు ఉన్నప్పుడే అన్యోన్యదాంపత్యం సిద్ధిస్తుంది. అది "తుల్యశీలా వయో...." అనుభవం ముందు పురుషుడికి రావాలి.

తర్వాత ఆయన కొరకు బ్రతకడం, ఆ త్యాగబుద్ధి ఆమెకు రావాలి. ఎందుకంటే, వాళ్ళిద్దరూ కలిసి ఉండలేదు. కలిసి పెరగలేదు; ఒకరికొకరు తెలిసున్నవారు కారు; ఒక ఊరు వారు కారు; ఎక్కడి నుంచో వచ్చారు – ఇద్దరు కలిసి ప్రస్థానం మొదలుపెట్టారు. జీవితం పండించుకోవడం

అక్కడుంది. అయినప్పుడు వాళ్ళిద్దరి మధ్య ఎంత గొప్ప అవగాహన ఉంటే దాంపత్యం అన్నది సిద్ధిస్తుంది? అది ఎంత గొప్పగా సిద్ధించాలో రామాయణం నేర్పుతుంది. అందుకు రామాయణం చదవండి అంటారు.

ఇంక నడవడి – నడవడి అత్యంత ప్రధానమైనది. ఎప్పుడు ఎక్కడ ఎట్లా ప్రవర్తించాలో తెలిసి ఉండాలి. సీతారాములిద్దరిదీ కూడా అంత గొప్ప ప్రవర్తన. ఒక ఆశ్రమానికి వెళ్ళినప్పుడు ఎట్లా మాట్లాడాలో అట్లాగే మాట్లాడుతారు రామచంద్రమూర్తి – అంత గొప్పవాడైనా ..!! గురువుల సమక్షంలో అసలు ఎక్కువ మాట్లాడడు. ఆయనే చెప్పుకున్నాడు ఒకసారి అరణ్యకాండలో. శూర్పణఖతో మాట్లాడుతూ ఆయన అన్నాడు –

**అనృతం నహి రామస్య కదాచి దపి సమ్మతమ్**
**విశేషే ణాశ్రమస్థస్య సమీపే స్త్రీ జనస్యచ ..** అన్నాడు

అబద్ధం ఆడడం అన్న మాట నా జీవితంలో లేదు. రాముడు అంటే ఒకటే మాట. ఒకటే బాణం. ఒకటే పత్ని. ఒక మాట అని ఆ మాట తప్పడం నాకు అలవాటు లేదు. అయినా నేను ఎప్పుడైనా గురువులు ఉన్న ఆశ్రమాలకు వెడితే ఎక్కువ మాట్లాడను. ఎందుకని అంటే అక్కడ వారు మాట్లాడవలసిన వారు; నేను వినవలసిన వాడిని. స్త్రీలు చుట్టూ ఉన్నప్పుడు, అక్కడ కూడా అదుపుతప్పి ఎక్కువగా మాట్లాడటం అన్నది నేను చెయ్యను. ఈ రెండు విషయాల్లో నేను చాలా జాగ్రత్తగా ఉంటాను. నన్ను నేను పరిశీలించుకుంటూ ఉంటానని చెప్పాడు రాముడు. అంటే రాముడి నడవడి అంత ధార్మికంగా ఉంటుంది. అడుగు తీసి అడుగు వేస్తే సత్య, ధర్మములకు కట్టుబడుతుందా అని చూస్తాడు.

ఆయనము అంటే నడక. ఉత్తరాయనం అంటే కాలము ఉత్తరాయనం అని నడుస్తోంది. దక్షిణాయనం అంటే పుణ్యాన్ని సముపార్జించుకునే కాలం. పిల్లవాడు పరీక్షలకి బాగా చదువుకుని ఇక పరీక్షలకు వెళ్ళవలసిన

సమయంలో జ్వరం వచ్చిందనుకోండి, అయ్యో పాపం అంటారు. దక్షిణాయనంలో శరీరం వదిలి పెట్టేసాడు అనుకోండి అయ్యో పాపం అంటారు. ఎందుకని అంటే దక్షిణాయనం అంతా పుణ్యాన్ని సముపార్జించుకునే కాలం.

ఇప్పుడు శ్రావణమాసం నడుస్తోంది. ఇవాళ సోమవారం నిజానికి శ్రావణమాసంలో ఉండే సోమవారం గురించి ఏం చెప్తారంటే – దేవతలకు కూడా దుర్లభం. ఈనాడు సాయంకాలం ప్రదోషవేళలో శివలింగం మీద ఒక మారేడుదళం వేద్దామని 33 కోట్ల మంది దేవతలు కూడా ఎదురు చూస్తారుట. కానీ అది సాధ్యం అవుతుందని నేను అనుకోవట్లేదు అని శ్లోకంలోనే ఉంది. ఈ మారేడుదళాన్ని తీసుకొని సోమవారంనాడు శ్రావణమాసంలో శివార్పణం చేస్తే అంత గొప్ప ఫలితం. ఒక్కొక్క దేవుడు ఒక్కొక్క కాలమునందు ఒక్కొక్క ఫలితాన్నిస్తాడు. అటువంటి శ్రావణ సోమవార ప్రదోషము రామాయణ శ్రవణం కూడా అంతే గొప్పది. ఒక్కొక్కసారి ఒక్కొక్కటి విశేష ఫలితాన్ని సంక్రమింప చేస్తుంది. అందునా ఉన్న దేశం అంటే ప్రాంగణం ఎటువంటిది? జగద్గురువుల ఆశ్రమప్రాంగణం ఇది. ఒక పీఠప్రాంగణం. అయినప్పుడు ఎంత పరమ పవిత్రమైన ప్రదేశంలో ఎంత పవిత్రమైన విషయాన్ని మీరు వింటున్నారు?. కాబట్టి ఎక్కడ, ఎప్పుడు, ఎట్లా ఉండాలో దేశ కాలములు తెలుసుకుని ప్రవర్తించడం ఏదైతో ఉన్నదో, అది గొప్ప. అది సీతారాముల యందు కనపడుతుంది. ఇద్దరిదీ సమానమైన నడవడి.

"తుల్యాభి జన రక్షణం." ఇద్దరి వంశములు అంత గొప్పవి. నిన్న విన్నారు కదా ఇక్ష్వాకువంశం అంత గొప్పది. ఎంతమంది మహాపురుషులు ప్రభవించారు. అటు విదేహవంశమంత గొప్పది. అంతమంది మహాపురుషులు ప్రభవించారు. ఇద్దరూ పరమ దయా స్వరూపులు. ఇద్దరికీ కారుణ్యము లక్షణము. ఎంత కారుణ్యమంటే, సముద్రపు లోతు

తెలుసుకుందామని ఒక ఉప్పుబొమ్మ ప్రయాణం మొదలుపెడితే ఆ నీటిలో ఉప్పుబొమ్మ కరిగిపోయినట్లు.. సీతారాముల దయను తెలుసుకుందామని పరిశీలనం చేస్తే వాళ్ళ దయలో మనం కరిగిపోతాం. అందుకే గోపరాజు గారు దాశరథీ శతకం చేస్తే మకుటం కింద కరుణా పయోనిధీ అని పెట్టుకున్నాడు. అంటే దయకు సముద్రమువంటి వాడా అన్నాడు.

**శ్రీరఘురామ చారు తులసీదళదామ, శమక్షమాది శృం**
**గార గుణాభిరామ, త్రిజగన్నుత శౌర్య రమా లలామ దు**
**ర్వార కబంధ రాక్షస విరామ, జగజ్జన కల్మషార్ణవో**
**త్తారకనామ భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!**

రామాయణంలోనే సుందరకాండలో త్రిజట అంటుంది.

**ప్రణిపాతప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా**
**అలమేషా పరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్**

సీతమ్మ దగ్గరికి వెళితే అమ్మా అని పిలవను కూడా పిలవక్కర్లేదట. ఒకసారి నేల మీద పడిపోతే చాలు. ఒక స్వర్ణదండం పట్టుకున్నంతసేపు అహంకారం. అహంకారం అన్నపట్టు వదిలేయగానే కర్ర ఎలా పడిపోతుందో అలా అమ్మవారి ముందు పడిపోతే చాలట. ఇంకేం అనక్కర్లేదు రక్షిస్తుంది. అందుకే పక్కన సీతమ్మ ఉండగా కాకాసురుడు అంత తప్పు చేసినా, వచ్చి పడిపోతే కాపాడబడ్డాడు. రామచంద్రమూర్తి? సీతమ్మ తో పోలిస్తే కొంచెం ఒక మాట అనాలి.

యుద్ధకాండలో రాముడు అన్నాడు "రామా నేను నీ వాడను అని ఎవరంటారో, వాళ్ళందరినీ నేను కాపాడతా" నని అన్నాడు. సీతమ్మ దగ్గరికి వెళ్తే ఆ మాట కూడా అనక్కరలేదు. అందుకే – సీతమ్మ కంటి నలుపు ఎక్కువట. అంటే ఆ కంటికి అసలు ఎరుపు తెలియదు. అంత గొప్ప తల్లి.

అంతటి కరుణ గలిగినది. సీతారాముల దాంపత్యం అంత గొప్పగా సిద్ధించింది అంటే దానికి కారణం వాళ్లిద్దరికీ ఉన్న ఐదు లక్షణములు. లోకంలో ఎక్కడ దాంపత్యంలోకి ప్రవేశపెట్టేముందైనా ఈ అయిదు ఇద్దరి మధ్య ఉన్నాయా? వధువుకి, వరుడికి, ఈ ఐదూ సరిపోతాయా – శీలము, వయస్సు, వృత్తము, అభిజనము, లక్షణము – లక్షణము అంటే వాక్యంలో అందం ఒకరికొకరు తగిన వారై ఉండాలి.

**తగు నీ చక్రి విదర్భరాజసుతకుం; దథ్యంబు వైదర్భియుం**
**దగు నీ చక్రికి; నింత మంచి దగునే? దాంపత్య మీ యిద్దరిం**
**దగులం గట్టిన బ్రహ్మ నేర్పరిగదా; దర్పాహతారాతి యై**
**మగఁడౌఁ గావుతఁ జక్రి యీ రమణికిన్ మా పుణ్య మూలంబునన్.**

అంటారు రుక్మిణీ కళ్యాణంలో పోతన గారు. దాంపత్యం ఎలా ఉండాలి? అంటే – అబ్బ ఎంత అదృష్టవంతురాలు అండీ ఆయనకి ఇల్లాలు అనీ అనకూడదు. ఎంత అదృష్టవంతుడిని ఆవిడకి భర్త అనీ అనకూడదు. ఎంత అదృష్టవంతులండీ ఆయనకు తగిన ఇల్లాలు ఆవిడ; ఆమెకు తగిన భర్త ఆయన అనిపించుకోగలగాలి.

శంకరాచార్యులు వారు శివానందలహరి చేస్తూ –

**"కలాభ్యాం చూడాలంకృత శశికళాభ్యాం నిజతపః**
**ఫలాభ్యాం భక్తేషు ప్రకటిత ఫలాభ్యాం భవతు మే**
**శివాభ్యామస్తోక త్రిభువన శివాభ్యాం హృది**
**పునర్భవాభ్యాం ఆనంద స్ఫురదనుభవాభ్యాం నతిరియం"**
...అంటారు.

నిజతపః ఫలాభ్యాం – ఒకరి తపస్సుకి ఒకరుభావమైన వారుట పార్వతీ పరమేశ్వరులు. అందుకే ..

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ..

శివానంద లహరిలోనే శంకరులు అంటారు ...

**నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయనీశ్రేయసే**
**సత్యాయాద్య కుటుంబినీ మునిమనః ప్రత్యక్షచిన్మూర్తయే** ...అంటారు.

ఆది కుటుంబం. మొట్టమొదటి కుటుంబం వాళ్ళదే. గృహస్థాశ్రమం మొట్టమొదటిది ఎవరిదీ అంటే పార్వతీ పరమేశ్వరులదే. నరుడిగా శ్రీమహావిష్ణువు వచ్చి మన అందరికీ కూడా ప్రవర్తన నేర్పాడు. అందుకే సీతారాములది ఆదర్శ దాంపత్యం. ఆయన ఎన్నో అవతారాలు తీసుకున్నాడు.

**వేదోద్ధారణ! మందరాభరణ! పృథ్వీధర్మనిర్మాణ! ప్ర**
**హ్లాద త్రాణ! బలిప్రతారణ! నృపాహంకారనిర్వాపణా!**
**వైదేహీ రమణా! ధనంజయవ్యాపారపారీణ! క్షో**
**ణీదివ్య త్కరుణా! తమోహరణ! తంద్రీ శ్రీనివాస ప్రభూ!**

అయినా రామావతారంలో సీతారాములుగా అన్యోన్యదాంపత్యం అంత గొప్పది. అసలు సనాతనధర్మంలో భారతీయ దాంపత్యం వైభవానికి ఉన్న గొప్పతనాన్ని సీతారాముల దాంపత్యంలో వాల్మీకి మహర్షి చూపిస్తారు. వివాహం అయిన తర్వాత సీతారాములు ఎంత అన్యోన్యంగా ఉన్నారు అన్నదానికి –

**ప్రియాతు సీతా రామస్య దారాః పితృ కృతా ఇతి ।**
**గుణాద్రూప గుణాచ్చాపి ప్రీతిః భూయోభివర్ధతః ॥** అన్నారు

సీతమ్మ అంటే రామచంద్రమూర్తికి ఎంతో ప్రీతిట. ఎందుకు ప్రీతి?

అకస్మాత్తుగా కదా మీ ఇల్లాలి స్థానంలో ప్రవేశించింది.. ఆయన ఆమెను ప్రేమించడానికి కారణం ఏమిటంటే – ఈమె నీకు తగిన ఇల్లాలు, ఈమె నీ ధార్మికజీవనంలో బాసటగా నిలబడుతుందని మా నాన్నగారు నిర్ణయం చేసి, కోడలుగా తెచ్చుకున్నారు. నా పక్కన ధర్మపత్నిగా నిల్చోబెట్టారు. ఇది మా నాన్నగారి నిర్ణయం. మా నాన్నగారి నిర్ణయాన్ని గౌరవించడం అంటే ఆయన ఏ గుణములు ఈమెయందు ఉన్నాయని నాకు ధర్మపత్నిని చేశారో వాటిని నేను విశ్వసించి ఈమెను ప్రేమించాను. అంటే రాముడు సీతమ్మని ప్రేమించడానికి కారణం ఉంది – ఏమిటా కారణం అంటే – దశరథుడు ఇల్లాలిని చేశాడు. మరి సీతమ్మ రాముని ప్రేమించడానికి కారణం? ఏం ఉండదు.

సీతమ్మ దేనికి ప్రేమించింది అంటే భర్త దైవం. ఆయన్ని ప్రేమించడానికి కారణాలు లేవు. ఆయన కన్నా గొప్పవాడు నాకు ఇంకెవ్వరూ లేరు. ఆయన వలన నేను ఎంతమందినైనా గౌరవిస్తాను. ఆయనతో సమాన స్థానం మాత్రం ఎవ్వరికీ ఉండదు. బావగారు – ఆయన అన్నగారు – గౌరవిస్తాను. మామగారు – ఆయన నాన్నగారు – గౌరవిస్తాను. అత్తగారు – ఆయన తల్లిగారు – గౌరవిస్తాను. ఆడబడుచు – ఆయన చెల్లి లేదా అక్క – గౌరవిస్తాను. ఆయన కన్నా గొప్పది ఇంకేం లేదు. ఈ గౌరవాలన్నీ ఎందుకంటే ఆయనను గౌరవించడం కోసం. ఆయన సంతోషం కోసం. అదీ భారతీయ దాంపత్య వైభవం. ఇంత గొప్ప అవగాహనతో ఉంటుంది. అందుకని –

ఆమె ప్రేమ గుణములుగా మారి రాముణ్ణి అనువర్తిస్తోంటే రామచంద్రమూర్తికి రోజురోజుకీ రోజురోజుకి ఆమె మీద ప్రీతి పెరిగేదిట వాల్మీకి మహర్షి ఒక చమత్కారం చెప్పారు వాళ్ళిద్దరి దాంపత్యం గురించి.

**రామస్తు సీతయాసార్ధం విజహార బహూనృతూన్**
**మనస్వీ తద్గతస్తస్యా నిత్యం హృది సమర్పితః ..** అన్నాడు

మా ఊళ్లో పౌర్ణమి చంద్రుడే పౌర్ణమి చంద్రుడు అన్నాట్ట ఒక ఆయన. అదేమిటీ ఏ ఊర్లో నైనా పౌర్ణమి చంద్రుడు ఒకటే. హైదరాబాదు నేనొచ్చి పౌర్ణమినాడు చంద్రుని చూసినట్లయితే అట్లాగే ఉంటాడు. నేను కాకినాడలో గోశాలలో చూసినా పౌర్ణమి చంద్రుడు అట్లానే ఉంటాడు; మాఇంట్లోంచి చూసినా అట్లాగే ఉంటాడు. అది ఆ ఊరు మీద ఉన్న అభిమానం. ఇన్నాళ్లు రాముడు పౌర్ణమి చంద్రుణ్ణి గవాక్షంనుండి చూసి సంతోషిస్తూ ఉండేవాడు. ఇప్పుడు పౌర్ణమి చంద్రబింబాన్ని చూసి సంతోషించాలంటే "సీతా !! రా ! తరవాత చేద్దుగానివిలే పని..!! రా చూడు కాసేపు కూర్చో ..!! చంద్రుడు ఎంత బావున్నాడో..!" అంటాడు. పక్కన సీతమ్మ కూర్చుంటే పౌర్ణమి చంద్రబింబం చంద్రబింబంలా కనబడుతుంది. పక్కన సీతమ్మ లేకపోతే చంద్రబింబం అయినా అంత బాగా అనిపించదుట. ఆమెతో కలిసి అనుభవించిన సుఖమే ఆయనకు సుఖం. అంటే ఇది రాముడు పెంచుకున్నదే కాదు ఆమె సంపాదించుకున్నది కూడా. అనువర్తించింది. అందుకే మనకి దాంపత్యంలో లక్ష్మీనారాయణుల్లో లక్ష్మీదేవి నారాయణమూర్తి కాళ్లు వత్తుతూ కనబడుతుంది. అంత కాళ్ళనొప్పులా ఆయనకీ? అంటే కాళ్ళనొప్పులని కాదు. పాదములకు సేవ చేయుట అంటే ఆయనను అనువర్తించుట. ఆయన ఏం చేస్తే అది ఆవిడ చేస్తుంది. ఆయన ఏం చేస్తుంటాడు?

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం**
**ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే**

ఎప్పుడూ సాధుపురుషుల్ని రక్షిస్తూ ఉంటాడు. గజేంద్రమోక్షం ఘట్టంలో అసలు భార్యకి కూడా చెప్పకుండా అక్కడ ఎక్కడో హంసతూలికా తల్పం మీద ఆడుకుంటున్నాడు అమృత సరోవరంలో.

**అల వైకుంఠపురంబులో నగరిలో నా మూల సౌధంబు దా**
**పల మందారవనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో**

**త్పల పర్యంక రమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి**
**హ్వల నాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యాలించి సంరంభియై.**

**సిరికిం జెప్పఁడు; శంఖ చక్ర యుగముం జేదోయి సంధింపఁ; డే**
**పరివారంబునుఁ జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం**
**తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు; వివాద ప్రోత్థిత శ్రీ కుచో**
**పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై**

ఆ పట్టుకున్న పమిటకొంగును కూడా విడిచిపెట్టకుండా అలాగే పట్టుకుని గజేంద్రుణ్ణి రక్షించడానికి గబగబా వెళ్లి పోతున్నాడు. ఎక్కడికి వెళ్తున్నాడో కూడా చెప్పలేదు.

**తన వెంటన్ సిరి; లచ్చివెంట నవరోధవ్రాతమున్; దాని వె**
**న్కనుఁ బక్షీంద్రుఁడు; వాని పొంతను ధనుః కౌమోదకీ శంఖ చ**
**క్ర నికాయంబును; నారదుండు; ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ**
**య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్.**

అందరూ ఆ వెనకాతల వచ్చేస్తున్నారు. ఆయనంటే గబగబా వెళ్ళిపోతున్నాడు. “నీ పమిటకొంగు పట్టుకుని వచ్చేశానా?” అన్నాడు ఆఖర్న. కానీ ఆయన అలా వచ్చేస్తుంటే ఆకాశమార్గంలో ఆ వెనకాతల ఆయన్ని అనువర్తించడం అంటే, ఓ పక్క పమిటకొంగు ఇలా పట్టుకోవాలి, కాళ్ళలో కాళ్లు పడిపోకుండా చూసుకోవాలి..

**అడిగెదనని కడువడిఁ జను**
**అడిగినదన మగుడ నుడువడని నడయుడుగున్,**
**వెడవెడ జిడిముడిఁ దడబడ,**
**నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్;**

లక్ష్మీదేవి అడుగులు ఎంత తడబడ్డాయో, 'ద'కారం అలా తిరిగింది పోతనగారి పద్యంలో. అంత కష్టపడి అనువర్తించిన తరువాత గజేంద్రుని రక్షించేసి "అయ్యో నీ పమిట కొంగు పట్టుకుని వచ్చాను. ఎంత ఇబ్బంది పడ్డావో..!" అన్నాడు. అంటే ఆవిడంది – "ఎప్పుడూ దీనుల్ని రక్షించడానికి ఇలా పరుగెడుతూ ఉంటావు. అటువంటి నిన్ను చూసి ఆనంద పడిపోయి నిన్ను అనువర్తించడంలో నాకు ఎంత సంతోషం ఉంటుందో స్వామీ..!" అంది.

ఆయనను అనువర్తిస్తుంది. అన్నిట్లో ఆయనకు చేదోడు వాదోడుగా ఉంటుంది. ప్రమాదం అయితే వెనక్కి లాగుతుంది తప్ప ఆయన తరించాలి. ఆయన వలన మీరు తరించాలి. అన్ని మంచిపనులకు వెనక ఆధారమై నిలబడుతుంది. అలా నిలబడుతుంది కాబట్టి, ఆమె ఆయన పాదాల దగ్గర కూర్చుంది. ఆయన పాదాల దగ్గర కూర్చోబెట్టుకోలేదు.

నువ్వు నావెంట అలా ఉంటావు కాబట్టి నిన్ను నా గుండెల్లో పెట్టుకుంటానని ఆయన అంటాడు.

**ఈశానాం జగతోస్య వేంకటపతే ర్విష్ణోః పరాం ప్రేయసీం**
**తద్వక్షః స్థల నిత్య వాసర సికాం తత్ క్షాంతి సంవర్ధినీమ్**
**పద్మాలంకృత పాణి పల్లవ యుగాం పద్మాసనస్థాం శ్రియం**
**వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్**

ఆయన వక్షస్థలంలో ఉందంటే ఆయన గుండెల్లో పెట్టుకున్నాడు. కారణం ఆయన్ని అనువర్తించింది. అదీ దాంపత్యం. లక్ష్మీ నారాయణుల్లా బ్రతకండి. అని లక్ష్మి కూర్చున్న తామరపువ్వు వంటి బుట్టలో తీసుకొచ్చి, నారాయణమూర్తికి ఇచ్చి వివాహం చేస్తున్నానని కాళ్లు కడిగి కన్యాదానం చేస్తారంటే వాళ్ళలా కలిసి మెలిసి బ్రతకండి. రెండు మనసులు ఉండకూడదు. రెండు శరీరాలు ఉంటాయి. మనసులు ఒక్కటై పోతాయి దాంపత్యంలో. అది

అవసరమని చెప్తుంది రామాయణం.

రాముడి హృదయం సీతమ్మ దగ్గరికి వెళ్ళిపోయింది; సీతమ్మ హృదయం రాముడి దగ్గరికి వెళ్ళిపోయింది; అందుకని వాళ్ళు ఆనందించాలంటే ఇద్దరు కలిసి కూర్చుని ఆనందిస్తారు; బాధపడితే ఇద్దరు కలిసే బాధ పడతారు. ఒకడు బాధపడుతుంటే ఒకడు సంతోషించడం ఒకడు సంతోషిస్తే ఒకడు బాధపడడం; ఒకరి బాధకు వేరొకరు దెప్పి పొడుచుకోవడం లాంటివి ఉండవు. ఇద్దరూ కలిసి మెలిసి ప్రస్థానం చేస్తారు. ఆ ప్రస్థానం చెయ్యడంలో ఉంది దాంపత్యం గొప్పతనం. ఒకరికొకరు ఆసరాగా నిలబడటంలో ఉందా గొప్పతనం. అంతేకానీ కష్టంలో ఉన్నాడని విమర్శించడం ఉండదు.

అనసూయమ్మ అడిగింది "ఏమమ్మా..! మీ ఆయన రాజ్యం వద్దు అని చెప్పి వాళ్ళ నాన్నగారిని రాత్రికి రాత్రి కైకమ్మ వరమడిగిందని అరణ్యానికి వచ్చేశారు. నీకు బాధగా అనిపించలేదా..?" అని.

"అనిపించలేదమ్మా..! తండ్రిని ధర్మమునందు నిలబెట్టడానికి ఎన్ని కోట్లమందిలో ఒక్క కొడుకు అట్లా వస్తాడు? ఆ కొడుకుకి నేను భార్యనైనందుకు గర్వ పడుతున్నాను." అని సీత అంది. అదీ దాంపత్యం. అంతేగాని – "మా ఆయన చేతకానితనం.. మొదట్నించి అంతేనండి వాళ్ళ అమ్మా నాన్న కూచి" అని సీతమ్మ అని ఉంటే రామాయణానికి ప్రవచనం ఎందుకు? మీరూ నేనూ కూర్చోవడం ఎందుకు? అదో సమయం వృధా తప్ప..!

హృదయాలు కలిసి ఉండడం గొప్పదనం. ఆ సీతారాముల దాంపత్యం ఎంత గొప్పగా వర్ధిల్లింది అంటే కొంతకాలం అయిపోయిన తర్వాత ఆయనా పూర్తిగా మట్లాడేవాడు కాదు, ఆమె కూడా పూర్తిగా మాట్లదేది కాదు. అంటే, మౌనంగా వాళ్ళిద్దరి హృదయాలు మాట్లాడుకునేవి. మౌనంగా. నోటితో మాట్లాడు కోనక్కర్లేదు.

"ఏమోయ్..!" అన్నాడనుకోండి సాయంకాలం ఐదున్నరకి. ఉత్తరీయం తలుపు మీద వేసి, పంచె కట్టుకుని ఉత్తరీయాన్ని వెతుక్కుంటాడని – ఈయన బలహీనత – తలుపు మీద వేశానని మరిచిపోతాడు ఎప్పుడూ. "ఆ ఉత్తరీయం తలుపు మీద ఉంటుంది చూసుకోండి..!" అని లోపలినుంచి అంటుంది – ఆయన నా ఉత్తరీయం ఏది అని ఆమెను అడగకముందే. అంటే ఆయన బలమూ తెలుసు; బలహీనతా తెలుసు. ఆయన హృదయాన్ని గమనించి మిగిలింది పూర్తిచేసింది.

రామాయణంలో నుంచి చెప్పాలి అంటే రామచంద్రమూర్తి పట్టాభిషేక సమయంలో సీతమ్మ అందరికీ అన్ని కానుకలు ఇచ్చేశాక మెడలోనించి ఒక ముత్యాలహారం తీసి పట్టుకుంటుంది. "ఇదేమిటి అందరికీ ఇచ్చేశాం కదా, ఎవరినైనా మర్చిపోయామా?" అని అడగలేదు రాముడు.

**"ప్రదేహి సుభగే హారం యస్య తుష్టాసి భామిని ।**
**పౌరుషం విక్రమో బుద్ధిః యస్మిన్నేతాని సర్వశః" ॥** అన్నాడు.

నాకు అర్థం అయింది సీతా నువ్వు ఎందుకు ముత్యాలహారం పట్టుకున్నావో..! ఎవరియందు పౌరుషము, ఎవరియందు బుద్ధి, ఎవరియందు దేశకాలములు తెలిసిన మహాపాండిత్యం ఉన్నదో, ఎవరు మహానుభావుడో, ఎవరి వలన ఇవ్వాళ మనిద్దరం ఇలా మళ్లీ కలిసి సంతోషంగా ఉన్నామో, ఆయనకి నువ్వు ప్రేమగా బహుకరించాలను కుంటున్నావు. ఇయ్యి" అన్నాడు. ఎవరికి – అనలేదు. తల్లికి అర్థమయింది ఇది హనుమకి ఇవ్వాలని పట్టుకున్నాను, రామచంద్రమూర్తి అంగీకరించారని. వెంటనే హనుమకి బహూకరించింది. అంటే ఒక వయసు వచ్చిన తర్వాత దంపతులు మాట్లాడుకోరు; ఆయన అవసరాల్ని ఆవిడ చదువుకుంటుంది; ఆవిడ అవసరాలని ఆయన చదువుకుంటాడు. ఇద్దరి హృదయాలు మాట్లాడుకుంటాయి.

**"అంతర్జ్ఞాతి బహిర్వ్యక్తా ఆఖ్యాతి హృదయం వృదా"**

సీతారాముల హృదయాలు మాట్లాడుకుంటున్నాయి. ఇక వాళ్ళు నోటితో మాట్లాడుకోవాల్సిన అవసరం లేదు అంత గొప్ప దాంపత్యం వాళ్ళది.

సుందరకాండలో హనుమ శింశుపా వృక్షం మీద కూర్చుని కిందనున్న సీతమ్మను చూసి ఒక మాట అన్నారు.

**"అస్యా దేవ్యా మనస్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్ ।**
**తేనేయం స చ ధర్మాత్మా ముహూర్తమపి జీవతి" ॥** అంటారు.

అప్పటివరకు ఆయన రామచంద్రమూర్తినే చూశాడు. రాముడంటే సకల గుణాభిరాముడు, మహానుభావుడని కీర్తన చేసేవాడు. సీతమ్మను చూసిన తర్వాత ఆయన ఒక మాట అన్నారు నాకిప్పుడు అర్థమైంది. ఇంత గొప్ప ఇల్లాలు నిజంగా చెప్పాలి అంటే

**"త్రైలోక్య రాజ్యం సకలం సీతాయా నాప్నుయాత్కలామ్.."**

మూడులోకముల వైభవాన్ని తీసుకొచ్చి తక్కెట్లో ఒక పక్కన పెడితే సీతమ్మ గొప్పదనంలో 16 వ వంతుకు తూగదు. ఇంత గొప్ప ఇల్లాల్ని వదిలిపెట్టికూడా, కనబడకుండా ఉంటే ఇంకా రాముడు బ్రతికి ఉన్నాడంటే రాముడిది గుండెయా? బండయా?

**"దుష్కరం కురుతే రామో య ఇమాం మత్తకాశినీమ్ ।**
**సీతాం వినా మహాబాహుర్ముహూర్తమపి జీవతి" ॥**

దుష్కరమైన పని చేశాడు రాముడు. ఇంత గొప్ప ఇల్లాలు ఇంత మహా తల్లి, ఇంత గుణవంతురాలు, ఈమె కనపడకుండా పోతే ఇంకా బ్రతికే ఉన్నాడా? ఎంత ఆశ్చర్యం! ఎలా ఉండగలిగాడు అనుకుని వెంటనే పై మాట అన్నారు.

రాముడి మనసు రాముడి దగ్గరే, సీతమ్మ మనసు సీతమ్మ దగ్గరే ఉండిఉంటే వీళ్ళిద్దరూ క్షణకాలం బ్రతికి ఉండేవారు కాదు. రాముడి మనసు రాముడి దగ్గర లేదు; సీతమ్మ దగ్గర ఉంది. సీతమ్మ మనసు సీతమ్మ దగ్గర లేదు; రాముడు దగ్గర ఉంది. సీతారాములు అంటే వివాహానంతరం వాళ్ళిద్దరి మనసులు ఒకరి మనసు ఒకరి దగ్గరికి వెళ్ళిపోయాయి. వాళ్ళ శరీరాలు రెండు కానీ మనసు ఒకటే. అందుకే వాళ్ళిద్దరూ ఇంకా జీవించి ఉండగలిగారు అన్నారు. అంటే సీతారాముల దాంపత్యం అంత గొప్ప దాంపత్యం. రామచంద్రమూర్తి పక్కన ఉంటే చాలు ఆవిడకు – ఆనందం.

సుమంత్రుడు అరణ్యవాసంలో సీతారాములను దండకారణ్యంలో దిగబెట్టి వెళ్లిపోయాడు. కౌసల్యాదేవికి కోడలిమీద మహా ప్రీతి. కోడలు ఏం కష్టపడుతుందో అని. సుమంత్రుణ్ణి కోడలు గురించి అడిగింది. “ఎలా ఉంది సీతమ్మ అరణ్యంలో? ఎండకన్నెరుగని పిల్ల; అయోనిజ; జనకమహారాజు గారి కూతురు; రామచంద్ర మూర్తి ఇల్లాలు; దశరథుని పెద్ద కోడలు – అటువంటి ఆవిడ అరణ్యంలో ఏం కష్టపడుతోంది ఇన్ని కష్టాలు వచ్చినప్పుడు – అయ్యో ఆ ఇంటి కోడల్ని అయ్యానని అనుకోలేదు కదా?” అని ఆవిడ బాధ. అడిగితే సుమంత్రుడు ఒక మాట అన్నాడు – సీతమ్మ గురించి.

అమ్మా కౌసల్యా..! ఏం చెప్పమంటావు? చిన్న పిల్లలు ఉద్యానవనానికి వెళతారు తల్లితండ్రుల తోటి. తల్లితండ్రులు ఇద్దరు అక్కడ కూర్చుని వాళ్ళేదో మాట్లాడుకుంటూ ఉంటారు. పిల్లలు అలా ఆడుకుంటూ ఉంటారు. వాళ్లకి ఏమిటి ధైర్యం? అమ్మ నాన్న అక్కడున్నారని..! మధ్యమధ్యలో వెనక్కి తిరిగి చూసుకుంటూ ఉంటారు. వెనక్కి తిరిగి చూసుకుంటూ చూసుకుంటూ అక్కడ ఎంతసేపు అమ్మానాన్న కనపడుతున్నారో, అంతసేపు సంతోషంగా ఆడుకుంటారు. అమ్మా నాన్నా పిల్లలకు ఏదో మరమరాలు కొనుక్కొద్దామని ఆ పక్కకి వెళితే, వాళ్ళు కనపడకపోయేసరికి కుయ్యో మయ్యో అని ఏడుస్తారు.

వాళ్లకి సంతోషమంతా ఏమిటంటే ఎదురుకుండా తల్లిదండ్రులు కనపడుతుంటే ఆడేసుకుంటున్నారు.

అమ్మా సీతమ్మ గురించి ఏం చెప్పమంటావు?

**"బాలేన రమతే సీతా బాలచంద్ర నిభాననా ।**
**రామా రామే యదీనాత్మా విజనేపి వనే సతి" ॥**

సీతమ్మ ఆ అరణ్యంలో ఎంత హాయిగా గడిపేస్తుందో రాముడు నా పక్కన ఉన్నాడు కదా నాకు ఇంకేం కావాలని అని – ఒక చిన్న పిల్ల – బాల ఎలా ఆడుకుంటోందో అలా ఆడుకుంటోంది సీతమ్మ. ఆమెకి నిజానికి సంతోషం ఎక్కడ అంటే భర్తగారితో ఉండడం. ఆమెకి సుఖం – భర్తతో ఉండడం. ఆమెకి దుఃఖం – భర్తకు దూరంగా ఉండడం. అంతే. భర్తకు దూరంగా ఉండడం అంటే – భౌతికంగా కాదు మానసికంగా. రాముని మనసులో నాకు స్థానము లేదు అన్న మాట ఆమె భరించలేదు. నిత్యమూ ఆయనని అనువర్తించి ఉంటుంది. వాళ్ళిద్దరి దాంపత్యం అంత గొప్పది.

సీతమ్మ గురించి రాముడు ఎంత కలవరించేవాడో సీతమ్మతో మాట్లాడుతూ హనుమయే ఒక చోట అంటారు.

**"నిత్యం ధ్యానపరో రామో నిత్యం శోక పరాయణః ।**
**నైవదంశాన్న మశకాన్న కీటాన్న సరీసృపాన్" ॥**

"అమ్మా రాముడు ఎప్పుడూ నీ గురించే ఆలోచిస్తూ ఉంటాడు. గుహలో ఒక్కడూ కూర్చుని ఉంటే నీ గురించే ఆలోచన. నిత్యం దుఃఖంతో ఉంటాడు నీ గురించి ఆలోచించి. భయంకరమైనటువంటి దోమలు ఈగలు కరుస్తూ ఉంటాయి. తెలీదు. తేళ్ళు జెర్రులు పాకుతూ ఉంటాయి. తెలీదు. పాములు పాకుతాయి. తెలియదు. నీ గురించిన ఆలోచనలో విస్మృతిని పొంది ఉంటాడు." అంటాడు.

ఆమెకు ఎంత ఊరట ఆ మాట..! రాముడు నాయందే మనసు పెట్టుకుని ఉన్నాడు అన్న మాటకి సీతమ్మ ఆనంద పడిపోయింది. అంత ప్రేమ రాముడిది – అంత ప్రేమ సీతమ్మకి భర్త మీద. మీకు సీతమ్మ గురించి నేను చెప్పడం కాదు. సుందరకాండ మిగిలిన కాండాల్లోకెల్లా గొప్పది అనడానికి కారణం ఎవరి గొప్పతనాన్ని వాళ్ళు నిరూపించుకున్నారు.

హనుమ తోకకి అగ్నిహోత్రాన్ని ప్రజ్వలింపచేశాడు రావణాసురుడు. ఆ విషయం పరిగెత్తుకుంటూ వచ్చి సీతమ్మకి చెప్పారు. "సీతమ్మా సీతమ్మా ఎవరు నీతో కిచకిచలాడిన కోతి?" అని అడిగాం. అడిగితే నువ్వు ఏమన్నావు?

**"ఏమేనాభి జానాతి యోయం విద్యా కరిష్యయి ఆహిరేవః**
**యహీహే పాదం విదానాపి నసంశయః"**

"పాము కాళ్ళు పాముకి తెలియాలి పాముకు కాళ్ళున్నాయో లేదో ఎలా పాకుతుందో ఎవరికి తెలుస్తుంది? అన్నావు. మీరు రాక్షసులు మీకు తెలియదా ఆ వచ్చిన కోతి ఎవరో నాకేం తెలుసు అన్నావు. ఇప్పుడు ఆ కోతిని పట్టుకొని తోకకి బట్టలు చుట్టి, నెయ్యి పోసి, అగ్నిహోత్రం వెలిగించి, లంకాపట్టణం అంతా తిప్పుతున్నారు ఇప్పుడు నీకు సంతోషమేనా?" అన్నారు.

వెంటనే సీతమ్మంది –

**యద్యస్తి పతిశుశ్రూషా యద్యస్తి చరితం తపః ।**
**యది చాస్త్యేకపత్నీత్వం శీతో భవ హనూమతః ।।**

**యది మాం వృత్తసమ్పన్నాం తత్సమాగమలాలసామ్ ।**
**స విజానాతి ధర్మాత్మా శీతో భవ హనూమతః ।।**

**యది కిఞ్చిదనుక్రోశస్తస్య మయ్యస్తి ధీమతః ।**
**యది వా భాగ్యశేషో మే శీతో భవ హనూమతః ।।**

ఆమె తన పాతివ్రత్యానికి తాను పరీక్ష పెట్టుకుంది. ఆమె అంది –

నాకు భర్త గారి శుశ్రూష కన్నా గొప్పది ఇంకొకటి లేదని ఎప్పుడూ మనసులో ఉన్నది నిజమైతే –

నేను అట్లాగే ప్రవర్తించిన దానను; ప్రవర్తిస్తున్న దానిని అయితే –

హనుమ తోకకి పెట్టబడిన అగ్నిహోత్రం చల్లబడుగాక.

అగ్ని కాల్చాలి – అందుకు విరుద్ధంగా ప్రవర్తించాలి. వెన్న పూసినట్లు ఉండాలని అన్నది.

ఈ రావణాసురుడి అంతఃపురాలు గానీ, భోగాలు గానీ, ఈ మేడలు గానీ, ఈ మిద్దెలు గానీ వైభవాలు గానీ నాకు అక్కర్లేదు నాకు రాముడే కావాలన్న భావం నాయందు నిజమైతే –

నాకు రాముణ్ణి కలుసుకోవాలన్నది ఒక్కటే జీవితాశయం అయ్యుంటే–

హనుమ తోకకి పెట్టబడిన అగ్నిహోత్రం చల్లబడుగాక.

నిజంగా నేను ఎంత ప్రేమతో ఉన్నానో అంత ప్రేమ రాముడికి కూడా నా మీద ఉన్నది నిజమైతే –

హనుమ తోకకి పెట్టబడిన అగ్నిహోత్రం చల్లబడుగాక.

వెంటనే అక్కడ అగ్నిహోత్రం చల్లబడిపోయింది. ఆశ్చర్యపోయారు హనుమ. ఇదేమిటి తోకకు నిప్పు పెడితే చల్లబడి పొయిందేమిటి అనుకున్నారు. ఓహ్..! నేను నూరుయోజనముల సముద్రాన్ని దాటి వస్తుంటే బంగారు శిఖరములు కల్గిన మేరు పర్వతం పైకి లేచి ఆతిథ్యం ఇవ్వడానికి సిద్ధపడింది. సీతారాముల కార్యం మీద వెళుతున్నాను. అగ్నిహోత్రుడు నా తండ్రి వాయుదేవుడికి స్నేహితుడు. నేను రామకార్యం మీదుండగా ఉపకారం చేయకుండా ఎందుకుంటాడు. అందుకు చల్లబడి ఉంటుందనుకున్నాడు. సీతారాముల దాంపత్యం ఎంత గొప్పదో చూపించడానికి ఆవిడ చేసిన ప్రతిజ్ఞయే పెద్ద పరీక్ష.

అంతకన్నా గొప్ప విషయం ఏది అంటే నిరంతరం ఆమె భర్త గురించి ఆలోచిస్తుంది. ఆయన భార్య గురించి ఆలోచిస్తాడు. సుందరకాండలో హనుమంతుడు ఆమె దగ్గరకు వచ్చి అన్నాడు –

"అమ్మా – నువ్వింత శోకమూర్తివై ఉన్నావు. భర్త కోసం ఇంత పరితపిస్తున్నావు. ఈ క్షణంలో నిన్ను ఇక్కడి నుంచి తీసుకెళ్లి ప్రశ్రవణ పర్వతశిఖరం మీద కూర్చునిఉన్న రామచంద్రమూర్తి పాదారవిందములయందు సమర్పించి కృతకృత్యుడనౌతాను. వచ్చి నా భుజముల మీద కూర్చో అమ్మా" అన్నాడు.

అంటే తల్లి సీతమ్మ అంది. అప్పటికి ఆయన కేవలం బొటనవేలంత ఉన్నారు. తన శరీరాన్ని సంక్షిప్తం చేసేసుకొని. "నువ్వే బొటనవేలంత ఉన్నావు. నీకు రెండు భుజాలు. దానిమీద నేను కూర్చోవడం. నువ్వు నూరు యోజనాల సముద్రాన్ని దాటడం. ఈ లోగా రాక్షసులతో యుద్ధం. జయాపజయములు విధి నిర్ణీతములు. నేను సముద్రంలో పడిపోతానో లేదో తెలియదు. మళ్ళీ ఎత్తుకెళ్ళి రావణుడు ఎక్కడ దాచేస్తాడో తెలీదు. నువ్వు తీసికెళ్ళగలవో, తీసికెళ్ళలేవో తెలీదు. నువ్వు నన్ను తీసుకెళ్తావా?" అని నవ్వింది.

ఆయనకి చాలా బాధ కలిగింది. అమ్మ నేను అంటే ఇంతే అనుకుంటున్నావా? అని మేరు మందర పర్వత శిఖరాలు ఎలా ఉంటాయో అలా ఒక్కసారిగా పెరిగిపోయారు. పెరిగిపోయి – "అమ్మా చూశావా నా రూపం అంటే ఏమిటో? ఇప్పుడు వచ్చి కూర్చో కూర్చుంటే – రావణాసురుడు నిన్ను తీసుకువచ్చినట్లుగా నేను కూడా నిన్ను దుర్బుద్ధితో తీసుకెళ్తానని అనుకోకమ్మా..!! అగ్నిహోత్రంలో "నమో నారాయణాయ స్వాహా" అని హవిస్సు ఇస్తే ఆ హవ్యవాహనుడైన అగ్నిహోత్రుడు హవిస్సుని ఎంత పవిత్రంగా తీసుకెళ్లి దేవతలకు ఇస్తాడో, అంత పవిత్రంగా తీసుకెళ్లి ప్రశ్రవణ

పర్వతశిఖరం మీద కూర్చునిఉన్న రామచంద్రమూర్తికి సమర్పిస్తాను వచ్చి కూర్చో అమ్మా” అన్నారు. ఆవిడ అంది –

**“భర్తృ భక్తిం పురస్కృత్య రామాదన్యస్య వానర ।**
**న స్పృశామి శరీరం తు పుంసో వానర పుంగవ” ॥**

“ఒకనాడు నేనిక్కడికి వచ్చాను అంటే నా ప్రమేయం లేదు. ఆనాడు బలవంతంగా రావణాసురుడు నన్ను అపహరించి తీసుకువచ్చాడు. నన్ను నేను రక్షించుకుంటే రామచంద్రమూర్తి గౌరవం పోతుంది. ఆయన రాక్షసవధ చేసి నన్ను రక్షించాలన్న సహృదయంతో, పతివ్రతాధర్మంతో నన్ను నేను కాపాడుకోకుండా రామనామస్మరణ చేస్తూ వచ్చాను. స్పృహలో లేనప్పుడు. ఇప్పుడు స్పృహలో ఉండి కూడా నువ్వు నాకు ఎంత పుత్ర సదృశుడవైనా నేను నీ భుజం మీద కూర్చుని రాను. నేను అట్లా వచ్చేస్తే ఒకనాడు రాముడు లేనప్పుడు రావణాసురుడు నన్నపహరించాడు. ఇవాళ రావణాసురుడి కన్నుగప్పి రాముడు తన దూత ద్వారా నన్నపహరించాడు. రాముడికి రావణుడికి ఏమిటి తేడా అని అడుగుతుంది రేపు లోకం. కాదు. రాముడే రావాలి. వచ్చి తన పరాక్రమమేమిటో చూపించాలి. రావణుని పది తలలు తరిగెయ్యాలి. తరిగేసి నన్ను రాముడు తీసుకెళ్లాలి. అప్పుడు రాముడికి కీర్తి. రాముడి కీర్తి నిలబడడం కోసం ఇంకా కష్టపడతాను తప్ప నేను రాను.” అని అన్నది.

నిజానికి ఎవరిది కష్టం రామాయణంలో? కష్టానికి పర్యాయపదం సీతమ్మ. ఎందుకనంటే – ఎంత కష్టం ఉండనివ్వండి – మనకష్టాన్ని చెప్పుకోడానికి అక్కడ ఒక మనిషి ఉన్నారు అనుకోండి. మీకు కష్టం తీరుతుంది. అసలు మీకు కష్టం చెప్పుకోవడానికి మనిషే లేరనుకోండి. ఎంత భయంకరంగా ఉంటుందా పరిస్థితి? రాముడికి పక్కన లక్ష్మణస్వామి ఉన్నారు, హనుమ ఉన్నారు, సుగ్రీవుడు ఉన్నాడు, వానరులు ఉన్నారు.

సీతమ్మకు ఎవరున్నారు?

**లంబకర్ణ లలాటంచ లంబోదర పయోధరాం ।**
**లంబోష్ఠీం లంబ చుబుకాం లంబాస్యాం లంబ జానుకాం ॥**

అని వాల్మీకి మహర్షి వర్ణిస్తారు. పెద్ద కడుపు ఉన్న వాళ్ళు, చెవులు వేలాడుతున్న వాళ్ళు, ముక్కు వేలాడుతున్నవాళ్ళు వికృతమైన రాక్షస స్త్రీలందరూ చుట్టూ పరివేష్ఠించి ఉండి – ఈమె రావణాసురుడి మాట వినకపోతే ఏదో ఒకరోజున ఈమెను సంహరించామంటాడు; అప్పుడు ఈమె కాళ్లు నావి, తొడలు నావి, పొట్ట నాది, గుండెలు నావి, కంఠము నాది – అప్పుడు తగువాడుకోవద్దు మనం భక్షిద్దాం, ముక్కలు చేసుకుందామని ఆవిడ ఎదురుకుండా ఆమె శరీరాన్ని పంచుకున్నవాళ్ళు. ఆమెని కత్తితో చంపి నికుంబలా నృత్యం చేద్దాం, సురాపానం చేసి ఈమె మాంసం తిందాం అని మాట్లాడుకున్న భయంకరమైన రాక్షసస్త్రీల మధ్య సీతమ్మ ఉంది. ఆమె కష్టం ఎవరితో చెప్పుకుంటుంది? ఆమెది ఎక్కువ కష్టం. అంత కష్టంలో కూడా "భర్తగారి గౌరవం పాడవగూడదు కాబట్టి నేను రాను" అన్న సీతమ్మ ఎంత గొప్పది? ఆమె కష్టాన్నీ, ఆమె పాతివ్రత్యాన్నీ, ఆమె ధర్మ నిష్ఠనీ పరిశీలిస్తే నిజంగా సీతారాముల దాంపత్యం ఎంత గొప్పది? రాముడు అంత అదృష్టవంతుడు ఎందుకయ్యాడంటే, సీతమ్మ వల్ల. సీతమ్మ అంత అదృష్టవంతురాలు ఎందుకయింది అంటే రాముడి వల్ల.

వాల్మీకి రామాయణంలో లేదు గానీ, ఒక శ్లోకానికి ఒక విశేషం చెప్పారు. అరణ్యకాండలో

**అగ్రత ప్రయయో రామః మధ్యే సీతా సమధ్యమా ।**
**పృష్టతస్తు ధనుష్పాణిః లక్ష్మణోఽను జగామహః ॥**

అని ఒక శ్లోకం ఉంది. ముందు రాముడు నడిచాడు, మధ్యలో సీతమ్మ నడిచింది, వెనక లక్ష్మణస్వామి నడిచాడు. అంటే ఏవైనా క్రూరమృగాలు

రాక్షసులు వస్తారని ఇద్దరు ముందు వెనకల నుండి రక్షించారు.

అలా వెళ్తున్నప్పుడు రాముడు అకస్మాత్తుగా ఆగి వెనక్కి తిరిగి సీతమ్మతో అన్నాడు – "సీతా..! చూశావా. ఎంత పెద్దచెట్టు. అంత పెద్ద చెట్టుకి ఒక తీగ అల్లుకుంది. అల్లుకుని పెద్ద పెద్ద పువ్వులు పూసింది. ఆ చెట్టుకి పువ్వులు లేవు. ఆ చెట్టుని తీగ అల్లుకుని అన్ని పువ్వులు పూసింది. రంగురంగుల పూలతో సువాసనతో ఆ చెట్టును నింపేసింది. అంత గొప్ప తీగ అల్లుకోవడం వల్ల చెట్టుకి అందం వచ్చింది అవునా సీతా?" అని అడిగాడు. తీగ అంటే స్త్రీ వాచకం. సీతా నీలాంటి ఇల్లాలు లభించబట్టి నాకు ఇంత గౌరవం వచ్చిందని రాముడి హృదయం.

సీతమ్మ అంది "నేను అట్లా అనుకోవట్లేదండీ. అది ఎంత గొప్ప పూలతీగ అయినా కావచ్చు. ఎంత గొప్ప గొప్ప పువ్వులు అయినా పూయవచ్చు. దాంట్లో ఎంత గొప్ప సువాసన అయినా ఉండొచ్చు. అంత గొప్ప చెట్టు ఆలంబనగా దొరికి ఉండకపోతే ఈ పాటికి గేదెలు, మేకలు తొక్కేసి, మేకలు గొర్రెలు తినేసును. అంత పెద్ద వృక్షం ఆలంబనగా దొరికింది కాబట్టి ఆ తీగ అందం శోభించింది. చెట్టే గొప్ప..!!" అంది.

వెనక లక్ష్మణస్వామి ఏమీ మాట్లాడకుండా వింటున్నాడు. సీతారాములిద్దరికి అర్థమైంది నువ్వు గొప్ప అంటే నువ్వు గొప్ప అనుకుంటున్నారని. ఇద్దరూ లక్ష్మణస్వామిని పిలిచి. "లక్ష్మణా చెట్టు వల్ల తీగకు అందం వచ్చిందా? తీగ వల్ల చెట్టుకు అందం వచ్చిందా? చెప్పవోయ్." అన్నారు.

లక్ష్మణస్వామి అన్నాడు – "తీగ వల్ల చెట్టు కందమో, చెట్టు వల్ల తీగ కందమో నాకు తెలియదు కానీ ఇంత గొప్ప తీగ ఇట్లా అల్లుకుని ఇన్ని పువ్వులతో ఇంత సువాసనతో అల్లుకుంటే అంత గొప్ప చెట్టు నీడన నిలబడడానికి అవకాశం దొరికిన నేను అదృష్టవంతుణ్ణి" అన్నాడు.

సీతారాములతో కలిసి నడుస్తున్న నేను భాగ్యవంతుణ్ణి మిమ్మల్ని సేవిస్తున్నాను అన్నాడు. కాబట్టి సీతారాముల దాంపత్యం అంటే అంత అన్యోన్య దాంపత్యం.

సీతమ్మ అంటుంది రావణా ..!

**"అసందేశాత్తు రామస్య తపసస్యానుపాలన**
**తత్వా తుర్మి దశగ్రీవం భస్మ భాస్మారి తేజసః"**

"రామచంద్రమూర్తి ఆదేశం కాలేదు కాబట్టి నిన్ను విడిచిపెట్టేస్తున్నాను తప్ప, నా పాతివ్రత్యంతో నేనే తలుచుకుంటే ఈ క్షణంలో నిన్ను బూదికుప్పగా చేసేయగలను. రాముడే వచ్చి నిన్ను చంపక్కర్లేదు. కానీ సీతమ్మే చంపేసి సీతమ్మ తనని తాను రక్షించుకుందంటే తన భార్యని రాముడు రక్షించ లేకపోయాడని నా భర్తకు నింద వస్తుందని నేను నా భర్త గౌరవం కోసం ఎదురుచూస్తున్నాను. ఆయన వచ్చి నిన్ను చంపాలని చూస్తున్నాను. అందుకు తప్ప, నిన్ను చంపడం నాకు పెద్ద లెక్క కాదురా – రాముడి ఆజ్ఞ లేదు బ్రతికి ఉన్నావు" అంది. అంటే ఆమె రామునియందు ఎంత మనసు కలిగి ఉంటుందో మనకు అర్థం అవుతుంది. ఆవిడే సీతారాముల దాంపత్యం గురించి ఒక మాట అంటుంది.

**శక్యా లోభయితుం నాహమైశ్వర్యేణ ధనేన వా ।**
**అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా ॥**

అని అంటుంది రావణాసురుడితో మాట్లాడుతూ.

"లోకంలో ఎక్కడైనా నాకు పాలు కావాలి పాల తెలుపు వద్దు; వజ్రం కావాలి కాంతి వద్దు; సూర్యుడు కావాలి ప్రభ వద్దు; చంద్రుడు కావాలి కాంతి వద్దు; పువ్వు కావాలి సౌరభం వద్దు – అంటే సాధ్యమవుతుందా? అవి రెండూ కలిసే ఉంటాయి. అట్లాగే ఓరి పిచ్చివాడా..! సీతారాములు రెండు కాదు సీతారాములు ఒక్కటే. నువ్వు తెలియక సీతారాములిద్దరూ వేరు వేరు

అనుకుంటున్నావు. నీ మరణం కోసం మహా పతివ్రతనైన నన్ను అపహరించి తెచ్చావు గానీ, నిజానికి నువ్వు నన్ను ఎక్కడ అపహరించి తేగలవు రా?" అని చెప్పింది.

సీతారాములిద్దరిదీ కూడా ఎంత అన్యోన్య దాంపత్యమో – ఇద్దరి మనసులు ఒకటై ఎట్లా ఉంటాయో చెప్పడానికి ఇంతకన్నా తార్కాణం ఏముంటుంది అంత గొప్ప దాంపత్యం. ఒకరి మనసు ఒకరి దగ్గర ఉంటుంది. ఇద్దరికీ విడి విడిగా ఉండే స్వభావం కాదు.

చాలామంది ఒకమాట అంటారు. సీతమ్మని అగ్నిప్రవేశం చేయించాడు కదండి సీతమ్మని అరణ్యాల్లో దిగబెట్టాడు కదండీ అని. సీతమ్మని అగ్నిప్రవేశం చేయించాడు అంటే మీరు రామాయణం హృదయాన్ని పట్టుకోగలిగితే రెండు కారణాలు కనబడతాయి. మొదటిది – ఇవాళ ఆమె లంకాపట్టణంలో ఉండి అయోధ్యానగరానికి తిరిగి వస్తుంది. రేపు ధర్మపత్ని. ఆయన ఏకపత్నీవ్రతుడు. ఆమె వలననే ఆయన వంశం నిలబడాలి. నరుడిగా వచ్చాడు. ఆమె గర్భధారణ చేస్తుంది. లోకం ఒక్కలా ఉండదు. అక్కరలేని మాటలే లోకానికి కావాలి. ఎవరో ఎక్కడో ఏదో అంటారు సీతమ్మని. ఇది అంచెలంచెలుగా అంతఃపురంలోకి వస్తుంది. ఎవరో చాటుమాటు మాట్లాడుకుంటూ ఉంటారు. అది సీతమ్మ చెవిన పడుతుంది. ఒక గర్భిణి మనసులో ఇటువంటి మాటలు పడితే ఆమె కుమిలిపోతే ఆమె బాధ పడితే తేజోవంతమైన సంతానం కలగదు. తేజోవంతమైన సంతానం కలిగితే తప్ప రాజ్యమునకు రక్షణ ఉండదు. ఉత్తరాధికారి భవిష్యత్ సమ్రాట్ రావాలి. ఆమె కడుపునుండి రావాలి. ఆమె లోకాపవాదము పొందకుండా తనను రక్షించుకోవాలి. అందుకని అగ్నిప్రవేశం చేయించాడు. ఆయన అంత దూరదృష్టితో చేయించాడు. అయినా కూడా లోకం అపవాదు వేయకుండా ఊరుకుందా?

తెలిసీ తెలియని ప్రతి రచయిత, కాగితం కాలం పట్టుకున్న ప్రతివాడు,

రామాయణ హృదయం తెలియని ప్రతివాడు ఇది వ్రాసేవాడే. రాముడు సీతమ్మని అగ్ని ప్రవేశం చేయించాడు. రాముడు సీతమ్మని అగ్నిప్రవేశం చేయించడంలో ఆయన ఔదార్యం ఏమిటో సీతమ్మకి తెలుసు. అయినా అపనింద వస్తే గర్భిణి స్త్రీ ఆమె అంతఃపురంలో ఉండి అందరూ బుగ్గలు నొక్కుకుంటూ ఉంటే బాధపడుతుందేమో, నాతో కూడా పంచుకోలేక కుమిలిపోతే ఆమె ఏమైపోతుందని, ఆమెకు ఇష్టం ప్రశాంత వాతావరణం ఉంటుందని ఆశ్రమంలో దిగబెట్టమని లక్ష్మణస్వామిని పంపించాడు. సీతమ్మకి తెలుసు రామహృదయం. అందుకు చెప్పింది ఉత్తరకాండలో –

**"నఖల్వద్యైవ సౌమిత్రి .. జీవితం జాహ్నవీ జలే.."**

నేను తలుచుకుంటే.. లక్ష్మణా – ఇప్పుడే గంగానదిలో ప్రవేశించి శరీరాన్ని వదిలిపెట్టేయగలను. కానీ నేను వదిలిపెట్టను ఎందుకో తెలుసా. రాముడి మనసు నాకు తెలుసు. రామునికి నా యందు ఏ విధమైన శంకా లేదు. రాముని తేజస్సు నా గర్భంలో పెరుగుతోంది. రాముడికి ఉత్తరాధికారిని రాముడికి అప్పజెప్పి వేసిన తర్వాత నేను అవతార పరిసమాప్తి చేయాలి. రామహృదయం నాకు తెలుసు కాబట్టి నేను ఇక్కడే ఆశ్రమాలలోనే కాలం గడిపి, రాముడికి ఉత్తరాధికారిని అందిస్తాను." అని అన్నది.

సీతారాముల హృదయమంత గొప్పది. ఎప్పుడూ వాళ్ళిద్దరూ కలిసి ఉన్నవాళ్లే. వాళ్ళిద్దరి మనసులు ఎన్నడూ విడివడినవి కావు. అందుకే దాంపత్యం అంటే సీతారాములా బ్రతకండి అని ఇప్పటికీ చెప్పుకుంటారు అంటే దానికి కారణం ఆ మహాతల్లి, ఆ మహానుభావుడు వాళ్ళు ఇద్దరూ పొందిన ఆ దాంపత్య వైభవం. అటువంటి దాంపత్యవైభవం సీతారాములది.

మానవీయ సంబంధాలలో అత్యంత ప్రధానంగా తెలుసుకోవలసిన విషయం ఏది అంటే అసలు గృహస్థాశ్రమంలో తల్లి తండ్రి ఎట్లా ఉంటారు అన్నదే తర్వాతికాలంలో పిల్లలకు అందరికీ కూడా ఆదర్శం అవుతుంది.

అమ్మ ఎట్లా ప్రవర్తించిందో ఆడపిల్ల చూస్తుంది. చెప్పింది సీతమ్మ. అనసూయమ్మతో మాట్లాడుతూ...పాణిప్రదాన కాలేచ .. నాకు పాణిగ్రహణం రాముడు చేస్తున్నప్పుడు కూడా మా అమ్మ అత్తవారింట్లో ఎట్లా ఉండాలో, భర్తతో ఎలా ప్రవర్తించాలో ఎట్లా ప్రేమ సంపాదించుకోవాలో నేర్పిందమ్మా అంది.

వాళ్ళిద్దరు అస్తమానం కీచులాడుకొని ఎప్పుడూ తండ్రిని తల్లి అగౌరవం చేసి మాట్లాడుతుంది అనుకోండి. ఏమీ రాదు. ఇలాగే ఉంటారు అందువల్ల ఇలా అయిపోయింది అంటోందనుకోండి. వింటున్న పిల్లలకి తండ్రి అసమర్థుడు అన్న అభిప్రాయం కలుగుతుంది. తండ్రి అస్తమానం తల్లిని నింద చేస్తున్నాడు అనుకోండి – అమ్మంటే ఎంతో ప్రేమ పిల్లలకి. అమ్మని నాన్నగారు ఇట్లా అంటారే అస్తమానం? అని వాళ్ళ మనసు బాధగా ఉంటుంది. వాళ్ళు చదువుకోమంటే ఏం చదువుకుంటారు? తల్లిదండ్రులు ఇద్దరు సీతారాముల్లా అన్యోన్యంగా ఉండడం అలవాటయింది అనుకోండి. దాంపత్యం అన్న తర్వాత ఎప్పుడైనా ఎక్కడైనా అభిప్రాయభేదం రావచ్చు కానీ దాన్ని పంచుకోవడానికి ఏకాంత ప్రదేశం ఉంటుంది. అంతేగానీ అది పిల్లల ముందా ప్రదర్శించవలసిన పాండిత్యం. ఇదే రేప్పొద్దున పిల్లలకు అలవాటు అవుతుంది. వాడు పెరిగి పెద్దవాడు ఐతే, చిన్నప్పటినుంచి అమ్మ అనేది మీ సంగతి నాకు తెలియదా అని అంటే అప్పుడు ఏం చేస్తుందామే?

నిజానికి వివాహంలో భార్యగారిని భార్తగారు ఒక వరం అడుగుతాడు. అగ్నిహోత్రం చేసేటప్పుడు. ఏ వరమో తెలుసా? నన్ను నీ పదకొండవ కుమారుడిగా స్వీకరించు అని అడుగుతాడు. పదకొండవ కుమారుడిగా స్వీకరించు అని ఎందుకు అడుగుతాడంటే, అతడు కష్టసుఖాలలో నలిగి, సంపాదించి, సమాజం కోసం ప్రవర్తించి, ధక్కా మొక్కీలు తిని, కొన్నిచోట్ల గౌరవం, కొన్ని చోట్ల అగౌరవం సంపాదించి, అన్నిటినీ తట్టుకుని,

బడలిపోతాడు. ఇంత కష్టపడి పిల్లల్ని వృద్ధిలోకి తెచ్చానన్న ఒక అతిశయం అతడిలో గూడు కట్టుకుని ఉంటుంది. పిల్లలు – "నాన్నగారూ.. ప్రతి చిన్న విషయం ఇంకా పిల్లలకు చెప్పినట్లు చెప్తారేమిటి? మాకు తెలియదా పెద్దవాళ్ళం అయ్యాం? మీరు ప్రశాంతంగా ఉండండి. రామాయణం చదువుకోండి." అంటారు.

అంటే పెద్దాయనకి కోపం వచ్చి, వెళ్లి ఆ బయట ఎక్కడో మొక్కల మధ్యలో కూర్చుంటాడు. కూర్చుంటే పిల్లలందరూ వచ్చారు ఇంటికి మరి. వాళ్ళు భోజనం చేద్దాం అంటే నాన్నగారు అలిగి కూర్చున్నారు. వాళ్ళు ఏం తింటారు? వాళ్లకు భయం కదూ మళ్ళీ వెళ్ళి పిలవడానికి? కోడళ్ళు వెళ్తారా మరీ భయం కదూ. అందుకని "అమ్మా.. నువ్వు వెళ్లి పిలవమ్మా నాన్నగారిని, చటుక్కున ఇలా అన్నాను. ఆయన మనసు బాధ పడిందేమోనమ్మా.." అంటారు.

అప్పుడు పదిమంది పిల్లలకు స్నానం చేయించి మొదటి పిల్లాడు మళ్ళీ మట్టి పోసుకువస్తే మళ్లీ స్నానం చేయించి అంత ఓర్పుతో పెంచావు కదూ..! ఆ ఓర్పుతో నా దగ్గరికి వచ్చి.. "చాల్లేండి. సంబరం. పిల్లలందరినీ పిలిచారు. మిమ్మల్ని సంతోషపడమని వాళ్ళు చెప్పారు గాని మీరెందుకు నలుగుడు పడతారని, మీరు విశ్రాంతి తీసుకోండి, మేం ఉన్నాం కదా.. మేము చూస్తాం కదా.. అన్నారు తప్ప వాళ్ళు మిమ్మల్ని ఏమన్నారనండీ? పిల్లలు ఎదిగి వచ్చారని సంతోష పడక..! రండి పిల్లలు బిక్కమొహం వేసుకొని కూర్చున్నారు. అన్నీ వండాను. అని నన్ను పిల్లాడిని చేయి పట్టుకుని తీసుకెళ్లినట్లు తీసికెళ్ళు సుమా. పదకొండవ కొడుకుగా చూసుకో – అని అడుగుతారు.

దాంపత్యం అంటే అలా ఉండాలన్నది భారతీయ ధర్మం. విశ్వనాథ సత్యనారాయణగారు వేయిపడగలు అనే నవల రాశారు మహానుభావులు.

తొమ్మిదివందల తొంభై తొమ్మిది పడగలు చితికిపోయినా, ఇక్కడ ఉన్న ధర్మానికి ఒక పడగ నిలబడితే చాలు. సనాతనధర్మంలో ఈ గృహస్థాశ్రమం నిలబడగలిగితే చాలు, మిగిలిన ధర్మాలన్నీ నిలబడతాయి. ఆ గృహస్థాశ్రమ ధర్మానికి విఘాతం కలగకూడదు. దంపతులు పరిణితితో ప్రవర్తించాలి. అది రావాలి అంటే రామాయణం వినాలి. రామాయణం చదువుకోవాలి. చదువుకుంటే, దాంపత్యం అంటే ఏమిటో, రామాయణం ఎంత అపూర్వమో, ఎంత గొప్ప దాంపత్యమో అర్థం అవుతుంది.

రామాయణంలో అనేకమంది దంపతులు ఉన్నారు.

రావణాసురుడు–మండోదరి – మండోదరి పాపం ఎప్పుడూ రావణాసురుడికి మంచిమాటలు చెప్తుంది. ఎప్పుడు విన్నాడసలు? ఎప్పుడూ వినడు. నువ్వు చెప్పొచ్చేదానివీ, నేను వినేవాడినా అంటాడు.

వాలి–తార–వాలి, తార చెప్పినవన్నీ వింటాడు. చాలా శ్రద్ధగా వింటాడు. కానీ — ఆవిడ అలానే చెప్తుందని తనకు తట్టినది చేస్తాడు. అదో దాంపత్యం.

దశరథుడు – కౌసల్య సుమిత్ర కైకేయి – తనకున్న శాపం కాదు. కౌసల్య వల్ల సంతానం కలగలేదని సుమిత్ర; సుమిత్ర వలన సంతానం కలగలేదని కైకమ్మ, కైకమ్మ వలన సంతానం కలగలేదని 350 మంది భార్యలు. ఇదీ దశరథమహారాజు గారి దాంపత్యం. ఆయన్ని నేను తక్కువ చేస్తున్నానని మీరు అనుకోవద్దు.

గౌతముడు–అహల్య–అదొక విశేషం. అహల్య దోషం చేసినా, ఉద్ధరించుకున్నాడే తప్ప విడాకులు అన్న మాట ఎత్తని దాంపత్యం – సనాతనధర్మం.

ఈ దంపతులందరిలో చిన్నవాళ్లు సీతారాములు. కానీ సీతారాముల దాంపత్య వైభవం ముందు మిగిలిన దాంపత్యాలన్నీ వెలవెల బోవలసిందే.

అంటే వయసు చేతకాదు దాంపత్యం గొప్పతనం. ఎట్లా తెలుసుకుని ప్రవర్తిస్తారు అన్న దానివలన దాంపత్యం వైభవం నిలబడుతుంది. అది సీతారాముల దాంపత్యాన్ని పరిశీలన చేస్తే తెలుస్తుంది.

కాబట్టి సీతారాముల దాంపత్య వైభవం మానవీయ విలువలలో అత్యంత ముఖ్యమైన విషయము అని ప్రతిపాదన చేస్తూ అన్నదమ్ముల మధ్య ఉండే అనుబంధాలు ఎంత గొప్పగా ఉంటాయి అన్నదాన్ని కూడా రామాయణంలోనే చూడాలి.

ఎందుకని అంటే – 84 లక్షల జీవరాశులున్నాయి ప్రపంచంలో. జరాయుజములు, అండజములు, శ్వేదజములు, భూజములు అని నాలుగు రకాలుగా పుడతాయి. జరాయుజములు అంటే మావిచేత పుడతాయి. ఆవుకి దూడ పుట్టినట్టు అట్లా వస్తాయి. అండజములు అంటే గుడ్డు నుంచి బయటకు వచ్చే ప్రాణులు. రెండు మాట్లు – ముందు గుడ్డుగా వచ్చి తర్వాత పొదగబడి వస్తాయి. శ్వేదజములు అంటే చెమటలోంచి పుడతాయి. పేలు మొదలైనవి. భూజములు అంటే భూమిని చీల్చుకుని పైకివస్తాయి. చెట్లు మొదలైనవి.

ఇందులో, మనుష్యజన్మ జరాయుజములలో ఉత్కృష్టమైన జన్మ. మిగిలిన ప్రాణులకు కూడా తోబుట్టువులు ఉంటాయి. ఆవు చాలా చాలా గొప్పది. కానీ తనకు ఎంతమంది పిల్లలు పుట్టారు అన్న విషయం ఆవుకి గుర్తుండాలి అని ఎవరూ భావన చేయరు. ఒక వయసు వచ్చిన తర్వాత దూడ ఎక్కడకో వెళ్ళిపోతే ఆవు బెంగపెట్టేసుకోదు. ఆవుని కన్నవాళ్ళనీ ఆవు అంత గుర్తుపెట్టుకోవాలని లేదు. అన్ని ప్రాణులు అంతే. వాటి మధ్య అనుబంధాలు ఎక్కడ వరకు అంటే కడుపున పుట్టిన పిల్ల తనంతట తాను తినడం అలవాటు అయ్యేంతవరకు. అంతే. అంతకు దాటి అనుబంధం ఉండదు.

కానీ మనిషి అట్లా కాదు. మనిషి సాంఘిక జంతువు. గొప్ప గొప్ప

అనుబంధాల మధ్య ఉంటాడు. అందులో కుటుంబం నుంచి ఎన్నో విలువలు నేర్చుకుంటాడు. తోబుట్టువులు – తనకు ముందు పుట్టినవాళ్ళు, తనకి వెనక పుట్టినవాళ్ళు మళ్ళీ రమ్మంటే వచ్చేవాళ్ళు కారు. దేశంలో మిగిలిన అనుబంధాలు ఎక్కడికి వెళ్ళినా దొరుకుతాయి. మీరు ఎక్కడికి వెళ్ళినా స్నేహితులు ఉంటారు. మీ అభ్యున్నతిని కోరేవాళ్ళు ఉంటారు. మీయందు ప్రేమ కలిగినవాళ్ళు దొరుకుతారు. కానీ నాకు తమ్ముడు అన్నవాడు నాతో కలిసి పుట్టినవాడు ఒక్కడే. నా చెల్లెలు నాతో కలిసిపుట్టినది ఒక్కతే. మా అక్క నాతో కలిసి పుట్టినది ఒక్కతే. నాకు అన్నయ్యలు లేరు అందుకని అలా అన్వయం చేసి చెప్పాను. వాళ్ళే. ఈ జన్మకి మేం నలుగురమే. అప్పుడు అత్యంత అపురూపమైనదేది?

అన్నగారికి 60 ఏళ్లు దాటాయనుకోండి. ఆయన ఇంక మహా ఉంటే ఎంతకాలం ఉంటాడు? పోనీ ఒక 15 ఏళ్లు ఉంటాడు అనుకోండి. వందేళ్ళు ఉండవలసిందే. కాదనడం లేదు. పెద్దలు, సమాజానికి అత్యంత గౌరవనీయులు, సమాజం పరిపుష్టం అవడానికి కారణమైన వ్యక్తులు శతాయుష్కులు కావాలి. వరప్రసాద్ గారి లాంటి వాళ్ళు నూరేళ్లు ఉండాలని కోరుకుంటున్నాను. ఇవాళ ఈ ప్రవచనానికి ఆయన పిలిచారు కాబట్టి వచ్చాను. పైన చెప్పిన ఉదాహరణలో 75 ఏళ్ళు అనుకోండి. అన్నగారికి మిగిలి ఉండేవి 15 ఏళ్ళు. అందులో వృద్ధాప్యం వచ్చిన తర్వాత ఎక్కువ నిద్రపోతారు కాబట్టి ఏడున్నర సంవత్సరాలు ఆయన తెలివిలో ఉంటాడు. ఈ ఏడున్నర సంవత్సరాల్లో ఆయన స్నానం, ఆయన పానం, ఆయన భోజనం, ఆయన ఫలహారం, ఆయన పూజ, ఆయన విషయాలు – ఇవి సగం పోతాయి. అంటే ఇంకా మూడున్నర సంవత్సరాలు. ఆ మూడున్నర సంవత్సరాల్లో ఆయన పిల్లలు, ఆయన పిల్లల పిల్లలు, ఆయన ఇంట్లో ఉండడాలు, వాళ్ళ వ్యవహారాలూ, వాటిని చూసుకోవడం ఇది పోతుంది. పోతే మిగిలేది

ఒకటిన్నర సంవత్సరం. అంటే ఇంకా మిగిలింది గట్టిగా ఓ 500, 600 రోజులు. ఆ 600 రోజులూ మళ్లీ అన్నదమ్ములు కలుసుకున్నా సగం ఇద్దరు నిద్ర పోవాల్సిందే అందుకని మిగిలింది మళ్ళీ 300 రోజులు. అప్పుడు మళ్లీ తమ్ముడు గారి పనులన్నీ తీసేస్తే ఇద్దరికీ మిగిలేవి గట్టిగా ఓ నెల రోజులు. ఇంక ఈ జీవితంలో వాళ్ళిద్దరూ కలుసుకుంటే ఒక 30 రోజులు కలుసుకోవచ్చు.

ఆ 30 రోజులు కలుసుకున్నప్పుడు, చిన్నతనంలో అన్నగారు ఏవి సంతోషంగా తినేవాడో “మా అన్నయ్యకి దోసకాయ పప్పు అంటే ఎంతో ఇష్టం. మా అన్నయ్య వస్తున్నాడు దోసకాయలు పట్టుకొని వస్తాను. పప్పు చెయ్యి. అన్నయ్యా నీకోసం దోసకాయలు తెచ్చాను అన్నయ్యా” అనడంలో ఆ అన్నగారికి ఎంత సంతోషం ఉంటుంది! “అప్పుడు.....” అని చేయి పట్టుకోవడంలో ఎంత సంతోషం ఉంటుంది! అన్నగారి ఎక్కడ తూలుతాడో అని తమ్ముడు గబగబా వచ్చి అన్నయ్య చేయి పట్టుకొని నడుస్తూ ఉంటే అది చూడ్డానికి ఎంత అందంగా ఉంటుంది! ఆ అన్నదమ్ములు ఆ అక్క చెల్లెళ్ళు ఒకచోట కూర్చుని మాట్లాడుతుంటే చూడ్డానికి ఎంత అందంగా ఉంటుంది!

నేను సందర్భం వచ్చింది కాబట్టి అంటున్నాను. కె.విశ్వనాథ్‌గారు. మహానుభావులు శరీరత్యాగం చేశారు. కె విశ్వనాథ్‌గారి ఇంటికి నేను అప్పుడప్పుడు వెడుతూ ఉండేవాడిని. వారంటే నాకు గౌరవం. ఒకసారి వాళ్ళ ఇంటికి వెళ్లి దేని గురించో నేను మాట్లాడుతుంటే ఆయన – “ఒక్క క్షణం కోటేశ్వరావు గారూ! మా చెల్లెలు ఉంది ఈ ఊళ్ళో అది మీరిప్పుడు చెప్పారే శ్రీశైల రగడ అట్లాంటివి చాలా పాడుతుంది. ఒకసారి దాన్ని పిలుస్తానండీ..! అది వింటుంది; పాడుతుందండి అని ఫోన్ చేసి, “తొందరగా వచ్చేయ్.. తొందరగా వచ్చేయ్” అని చెల్లెల్ని కూర్చోబెట్టుకొని ఆవిడ పాడుతుంటే నాకు వినిపించడంలో ఆయన సంతోషం చూస్తే ఆ అన్నదమ్ములు అక్కచెల్లెళ్లు ఒక

జన్మకి మళ్లీ రమ్మంటే వస్తుందా?

రాముడు ఏడ్చాడు రామాయణంలో. యుద్ధభూమిలో రావణాసురుడు శక్తి అన్న అస్త్రాన్ని ప్రయోగించాడు లక్ష్మణస్వామి మీద. అది గుండె లోపలికంటా దిగబడిపోయి పడిపోయాడు. పడిపోతుంటే రాముడు సంకల్పం చేశాడు "ఈ శక్తి వలన నా తమ్ముడికి ఏ ఆపద కలగకుండు గాక..! ఈ అస్త్రం నిర్వీర్యమై పోవు గాక..!" ఆయన తపశ్శక్తి అలాంటిది.

**సత్యేన లోకాన్ జయతి దీనాన్ దానేన రాఘవః**
**గురూఞ్ఛుశ్రూషయా వీరో ధనుషా యుధి శాత్రవాన్**

సత్యము చేత లోకాన్ని గెలిచాడు గురువుల్ని శుశ్రూష చేత గెలిచాడు. ధర్మ నిరతి చేత శాస్త్రాన్ని అంతటినీ ఔపోసన పట్టాడు. దీనుల్ని దానం చేసి గెలిచాడు. శత్రువులను ధనుస్సు, ఆయుధాలు, అస్త్ర శస్త్రాల చేత గెలిచాడు. అందుకే రాముని నోటివెంట ఏ మాట అంటే ఆ మాట అవుతుందంతే..!

జటాయువు – పక్షి – గచ్ఛ లోకాననుత్తమాన్ – అన్నాడు. ఉత్తమ లోకాలకు వెళ్ళిపో అన్నాడు. అంటే. వెళ్ళిపోయింది జటాయువు.

"ఈ శక్తి అస్త్రము నిర్వీర్యమై పోవుగాక" అన్నాడు. నిర్వీర్యమై పోయింది. కానీ అది గుండెల్లో నుంచి దూసుకుపోయింది లక్ష్మణస్వామి నేల మీద పడిపోయాడు. ఒంటినిండా రక్తం, ఒళ్ళంతా కాలిపోయి నిశ్చేష్టితుడై పోయాడు. లక్ష్మణస్వామి ప్రాణం వదిలి పెట్టేశాడేమోనని ధనుర్బాణాలను పక్కన పారేసి వెళ్లిపోయాడు. అయినా లక్ష్మణున్ని కొడదామని, చుట్టూ నిలబడ్డ వానరుల్ని రావణుడు కొడుతుంటే ఆ బాణాల తాకిడికి తట్టుకోలేక చెల్లాచెదరైపోయారు. రావణ బాణాలు వచ్చి శరీరంలో దిగబడిపోతుంటే తమ్ముడికోసం అలాగే సహించి, ఇంకొక బాణం పడకుండా కౌగిలించుకున్నాడు రాముడు.

**కౌగిలించుకుని – "దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః ।**
**తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః" ॥** అని ఏడ్చాడు.

ఏ దేశం వెళ్ళినా నాకు స్నేహితులు దొరుకుతారురా..! ఏ దేశం వెళ్లినా మళ్లీ పిల్లని ఇచ్చే వాళ్ళు ఉండొచ్చు భార్య దొరకచ్చురా..!! ఈ జన్మకి తోడబుట్టిన వాడివి నువ్వేరా..! నాకోసం నన్ను అనుగమించి వచ్చావురా నువ్వే పోతే నాకు యుద్ధం ఎందుకు? ఈ జయం ఎందుకు? సీతమ్మ ఎందుకు? అసలు ఈ లోకం ఎందుకు? రాజ్యం ఎందుకు? నాకు అక్కర్లేదురా అని ఏడ్చాడు. అప్పుడు విభీషణాదులు వచ్చి ఆయన తెలివిగా ఉన్నాడు. బాధపడకు రామచంద్రమూర్తీ అని హనుమని పంపించి మృత సంజీవని తెప్పించి ముక్కులో రసం పిండితే లక్ష్మణ స్వామి మళ్ళీ లేచి కూర్చుని యుద్ధం చేశాడు.

'తోడపుట్టిన వాడు' అన్నవాడు దొరికేవాడు కాదు. ఆ అనుబంధాలు మానవ జన్మకి అపూర్వాలు. అందునా వయసు పెద్దదైన తర్వాత తమ్ముడు రావడం; అక్క చెల్లెలు రావడం; కూర్చోవడం; ఆ మాట్లాడుకోవడం అప్పుడు ఒక అక్క చెయ్యి పట్టుకుంటే అక్క తమ్ముడి తల మీద చెయ్యి వేసి ఆశీర్వచనం చేసి మాట్లాడుతుంటే అందరూ గౌరవించచ్చు గాక అక్క మాత్రం ఒరేయ్ తమ్ముడు తిను సరిగ్గా..! ఏం గుమ్మడి వడియం తినేవాడివిగా. తినడం లేదే – తిను అని దబాయించి అక్క పెట్టడంలో ఎంత ప్రేమ ఉంటుంది?

నాకు కాకినాడలో ఇద్దరు అన్నదమ్ములు తెలుసు. అందులో పెద్దాయన బాగా పెద్దవారైపోయారు. ఆయన ఎప్పుడైనా ఏదైనా సభకు వస్తూ ఉంటారు కాకినాడలో వస్తే – ఈ రెండో ఆయన వేదిక మీదికి రాడు. ఆ బయట నుంచుంటాడు. వాళ్ళన్నగారి కారు వస్తుంటే పరిగెడతాడు. పరుగెత్తి, ఆయన కారు ఆగుతుంటే "అన్నయ్యా అన్నయ్యా" అని చెయ్యి పట్టుకుని, అన్నయ్యని జాగ్రత్తగా లోపలికి తీసుకొచ్చి కూర్చో పెడతాడు. సభ మధ్యలో ముందుకు

వచ్చి కూర్చుంటే నాకు కొంచెం చికాకు. కానీ ఆయన అన్నయ్యని తీసుకొస్తే మాత్రం నేనేం అనను. ఇది రామచంద్రమూర్తి ప్రేమ – నేనేమీ అనకూడదని ఊరుకుంటాను. నిజంగా అన్నదమ్ముల అనుబంధం అంత గొప్పది. అది పుట్టుకతో వచ్చే అనుబంధం. ఆ రక్తసంబంధం గురించి మహర్షి ఎంత గొప్పగా మాట్లాడుతారో

**సర్వప్రియకరస్తస్య రామస్యాపి శరీరతః ।**
**లక్ష్మణో లక్ష్మీ సంపన్నో బహిఃప్రాణ ఇవాపరః ॥** .. అంటారు

ఎవరి ప్రాణమైన లోపల ఉంటుంది. బయటికి కనపడదుకదా. కానీ రామచంద్రమూర్తి ప్రాణం రూపం ధరించి బయట తిరిగితే చూడాలనుకుంటే అదే లక్ష్మణస్వామి. అంటే లక్ష్మణస్వామి అని పేరెందుకు పెట్టారంటే ఆయన లక్ష్మీ సంపన్నుడుట.! ఏమిటి ఆయన లక్ష్మి? ఏమిటి ఆయన అనుభవించింది?

పద్నాలుగు సంవత్సరాలు అన్నగారు, వదినగారు కట్టుకునే బట్టలు, వదినగారి నగలమూట కావిడి వేసుకుని మోసి తీసుకెళ్లాడు. ఇంద్రజిత్తుతో యుద్ధం చేశాడు. అన్ని కష్టాలు పడ్డాడు. ఏమిటంటే అన్నకి వదినకి సేవ చేయడం కన్నా నాకు ఇంకేం కావాలి అన్నాడు. అదే ఆయన లక్ష్మి. అటువంటి లక్ష్మణస్వామి రామచంద్రమూర్తికి బహిఃప్రాణం. లక్ష్మణుడు రాముని ప్రేమించడం కాదుట.. రాముడు లక్ష్మణస్వామిని అంత ప్రేమించేవాడుట.

**న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః ।**
**మృష్టమన్నముపానీతమశ్నాతి న హి తం వినా ॥**

ఎంత ఆకలి వేస్తున్నా అక్కడ పదార్థం ఉన్నా పక్కన లక్ష్మణస్వామి లేకపోతే రాముడు తినేవాడు కాదుట. ఎంత నిద్ర వచ్చేస్తున్నా పక్కన లక్ష్మణస్వామి లేకపోతే రాముడికి నిద్రపట్టేది కాదు. రాముడికి లక్ష్మణస్వామి మీద అంత ప్రీతి. లక్ష్మణస్వామికి రాముడి మీద అంత ప్రీతి. అందుకే

రామావతార పరిసమాప్తి ఎలా చేయించాలో అర్థం కాలేదు దేవతలకు కూడా ఉత్తరకాండలో. చిట్ట చివరికి దుర్వాసమహర్షిని పంపించి లక్ష్మణ స్వామికి దేశ బహిష్కారం పడేటట్టుగా శిక్ష విధింపచేశారు రాముడి చేత. అంటే ఆయనేం తప్పు చేయలేదు. కావాలని ఒక నాటకం నడిపించారు. కాబట్టి రాముడు లక్ష్మణస్వామిని బయటకు పంపించేశాడు. లక్ష్మణున్ని విడిచి ఉండలేడు. అందుకని సరయూ ప్రవేశం చేసేస్తున్నానని ప్రకటించి నాతో వచ్చే వాళ్ళు ఎవరైనా ఉంటే వచ్చేయమన్నాడు. ఆయనతో చాలామంది సరయూనది ప్రవేశం చేశారు. ఆయన వైకుంఠధామానికి వెళ్ళిపోయారు, మిగిలిన వాళ్లు ఉత్తమ లోకాలకు వెళ్లిపోయారు. అంటే లక్ష్మణుడు లేని రాముడు ఉండలేడు. అందుకే అవతార పరిసమాప్తి చేసేశాడు. అసలు ఆ లక్ష్మణస్వామి భక్తి అంతా ఇంతా కాదు. రాముడు అంటే ప్రాణం అంతే. వదిలిపెట్టేస్తాడు రాముడి కోసం. తనకు ఎన్ని దెబ్బలు తగిలినా తింటాడు తనకేది పోయినా పర్వాలేదు. రాముడికి ఏదైనాపోతే అంగీకరించడు. దశరథ మహారాజుగారు పిలిచి అరణ్యవాసం చేయమంటే ఎక్కడలేని కోపం వచ్చింది.

**గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః**
**ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్?**

అన్నయ్యా ఎంత నాన్నగారైతే మాత్రం? ఎంత 60 వేల వయస్సు ఉంటే? మూడో భార్య కైకేయి యందు మోహంతో రాజ్యాన్ని పట్టుకెళ్ళి, భరతుడికి ఇచ్చి పట్టాభిషేకం చేస్తారా? యువరాజ్య పట్టాభిషేకం. పెద్దవాడివి, సుగుణాభిరాముడివి, ఏ దోషం లేని వాడివి, నీకు చెందాలి. నువ్వు ఊ అను అన్నయ్యా.! యుద్ధంలో దశరథమహారాజుని ఇప్పుడే ఓడించి కారాగృహంలో పెట్టి నీకు పట్టాభిషేకం చేస్తాను అన్నాడు.

అంటే రాముడు అన్నాడు ఎంత మాట అన్నావురా..!! నిన్న పిలిచి రామా

పట్టాభిషేకం చేసుకోరా అంటే నాన్నగారా? ఇవాళ పిలిచి అరణ్యవాసం చేయరా అంటే నాన్నగారు కాదా? అంటే మనకి ఉపకారం చేస్తే నాన్నగారు. మనకి ఇంకొక మాట ఏదైనా కష్టం కలిగేది చెప్తే నాన్నగారు కాదు. కాదురా. నీకొకటి చెప్పనా? ఇప్పటికీ నాన్నగారికి నాకు రాజ్యం ఇవ్వాలని ఉంది. ఇవ్వలేని సంకటస్థితిలోకి నాన్నగారు వెళ్ళిపోయారంటే భగవంతుడి నిర్ణయం వేరుగా ఉంది. నన్ను అరణ్యవాసానికి పంపించాలనుకుంటున్నారు లేకపోతే అవతార ప్రయోజనం, రావణ సంహారం ఎలా జరుగుతుంది? అందుకని ఈశ్వర ప్రమేయం ఉంది. నాన్నగారు ఎదురుగుండా కనపడుతున్నారు. ఈశ్వరుడు కనపడడు. వెనక నుండి నడిపిస్తూ ఉంటాడు. ఈశ్వరుని నిర్ణయం ఏదైతే ఉందో దాన్ని ఔదల దాల్చడమే. తండ్రి నింద చేస్తే పాపం వస్తుంది. తండ్రిని నింద చేయడం ఏమిటి రా? నింద చేయడానికి వీలులేదని ప్రదక్షిణం చేసి వెళ్ళిపోయాడు.

లక్ష్మణుడి భక్తికి అవధి ఉండదసలు. ఎంత అవధి ఉండదంటే అయోధ్య కాండలో సీతారామలక్ష్మణులు ఒక పెద్దచెట్టు కింద కూర్చుని ఉన్నారు. అకస్మాత్తుగా ధూళి పైకి రేగి రథచక్రాల చప్పుడు, జంతువుల అరుపులు వినబడ్డాయి. "ఏదో శత్రుసైన్యం వస్తున్నట్లు ఉంది. చెట్టుపైకి ఎక్కి చూడరా లక్ష్మణా!" అన్నాడు రామచంద్రమూర్తి.

లక్ష్మణస్వామి చెట్టుపైకి ఎక్కి చూశారు. అక్కడి నుంచి పెద్ద పెద్ద అరుపులు అరిచారు. "అన్నయ్యా.. అన్నయ్యా.. వదినని తీసుకుని గుహలో దాచేసేయ్. లోపల ఉన్న మన ధనస్సు బాణాలు, అక్షయ బాణ తూణీరాలు, ఆయుధాలు అన్నీ పట్టుకురా అదిగో ఎదురుగుండా ఏనుగులు కనబడు తున్నాయి; గుర్రాలు కనబడుతున్నాయి; వాహనాలు కనపడుతున్నాయి; శత్రుసైన్యం కనబడుతోంది. అదుగో ఎదురుగా కోవిదార వృక్షం పతాకంగా కనబడుతోంది. అంటే భరతుడు ససైన్యంతో వస్తున్నాడు. అరణ్యంలో ఉన్నా

శత్రుశేషం మిగల్చకూడదని నిన్నూ, నన్నూ, వదిననూ మట్టుపెట్టి రాజ్యం సువ్యవస్థితం చేసుకోవాలనుకుంటున్నాడు. దుర్మార్గుణ్ణి ఇక్కడి నుంచే చంపేస్తాను అన్నయ్యా, నీ జోలిదాకా రానివ్వను. పట్టుకురా ఆయుధాలు" అన్నాడు. ఆ ప్రేమ పరవశం అటువంటిది లక్ష్మణుడిది. అంటే – రాముడు స్థాయిగా హాయిగా ప్రశాంతంగా కూర్చుని అన్నాడు –

**ధర్మమర్థంచ కామంచ పృథివీంచాపి లక్ష్మణా**
**ఇచ్ఛాపి భరతామర్థే ఏ తత్పురుషోన్వితే** .. అన్నాడు

"లక్ష్మణా .. ధర్మముగాని, అర్థము కాని, కామము కానీ, నా తమ్ముళ్లు పొందనిది నా కక్కర్లేదు. నా తమ్ముళ్ళు అనుభవించినదే నేనూ అనుభవిస్తాను వాళ్ళని చంపిన నెత్తుటి కూడు నేను తినను. నువ్వు ఏమన్నావు భరతుడు మనల్ని చంపడానికి వస్తున్నాడు అన్నావు కదా. భరతహృదయం నాకు తెలుసు. నన్ను బ్రతిమాలి అయోధ్యకి తీసుకెళ్లడానికి వస్తున్నాడు. చెట్టు దిగి కిందకు రా..!!" అన్నాడు.

లక్ష్మణుడు గొప్పతనం ఎక్కడ ఉంటుంది అంటే అంత కోప్పడతాడు. అన్నయ్య ఏమైనా అనేటప్పటికి చేతులు కట్టుకుని అలా వచ్చి నుంచుంటాడు. ఎంత భక్తో – నిజంగా. కిష్కింధకాండలో ఒక అద్భుతమైనటువంటి ఘట్టం కనబడుతుంది.

సీతమ్మని రావణాసురుడు అపహరించినప్పుడు పైనుంచి నగల మూటని కింద పడేసింది. కొన్ని నగలు. ఆ నగలమూట సుగ్రీవుడికి దొరికింది. స్నేహం కుదిరిన తర్వాత రామలక్ష్మణులకి చూపించాడు. చూపిస్తే అందులో కొన్ని ఆభరణాలు గుర్తుపట్టిన తర్వాత, ఇవి సీతమ్మవే అని గుర్తుపట్టి, సీతమ్మ జ్ఞాపకానికి వచ్చి రామచంద్రమూర్తి కన్నుల వెంట బాష్పధారలు పడుతుంటే వాటిని స్పష్టంగా చూడలేకపోయాడు. అప్పుడు లక్ష్మణస్వామిని పిలిచి – ఈ ఆభరణాలు మీ వదినవేనా చూడు అని అన్నాడు. ఆయన –

**నాహంజానామి కేయూరే నాహంజానామి కుండలే ।**
**నూపురే తు అభిజనామి నిత్యం పాదాభివందనాత్ ॥**

"అన్నయ్యా ఇవి వదిన భుజములకు పెట్టుకునేవి. నేను ఎప్పుడు చూడలేదు. ఇవి చెవులకు పెట్టుకునేవి నేనెప్పుడూ చూడలేదు. కానీ ఇవి వదిన పాదములకు పెట్టుకునే నూపురములు. ఇవి నాకు తెలుసునన్నయ్యా. రోజూ వదిన పాదములకు నమస్కరించేటప్పుడు చూశాను" అన్నాడు. అంటే చూడకుండా ఉండడం అన్నది కాదు ప్రశ్న అక్కడ. చూసినా ఆయన మనసులోకి ప్రవేశించలేదు. వదిన పాదములు ఆయనకు అంత జ్ఞాపకం. అంటే లక్ష్మణస్వామి ఎంత భక్తి తత్పరుడో అర్థమౌతుంది.

అరటిపట్టలు తీసుకువచ్చి కొట్టి గడ్డి వేసి సీతారాములిద్దర్నీ పడుకోమన్నాడు గుహుడు. సీతారాములు ఇద్దరూ పడుకుంటే రామచంద్రమూర్తి చేతి మీద సీతమ్మ తలపెట్టి పడుకుంది. రాముడే పడుకుని ఉండగా నాకు నిద్ర పట్టలేదు అంటే దోషం అని ఆయన పడుకున్నప్పుడు నేను పడుకోవాలి అని వాడికి నిద్ర పట్టేసింది. గుహుడు, ఆయన సైన్యం చుట్టూ పరివేష్టించి ఉండగా అంత గొప్పతల్లి నిద్రపోయింది. గుహుడు లక్ష్మణస్వామితో– "లక్ష్మణా నీకుకూడా నాలుగు అరటి పట్టలు తీసుకువచ్చి కొట్టి అక్కడ పడేస్తాను. నువ్వు కూడా పడుకో." అన్నాడు.

**కథం దాశరథౌ భూమౌ శయానే సహ సీతయా ।**
**శక్యా నిద్రామయా లబ్ధుం జీవితం వా సుఖాని వా .. ॥**

"ఎలా పడుకోమంటావ్? దశరథుడు, ధర్మాత్ముడు 60 వేల సంవత్సరాల పాటు సంతానం లేకపోతే సంతానం కలగకుండా అడ్డొచ్చిన ప్రతిబంధకం తొలగించుకోవడానికి అశ్వమేథయాగం చేసి, ప్రతిబంధకం తొలగిపోయిన తర్వాత పుత్రసంతానం కలగడం కోసం మళ్ళీ అధర్వ సరసీ అనబడే వేదంలోని మంత్రములను ఋష్యశృంగుడు కలిపి హోమం చేస్తే

పుత్రకామేష్టి చేసినప్పుడు ఆ అగ్నిహోత్రంలోనుంచి వచ్చిన దేవతాస్వరూపం ఇచ్చిన పాయసం చేత కలిగిన దేవతాస్వరూపుడు, పరమ ధర్మమూర్తి, సకల శాస్త్ర పారంగతుడు, అంత గొప్పవాడైన రామచంద్ర మూర్తి; నా వదిన, అయోనిజ, ఎండ కన్నెరుగని తల్లి సీతమ్మతో కలిసి అరటి పట్టల మీద పడుకుని ఉంటే చూసి నాకు నిద్ర పడుతుందా? ఎట్లా పడుకోనయ్యా? అని అడిగాడు అంటే అంత భక్తితత్పరుడు మహానుభావుడు.

మొట్టమొదటి రాత్రి సీతమ్మ పడుకుంది, రామలక్ష్మణులు తెలివిగా ఉన్నారు. క్రూరమృగాల అరుపులు వినపడుతున్నాయి. "ఏదో తొందరపడి వచ్చేసాడు." అనుకున్నాడో, లేకపోతే లక్ష్మణస్వామి భక్తి లోకానికి తెలియాలనుకున్నాడో రామచంద్రమూర్తి – పిలిచి "నువ్వు తొందరపడి నాతో వచ్చావు. రేపు పొద్దున్న కైకమ్మకి ఎట్లాగైనా కౌసల్యాదేవినీ సుమిత్రనూ ఇబ్బంది పెట్టాలనిపించి, దశరథుడు తన చేతిలో ఉంటాడు కాబట్టి ఇబ్బంది పెడితే; భరతుడు యువరాజై పోతాడు కాబట్టి రాజ్యమాయన చేతిలోకి వెళ్ళిపోతే మీ అమ్మ, మా అమ్మ బాధపడరా? అందుకని నువ్వు వెనక్కి వెళ్ళిపో. వెళ్లిపోయి కౌసల్యాదేవిని సుమిత్రని జాగ్రత్తగా కాపాడు. నేను పధ్నాలుగేళ్లు అరణ్యవాసం చేసి వెనక్కి వస్తా"న్నాడు. లక్ష్మణస్వామి అన్నాడు –

**"న చ సీతా త్వయా హీనా నచాహ మపి రాఘవ ।**
**ముహూర్త మపి జీవావో జలా న్మత్స్యా వివో ధృతౌ" ॥**

"అన్నయ్యా సీతమ్మ నిన్ను విడిచిపెట్టి ఉండదు ఆ విషయం నీకు తెలుసు. అందుకే వదినని పంపించవచ్చుగా? వదిన అత్తగారిని చూసుకుంటుందిగా! చిన్నత్తగారు సుమిత్రను చూసుకుంటుందిగా! భరతుణ్ణి వదినగారు నిగ్రహిస్తుందిగా! మరి వదిన్ని ఎందుకు పంపించవు? అంటే వదిన నిన్ను విడిచిపెట్టి ఉండలేదు. నన్ను ఎందుకు వెళ్ళమన్నావు?

నేను నిన్ను విడిచిపెట్టి ఉండగలనని అనుకుంటున్నావు. అన్నయ్యా ఉంటాను. ఎంతకాలం ఉంటానో తెలుసా? బాగా లోతుగా ఉన్న ఒక సరోవరం ఆ సరోవరంలో ఆడుకున్న ఒక చేప – ఆ చేపని ఒక వ్యక్తి ఒడ్డున వచ్చి నిలబడి వంగి జాగ్రత్తగా చెయ్యిపెట్టి పట్టుకుని పైకితీసి ఒడ్డున పారేస్తే ఒంటికి తడి ఉన్నంతసేపు ఎగిరెగిరి కొట్టుకుంటూ, ఒంటికి తడి ఆరిపోయిన తరువాత ప్రాణములు విడిచిపెట్టేసినట్లు – నేను వెనక్కి తిరిగి వెళ్ళిపోతుండగా, వెనక్కి తిరిగి చూసినప్పుడు ఎంతసేపు నువ్వు కనబడతావో అంతసేపు మాత్రమే నేను ప్రాణములతో ఉంటాను తప్ప నిన్ను వదిలి ఉండలేను అన్నయ్యా" అని అన్నాడు. అంతటి భక్తితత్వం.

చిన్నప్పుడు మా పిల్లలు ఒక పాట పాడుతూ ఉండేవారు "మచిలీ జల్ కా రాణీ – ఉస్కా జీవన్ పానీ – హాత్ లగావో డర్ జాయేగీ – బాహర్ లగావో మర్ జాయేగీ". నీళ్ళలో చేప ఉంటుంది, చేయి పెడితే భయపడుతుంది బయటకి తీస్తే పారేస్తే చచ్చిపోతుంది అని చెప్పి ఆ పాట పాడుతూ ఉండేవారు.

అలా లక్ష్మణస్వామి ఎంతసేపు రాముడు కనబడతాడో అంతసేపు మాత్రమే నేను జీవించి ఉంటానని చెప్పుకున్నాడు అంటే లక్ష్మణ స్వామి రామచంద్రమూర్తి మీద ఎంత భక్తి కలిగినవాడో, ఎంత ప్రేమ కలిగినవాడో, అసలా అన్నదమ్ముల అనుబంధం ఎలా ఉంటుందో అర్ధమౌతుంది.

చిట్టచివర అంతా అయిపోయిన తర్వాత, యువరాజ్య పట్టాభిషేకం జరుగుతోంది. జరుగుతుంటే నిజానికి ఎవరికి చేయాలి? భరతుడికి చేయాలి. రాముడి తర్వాత పెద్దవాడు కాబట్టి.  కానీ ఇంతకాలం అన్నయ్య వెంట వెళ్లాను. పద్నాలుగు ఏళ్ళు కష్టపడ్డాను నన్ను కనీసం యువరాజ్యపట్టాభిషేకం చేసుకో అని కూడా అన్నయ్య అనలేదే..! అని లక్ష్మణుడు అనుకుంటాడేమోనని రామచంద్రమూర్తి పిలవడం కూడా చాలా గమ్మత్తుగా ఉంటుంది.

"అతిష్ఠ ధర్మజ్ఞ మయాస హేమాంగాం పూర్వాజ్ఞాం రుషితాం బలేన" అన్నాడు

ధర్మము తెలిసినవాడా – నాతోపాటు యువరాజ్యపట్టాభిషేకం చేసుకో అన్నాడు. లక్ష్మణస్వామి అన్నాడు – ధర్మం తెలిసినవాడా అనడంలోనే తెలుస్తోంది నీకన్నా పెద్దవాడు భరతుడు ఉన్నాడని – ఆయన అన్నాడు – "అన్నయ్యా నీతో పద్నాలుగు ఏళ్ళు సేవ చేయడానికి వచ్చాను అన్నయ్యా నాకు నీ సేవ కావాలి తప్ప పదవులు అక్కరలేదు అన్నయ్య. అది పెద్దవాడు భరతునికి ఇయ్యి అన్నయ్య" అన్నాడు.

వాళ్ళిద్దరి అన్యోన్యత, ఆప్యాయత అన్నదమ్ముల అనుబంధం అంత గొప్పది.

భరత శత్రుఘ్నులు అలాగే ఉంటారు. రామలక్ష్మణులు ఎలా ఉంటారో భరత శత్రుఘ్నులు అలా ఉంటారు. అయోధ్య కాండ ప్రారంభంలో ఒక శ్లోకం ఉంటుంది చాలా విచిత్రమైన శ్లోకం. ఎంత విచిత్రంగా ఉంటుంది అంటే

**గచ్ఛతా మాతులకులం భరతేన తదానఘ ।**
**శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః ॥**

అంటే – అమాయకంగా నేను ఇది ఎవరిని విమర్శించడానికి చెప్పట్లేదు. ఒక్కొక్కరు నా దగ్గరికి వస్తూ ఉంటారు. వచ్చి ముందు మాట్లాడడానికి రారు. నేను ఏదో గోశాలలో అటు ఇటు తిరుగుతుంటే వాళ్ళు తిరుగుతుంటారు. ఓహో వీళ్ళేదో ప్రవచనం కోసం వచ్చి ఉంటారని తెలుస్తుంది నాకు. తర్వాత నేనే స్వతంత్రించి ఇట్లా రండి మీరు ఎక్కడి నుంచి వచ్చారు దేనికి వచ్చారంటాను. మేము ఫలానా ఊరు నుంచి వచ్చామండి మిమ్మల్ని తీసుకెళ్దామని, మిమ్మల్ని ప్రవచనానికి తీసుకెళ్దాం అనుకుంటున్నామండీ

అంటారు. నేను భరతుడి దగ్గర శత్రుఘ్నుణ్ణి కాను మీరు తీసుకెళ్లిపోతే రావడానికి అంటూ ఉంటాను. భరతుడు తీసుకుపోయాడుట శత్రుఘ్నుణ్ణి. అంటే ఏదో నేను పెడుతున్నప్పుడు నా పెట్టె తీసుకెళ్ళిపోయినట్టు, నా కలం తీసుకు పోయినట్టు, నా ఉత్తరీయం తీసుకుపోయినట్టు, ఇంకా వీలైతే నాకు వేసిన దండం తీసుకు పోయినట్టు ఆయన తనతో పాటు శత్రుఘ్నుణ్ణి తీసుకు పోయాట్ట. వాళ్ళిద్దరి మైత్రి అటువంటిది. అందుకే మహర్షి ఒక అద్భుతమైన మాట అంటారు.

**భరతస్యాపి శత్రుఘ్నో లక్ష్మణా విరజాహిసః**

లక్ష్మణుడు రాముడు ఎలా ఉంటారో లక్ష్మణుడికి ముందు పుట్టిన భరతుడితో శత్రుఘ్నుడు అలా కలసి ఉంటాడట. లక్ష్మణ శత్రుఘ్నులిద్దరూ కూడా సుమిత్రాదేవి పిల్లలు. విచిత్రం ఏమిటంటే కౌసల్య ఇంట్లో ఒక ఉయ్యాల రాముడిది. కైకమ్మ ఇంట్లో ఒక ఉయ్యాల భరతుడిది. సుమిత్ర ఇంట్లో రెండు ఉయ్యాలలు. లక్ష్మణుడు శత్రుఘ్నుడు. కానీ ఊపడానికి పిల్లలే ఉండరు. ఎందుకంటే సుమిత్ర ఇంట్లో ఉయ్యాల్లో ఉన్న లక్ష్మణస్వామి కౌసల్య ఇంట్లో రాముడి పక్కన పడుకుని ఉంటాడు రెండో పిల్లాడు శత్రుఘ్నుడు కైకమ్మ ఇంట్లో భరతుని పక్కన పడుకుని ఉంటాడు. "అయ్యో నాకు ఇద్దరు పిల్లలు మా ఇంట్లో కదా ఎక్కువ హడావిడి ఉండాలి! రెండు ఉయ్యాలలు ఉండాలి. దశరథుడు ఇక్కడ గడపాలి కదా.." అని సుమిత్ర అనదు. "అక్క పిల్లలతో అంత బాగా గడుపుతున్నారు చెల్లి పిల్లలతో అంత బాగా గడుపుతున్నారు నాకు ఇంతకన్నా ఏం కావాలి?" అని పొంగిపోతుంది. అందుకనే భర్తకి ఇబ్బంది కలిగించదు. ఏది మాట్లాడినా ఎంత బాగా మాట్లాడుతుందో ఎలా పెట్టారో మహర్షి అంత మంచి పేరు. సుమిత్ర. అంత మంచి మిత్రులు. అందుకని

**భరతస్యాపి శత్రుఘ్నో లక్ష్మణా విరజాహిసః**

ఎంత గొప్పగా కలిసి ఉంటారో వాళ్లిద్దరూ కూడా – ప్రాణైహి ప్రియతరో నిత్యః

ఇవాళ చాలా ఇష్టం ఉండి ప్రాణం మీద మళ్ళీ మధ్యాహ్నం 12:00 కి మాత్రం నాకు నా ప్రాణాల మీద ఇష్టం ఉండదని ఎవరైనా అంటారా? ఎప్పుడూ ప్రాణాలమీద ప్రతివాడికి ఇష్టమే. ప్రాణాలు ఎంత ఇష్టమో భరతుడికి శత్రుఘ్నుడు అంటే అంత ఇష్టంట. అంత సంతోషంగా ఉండేవాడు. చిత్రం ఏమిటంటే వాళ్ళిద్దరూ కలిసి ఉంటారు కానీ – మళ్లీ వాళ్లిద్దరూ కలిసి ఉండి రాముణ్ణి ప్రేమిస్తుంటారు. వాళ్ళిద్దరికీ ఏం కావాలంటే రాముడు కావాలి.

దానికి పెద్ద ఉదాహరణ ఏమిటంటే రాముడు అరణ్యవాసానికి వెళ్లిపోయిన తర్వాత ఒకసారి భరత శత్రుఘ్నులు ఇద్దరు అంతఃపురంలో గవాక్షంలో కూర్చుని ఉన్నారు. కూర్చొని ఉండగా అక్కడికి మందర వెళ్ళిపోతోంది. దాని గూనికి బంగారు ఆభరణం చేయించింది కైక. ఆ ఆభరణం పెట్టుకుని పట్టుబట్టలు కట్టుకుని హారాలు వేసుకుని వెళ్ళిపోతోంది. అక్కడకు ఒక రక్షకుడు పరిగెత్తుకుంటూ వచ్చి, శత్రుఘ్నుడితో అన్నాడు – అసలు చక్కగా కళకళలాడుతూ నవ్వులతో సంతోషంగా ఉండే మీ అంతఃపురం ఇవాళ శోకనివాసం అయిపోయిందంటే దానికి కారణం ఈ మందరే..! అక్కరలేని మాటలన్నీ చెప్పింది. దీన్ని శిక్షించండి అన్నాడు. శత్రుఘ్నుడికి దాన్ని చూసేటప్పటికి ఎక్కడలేని కోపం వచ్చి కత్తి ఒర లోంచి పైకి తీసుకుని దాన్ని బలవంతంగా పట్టుకొని ఈడ్చేస్తే దాని ఆభరణాలన్నీ కింద పడిపోతే అవి ఆకాశంలో తారల్లాగా కనబడ్డాయిట. అది కైకమ్మా కైకమ్మా అని అరిచిందిట. అంతఃపుర కాంతలందరూ భయపడి పోయారు. శత్రుఘ్నుడు మందరని చంపేద్దాం అన్నాడు. చాలా ప్రశాంతంగా భరతుడు అన్నాడు –

**ఇమామపి హతాం కుబ్జాం యది జానాతి రాఘవః ।**
**త్వాంచ మామ్చైవ ధర్మాత్మా నాభిభాషిష్యతే ధృవం ॥**

"ఏమయ్యా నీ కన్నా కష్టం నా కన్నా కష్టం రాముడిది. ధర్మాత్ముడు అటువంటి వాడికి రాజ్యం పోయింది. ఆయనే ఒక స్త్రీని కారణం చేసి చంపడం ఏమిటని మందరని చంపకుండా వెళ్ళిపోయాడు. అన్నయ్య మీద రక్తితో మనం ఈవిడని చంపేశాం అని తెలిసిందనుకో. అన్నయ్య – నేను చెయ్యని పని మీరు చేస్తారా అని మనిద్దర్నీ ఇలా చూసి, "భరతా శత్రుఘ్నా" అని ఎదురువచ్చి కౌగిలించుకోడు. ముఖం ఇలా తిప్పుకుంటాడు. మనం అటు వెళితే ఇటు తిప్పుకుంటాడు. నీకు ఇష్టమా? అలా అయితే చంపేయి." అన్నాడు. దీని చావు ఎవడికి కావాలి రాముడి ప్రసన్నత కావాలి కానీ అని మందరని వదిలేశాడు. అంటే వాళ్ళిద్దరికీ ఏం కావాలంటే రాముడు కావాలి.

భరతుడి హృదయం పరిశీలించాలి అనుకున్నాడు భరద్వాజ మహర్షి అయోధ్యకాండలో. సైన్యంతో వస్తుంటే పెద్ద రాజభవనాన్ని నిర్మించి విశ్రాంతి తీసుకోమని పరివారం అంతటితోటి భరతుణ్ణి అందులో ప్రవేశపెట్టాడు. బ్రహ్మాండమైన సింహాసనం. మిగిలిన వాళ్ళందరూ కూర్చోడానికి ఆసనాలు ఉన్నాయి. నిజానికి భరతుడు ఎక్కడ కూచోవాలి? వెళ్లి ఆ సింహాసనం మీద కూర్చోవాలి. భరతుడు ఏం చేశాడో చూస్తున్నాడు భరద్వాజుడు దివ్యదృష్టితో. రాజ్యం మీద మమకారం ఉందా కూర్చుంటాడా అని. చేతిలో చామరం పట్టుకుని మంత్రి కూర్చునే ఆసనంలో కూర్చుని సింహాసనానికి వింజామర వేశాడు. అంటే రాముడు కూర్చున్నాడని. దాని మీద రాముడు కూర్చోవాలి తప్ప నేను కూర్చోకూడదని. ఇది భరతుడి భక్తి.

రాముడు లక్ష్మణస్వామి సీతమ్మతో అరణ్యవాసానికి వెళ్లిపోయాడు. గుహుడి దగ్గర పడుకుని లేచి వెళ్ళిపోయాడు. ఆమె చీరకు పట్టుకున్న

పట్టుదారాలు ఇలాగే ఎలా వచ్చాయో అలాగే అరటి పట్టలకు పట్టుకున్నాయి. ఆ తర్వాత అక్కడికి భరతుడు వచ్చాడు. పడుకున్న శయ్య చూశాడు. అయ్యో మా వదిన పట్టుదారాలు అంటుకున్నాయి అంటే ఏమిటి ఇక్కడ పడుకుందా మా వదిన అని ఏడ్చాడు. లక్ష్మణస్వామి గురించి భరతుడికి తెలుసా? గుహుడికి తెలుసా? భరతుడికే తెలుసు. కలిసి పుట్టి పెరిగిన వాళ్ళు. గుహుడు – అసలు లక్ష్మణుడు ఎంత గొప్పవాడో తెలుసా? ఎంత అనుగమిస్తాడో తెలుసా? రాముడు అంటే ఎంత ప్రేమో తెలుసా? పడుకోమంటే పడుకోలేదు తెలుసా? అని ఒకటే చెప్పేస్తున్నాడు. "నీ మొహం – నీకు తెలుసా నాకు తెలుసా నాకు చెప్తావేమిటి లక్ష్మణుడు గురించి?" భరతుడు అనాలి గదా..! అనలేదుట.

**ఆచచక్షేఽథ సద్భావం లక్ష్మణస్య మహాత్మనః ।**
**భరతాయాప్రమేయాయ గుహో గహనగోచరః ॥**

అరణ్యాలలో తిరిగేవాడు గుహుడు. సీతారామలక్ష్మణులు ఒక్కరాత్రి గడిపారు అక్కడ. అటువంటివాడు లక్ష్మణుల గురించి చెప్తుంటే "ఎంత అదృష్టవంతుడో నా తమ్ముడు. రాముడితో అలా వెళ్లాడని" – అట్లా విని ఆనంద పడిపోయాడు. అంటే భరతుడు ఎంత గొప్పవాడు అన్నదానికి అది ప్రతీక.

లోకంలో ఏ అన్నదమ్ములైన ఆస్తికోసం – అన్నయ్యా నీకు ఒక ఎకరం ఎక్కువ వచ్చేసింది అనో, లేకపోతే నీకో పదివేలు ఎక్కువ వచ్చేసిందనో దెబ్బలాడుకున్నవాళ్ళు ఉంటారు. రాజ్యం నీకెళ్ళాలి అంటే రాజ్యం నీకెళ్ళాలి అని అనుకున్నవాళ్లు లోకంలో ఎక్కడైనా ఉంటే రాముడు–భరతుడు వాళ్ళిద్దరే ఉన్నారు. అంత వాదించుకున్న తరువాత – ధర్మం కోసం – చిట్టచివరికి వశిష్ఠ మహర్షికి తెలుసు. రాముడు రాడు. తండ్రి మాటకి కట్టుబడి ఉంటాడు తండ్రి ఇప్పుడు లేడు. వెనక్కి తీయడానికి. పద్నాలుగేళ్ళు పోయాకే వస్తాడని.

అందుకని ఆయన వెళ్తున్నప్పుడే స్వర్ణపాదుకలు పట్టుకెళ్ళాడు. వశిష్ఠుడి సూచన మేరకు – "అన్నయ్యా ఈ పాదుకల మీద నీవు ఒక్కసారి ఎక్కి దిగిపో. నువ్వు అక్కరలేదు. నువ్వు తొడుక్కొని విప్పిన చెప్పులు రాజ్య పరిపాలన చేస్తాయి. వాటిని సింహాసనం మీద పెట్టి, చామరం వేసి, రాజప్రతినిధిగా పరిపాలిస్తాను. పద్నాలుగేళ్ళు ఐపోయాక నువ్వు కనబడకపోతే మాత్రం ప్రాయోపవేశం చేస్తాను." అన్నాడు. రాముడు ఆ పాదుకల మీరు ఎక్కి దిగాడు.

**తతః శిరసి కృత్వా తు పాదుకే భరత స్తదా ।**
**ఆరురోహ రథం హృష్టః శత్రుఘ్నేన సమన్వితః ॥**

ఆ పాదుకల్ని చేతులతో పట్టుకెళ్ళలేదుట. మా అన్నగారు ఎక్కి దిగిన పాదుకలు. ఈ పాదుకలు – ఇవే రాజు. అని వాటిని తలమీద పెట్టుకున్నాట్ట. అంటే అసలు ఆయనకి రామచంద్రమూర్తి మీద ఎంత భక్తి ఉంటుందో చూడండి.

ఆఖరికి రాముడు తిరిగి వచ్చేస్తే భరతుడు చెప్పిన మొట్టమొదటి మాట—

**"పూజితా మామికా మాతా దత్తం రాజ్యం ఇదం మమ**
**తద్దదామి పునః తుభ్యం యథా త్వమ్ అదదామమ"**

అన్నయ్యా మా అమ్మ ఆనాడు నాన్నగారిని వరం అడిగిందని పధ్నాలుగేళ్ళు అరణ్యవాసానికి వెళ్ళి రాజ్యాన్ని న్యాసంగా నాకు అప్పగించి చెప్పావు. ఎద్దు మోయవలసిన బరువు దూడ మోయలేదు. ఈ రాజ్యాన్ని నీకు యథాతథంగా అప్పజెప్పేస్తున్నాను. అన్నయ్యా రాజ్యం నువ్వే పరిపాలించు.

**యావదావర్తతే చక్రం యావతీ చ వసుంధరా ।**
**తావత్ త్వమిహ లోకస్య స్వామిత్వ మనువర్తయ ॥**

ఎంతకాలము ఈ జ్యోతిశ్చక్రం ఉంటుందో అంతకాలమూ ఈ భూమికి

నువ్వే రాజువి అని చెప్పి, అన్నయ్యకి రాజ్యం అప్పచెప్పేసి ఆనందపడి పోయినవాడు భరతుడు. అన్నగారు నందిగ్రామం నుంచి అయోధ్యకి రథంలో వెడుతుంటే భరతుడు పగ్గాలు పట్టాడు. శత్రుఘ్నుడు పైన గొడుగు పట్టాడు. విభీషణుడు చామరం వీస్తున్నాడు. ఇద్దరూ ఉత్తరీయంతో కళ్ళు తుడుచు కున్నారు. ఎవరంటే విభీషణుడు సుగ్రీవుడు.

విభీషణుడు అనుకున్నాడు – "మేము ముగ్గురం బ్రహ్మగారి గురించి తపస్సు చేశాం. అనితరసాధ్యమైన తపస్సు చేస్తే బ్రహ్మగారు ప్రత్యక్షమై వరాలు ఇచ్చారు. దేవతలందరినీ మా అన్న రావణాసురుడు అలా నిలబెట్టాడు. యేరీ? ఇవాళ ఆ అన్నకి, కుంభకర్ణుడికి వ్యతిరేకంగా పనిచేసి ఇద్దరు అన్నలు పడిపోవడానికి కారణం అయ్యాను మేము ఇలా ముగ్గురం కలిసి జీవితంలో నిలబడగలిగే ఉంటే ఎంత బాగుండేదో..! బతికున్నన్నాళ్ళు కొట్టుకున్నాం. విడిపోయిన తర్వాత ఒక్కడిని మిగిలాను. వాళ్ళు నలుగురు అంత ప్రేమగానే ఉన్నారు."

సుగ్రీవుడు – "మా అన్న వాలి. గొప్ప వరం పొందినవాడు. ఆయన బలానికి తిరుగులేదు. అలాంటివాడిని రామచంద్రమూర్తిని తీసుకెళ్లి ఒక్క బాణంతో పడగొట్టించాను. ఆ వాలి మరణించాడు. రాజ్యం స్వీకరించాను. నేను మా అన్నయ్య కూడా ఇలా కలిసిఉంటే, వాలి సుగ్రీవులం ఇద్దరం కలిసి నిలబడి ఉంటే ఎంత బాగుండేదో..!! అన్నయ్య పడిపోవడానికి నేను కారణమయ్యాను" అని ఏడ్చాడు.

కలిసి ఉన్నన్నాళ్ళు దెబ్బలాడుకోవడం, మరణించిన తర్వాత ఏడవడం. దేనికి ఆ జన్మ? కలిసి ఉన్నన్నాళ్లు కలిసి ఉన్న అన్నదమ్ములు ఎవరో వాళ్ళు ధన్యులు. "అన్నయ్యా" అని తమ్ముడు పిలిచినది.. అందులో ఒక వయసు వచ్చిన తర్వాత ఎంత మందిలో ఉన్నా "అన్నయ్యా" అని తమ్ముడు వచ్చి చేతులు పట్టుకోవడం; ప్రేమతో అన్నయ్యని కౌగిలించుకోవడం ఎప్పుడొచ్చావ్

రా అని ప్రేమగా తమ్ముడి చెయ్యి అన్నగారు పట్టుకుని నడిచి వెళుతూ ఉంటే కన్నులకు ఉపవాసం తీరిపోయినంత ఆనందంగా ఉంటుంది. అన్నదమ్ములు అక్క చెల్లెళ్ళు ఎంత గొప్ప అనుబంధాలండీ అవి? అది భగవంతుడు పెట్టిన అనుబంధం, మళ్లీ రమ్మంటే వస్తుందా? అటువంటి అనుబంధాలు వదులుకుని దెబ్బలాడుకోవడం ఎంత హీనమైన విషయం నిజంగా..!! కాబట్టి ఆ రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల ప్రేమ అంత గొప్పగా ఉండేది.

రామాయణము మానవీయ సంబంధములు అంటే అంత అద్భుతమైన అనుబంధాలు. దాంపత్యం అయినా వాళ్లే, అన్నదమ్ములైనా వాళ్లే, ఆఖరికి తల్లిదండ్రులు. తల్లిదండ్రులంటే ఎంత ప్రాణం నిజంగా ఆ మహానుభావుడికి. దశరథ మహారాజు గారి గురించి కౌసల్య గురించి సుమిత్ర, కైకేయిల గురించి మాట్లాడుతూ రాముడు ఒక మాట అంటాడు.

"న సుప్రతికరం తత్తు మాత్రా పిత్రా చ యత్కృతం" అంటాడు. ఈ లోకంలో ఎవరు చేసినదానికైనా ప్రత్యుపకారము చేయవచ్చుగానీ తల్లిదండ్రులు చేసిన దానికి ప్రత్యుపకారము చేయగలిగిన వాడు లేడు.

"He who says thanks to his father mother and wife is the biggest fool on the fact of the earth." అని ఒకచోట రాశారు వాకాటి పాండురంగారావు గారు. తల్లికి, తండ్రికి కృతజ్ఞతలు ఏమిటి? ఏమిచ్చి కృతజ్ఞత చెప్తావు? నీ వంశాన్ని నిలబెట్టి ఆమె ఎవరో తెలియకపోయినా నీతో కలిసి జీవితాన్ని పంచుకొని నీ చేతులలో తాను వెళ్లిపోవాలని కోరుకునే ఆ ఇల్లాలికి నువ్వు ఎలా థాంక్స్ చెప్తావు? పురుషుడనలేడు ఆ మాట. కానీ ఆమె అంటుంది. నాకంటూ కోరిక మీ చేతుల్లో పసుపు కుంకాలతో వెళ్లి పోవాలని. అది ఈ జాతి సంస్కార వైభవం. ఆమెకి ఏం థాంక్స్ చెప్తావు నువ్వు? అంత గొప్ప భార్య. అటువంటి తల్లితండ్రులు. వాళ్లకి మళ్లీ ప్రత్యుపకారం చేయగలమని నేను అనుకోవడంలేదు అంటాడు రాముడు.

వాళ్లకి ఏది చేసినా శుశ్రూష తక్కువే. అంతకన్నా నేను చేయలేను.

**చైత్ర స్శ్రీమానయం మాసః పుణ్యః పుష్పితకాననః. ।**
**యౌవరాజ్యాయ రామస్య సర్వమేవోపకల్ప్యతామ్ ॥**

ఇది చైత్రమాసం కాబట్టి నేను ఈ చైత్రమాసంలో రాముడికి యువరాజ్యపట్టాభిషేకం చేద్దాం అని అనుకుంటున్నానని తానే ముహూర్తం పెట్టేసుకున్నాడు దశరథ మహారాజు. తెల్లవారి రామచంద్రమూర్తి వచ్చి పట్టాభిషేకం చేసుకోవాలి. రాత్రికి రాత్రి కైకమ్మ రెండు వరాలు అడిగింది.

**నవపంచచ వర్షాణి దండకారణ్య మాశ్రితః ।**
**చీరాజినజటాధారీ రామో భవతు తాపసః. ॥**

**అభిషేకసమారమ్భో రాఘవస్యోపకల్పితః ।**
**అనేనైవాభిషేకేణ భరతో మేఽభిషిచ్యతామ్ ॥**

ఇదే ముహూర్తానికి పద్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసానికి రాముడు వెళ్లిపోవాలి. ఇదే ముహూర్తానికి భరతుడికి పట్టాభిషేకం జరగాలంది. మొదలు నరికిన చెట్టు ఎలా పడిపోతుందో అలా పడిపోయాడు దశరథుడు. ఆయన పొందిన వేదన అంతా ఇంతా కాదు. నిజానికి రాముడు దశరథుని చూడడానికి వెళ్ళాడు. అంత దస్సిపోయి ముందురోజు రాత్రి ఎన్ని మాట్లు స్పృహ తప్పిపోయాడో. పడిపోయి ఉన్నాడు దశరథుడు. ఆశ్చర్యపోయాడు రాముడు. అమ్మా ఎందుకు నాన్నగారు అలా ఉన్నారని అడిగాడు. "ఆయన మాట నువ్వు నిలబెడతావో–నిలబెట్టవో అని మీ నాన్నగారు బెంగ పెట్టుకుని, నువ్వు నిలబెట్టి అయోధ్య వదిలిపెడితే తప్ప అన్నంముట్టను స్నానం చేయను అన్నా"రంది – కైకమ్మ. ఏం చేయాలమ్మా అని అడిగాడు. రాత్రి రెండు వరాలు ఇచ్చారు నువ్వు అయోధ్య విడిచిపెట్టి అరణ్యవాసానికి వెళ్లిపోవాలని. ఇంకొకడైతే? పట్టాభిషేకం కాసేపట్లో. ఎంత

బెంగ పెట్టుకుంటాడు? ఆయన చాలా ప్రశాంతంగా అన్నాడు.

**నాహమర్థపరో దేవి! లోకమావస్తుముత్సహే ।**
**విద్ధిమామృషిభిస్తుల్యం కేవలం ధర్మమాస్థితమ్ ॥**

అమ్మా నేను ఋషిని అమ్మా. నాకు ధర్మం కావాలమ్మా అర్థ–కామాలు కాదు. తండ్రిగారు చెప్పిన మాట విన్న వాడిది పుత్రధర్మం. ఆయన చెప్పినది వింటాను తప్ప రాజ్యం కోసం కాదమ్మా. అమ్మా..!! భరతుడికి రాజ్యం కోసం నా పధ్నాలుగేళ్ళ అరణ్యవాసానికి వరం అడిగావా? నువ్వు పిలిచి వెళ్ళమంటే నేను వెళ్ళనామ్మా..! అని ప్రదక్షిణం చేసి వెళ్లిపోయాడు పట్టాభిషేక సామగ్రికి. తల్లిదండ్రుల పట్ల అదీ రామచంద్రమూర్తి గౌరవం. అసలు తల్లిదండ్రులు అంటే ప్రాణం పెట్టేస్తాడు అంతే.

సాధారణంగా మనం అంటాం రాముడు పితృవాక్య పరిపాలకుడు. తండ్రి ఏం చెపితే అది చేస్తాడు అని. దశరథుడే రాముణ్ణి పిలిచి ఒకమాట అన్నాడు. "నిజానికి ఈ రాజ్యం నాది కాదు. పెద్ద కుమారుడివి కాబట్టి నీకు చెందాలి."

**అహం రాఘవ! కైకేయ్యా వరదానేన మోహితః ।**
**అయోధ్యాయాస్త్వమేవాద్య భవ రాజా నిగృహ్య మామ్ ॥**

"పెద్ద కొడుక్కి రాజ్యం వెళ్లడం ఇక్కడ ఎప్పటినుంచో వస్తున్న సంప్రదాయం. కాదనడానికి నేనెవర్ని? ఇవ్వనని అనకూడదు. కానీ కైకమ్మ రాత్రికి రాత్రి హఠం చేసి వరం పొందింది. నువ్వు ఒక పని చెయ్..! 'రాజ్యం వీరభోజ్యం' – నన్ను యుద్ధంలో ఓడించెయ్. పెద్దవాణ్ణి నీతో యుద్ధం చేయలేను. నన్ను కారాగారంలో పెట్టేసి నువ్వు రాజ్యం ఏలుకో. రాముడు రాజ్యం ఏలుతున్నాడు అని కారాగారంలో నుంచి చూస్తూ నిన్ను చూసి బ్రతికేస్తానురా..!!" అన్నాడు. రాముడు అప్పుడూ పితృవాక్పరిపాలన అని

మా నాన్నగారు చెప్పారని ఆయన్ని కారాగారంలో పెట్టేసి రాజ్యం ఏలుకోవచ్చు.

కానీ రాముడు అన్నాడు – "నాన్నగారూ! పధ్నాలుగు సంవత్సరాలు ఎంతలో తిరిగిపోతాయండీ. ఇంటికి తిరిగి వస్తాను. మీ మాట నిలబడాలి నాన్నగారు. మీరన్న మాట నిజం కానినాడు, మిమ్మల్ని సత్యవాక్యమునందు నిలబెట్టనినాడు నా కొడుకుతనం దేనికి? నా పుత్రధర్మం ఏమైపోతుంది? వద్దు నాన్నగారూ" అన్నాడు.

నిజంగా ఆయన ప్రేమ ఆ తల్లిదండ్రులను చూస్తే రాముడు చూపించే ప్రేమ – ఎన్ని విశేషాలో. ఇలా ఉంటుందా తల్లిదండ్రులంటే ఇలా ఉంటారా కొడుకంటే అని మనకి ఆశ్చర్యం వేస్తుంది.

అన్నిటికన్నా చిట్టచివరగా ఒక్క విషయాన్ని చెప్పకపోతే మర్యాద కాదు. ఎందుకనంటే –

**"పవమానసుతుడు పట్టు పాదారవిందములకు**
**నీనామ రూపములకు జయ మంగళం నిత్య శుభ మంగళం"**

హనుమ గురించి ప్రస్తావన చేయకపోతే రామాయణం ఏమిటి ఇంకా?

"రామాయణ మహామాలాం రత్నం వందే అనిలాత్మజమ్" – రామాయణ మహామాలకు రత్నం ఆయన. ఆయనలాంటి భృత్యుడు మరొకడు ఉండడు. ఒక్కొక్కచోట ఉద్యోగం చేసేటప్పుడు అధికారి కన్నా ఉద్యోగి ఎక్కువ తెలివైనవాడు ఉంటాడు. ఎక్కువ శక్తిమంతుడు అవుతాడు. అయినా కూడా మర్యాద ఏమిటంటే కుర్చీకి గౌరవం ఇవ్వాలి. కుర్చీలో ఎవరు కూర్చుంటున్నారో వారు పూజనీయులు. వారి ఆదేశాన్ని మనం వినాలి తప్ప మనం తెలివైన వాళ్ళం అని చెప్పి వాళ్ల చెప్పుల్లో కాళ్ళు పెట్టి వాళ్ళు తెలివితక్కువ వాళ్ళు అని మనం నిరూపించే ప్రయత్నం చేయకూడదు.

అటువంటి ఉద్యోగి ఎవరి దగ్గర ఉంటాడో ఆ రాజు సుఖపడతాడు. ఆ రాజు కార్యాన్ని సాధించగలడు. తెలివైనవాడైన కారణం చేత ప్రభువుని ధిక్కరించేవాడు అనుకోండి. ఆ ప్రభువు సంతోష పడలేడు.

నిజానికి మీరు చూడండి; రామాయణంలో అత్యంత కీలకమైన ఘట్టం ఏమిటంటే – దక్షిణదిక్కుకి సీతమ్మ అపహరించబడిందని సుగ్రీవుడికి తెలుసు. అన్ని దిక్కులకు వానరములను పంపించడం మర్యాద. ఏమో ఎటు తీసుకెళ్ళి దాచాడో ఎవరికి తెలుసు? కానీ లంక దక్షిణ దిక్కున ఉంది. పంపించేటప్పుడు దక్షిణ దిక్కుకు వెళ్లే వానరులకు అంగదుడు యువరాజు కాబట్టి నాయకుడిగా నిర్ణయించారు. దక్షిణదిక్కున వెతకడానికి వెళ్ళిపోతున్నారు. ఒక్క ఆంజనేయ స్వామిని వెనక్కి పిలిచాడు సుగ్రీవుడు. పిలిచి ఒక మాట అన్నాడు

**గతిర్వేగశ్చ తేజశ్చ లాఘవం చ మహాకపే ।**
**పితుస్తే సదృశం వీర! మారుతస్య మహౌజసః ॥**

హనుమా..! నీలాగా గతి అంటే ఒక మార్గంలో వెళ్లడం, వేగం, బుద్ధిబలం – ఇవి ఒక్క మీ తండ్రి వాయువుకి, నీకు మాత్రమే ఉన్నాయి. ఆయన దూకగలడు; నువ్వు దూకగలవు. అంత శక్తిమంతుడివి. ఇది ఇతరులకు లేదు.

**త్వయ్యేవ హనుమన్నస్తి బలం బుద్ధిః పరాక్రమః ।**
**దేశకాలానువృత్తిశ్చ నయశ్చ నయపణ్డిత ॥**

దేశకాలములకు అనుగుణంగా ఎక్కడ తగ్గాలో ఎక్కడ పెరగాలో నీకు తెలుసు. ఇది లేనివాడు కార్యాన్ని సాధించలేడు. హనుమా..నిన్నే నమ్ముతున్నాను నీ వలననే నా మాట నిలబడాలి. నీ వలననే కార్యము సాధింపపడాలి. సీతమ్మ దర్శనం అవ్వాలన్నాడు. ఒక్క హనుమని పిలిచి

మళ్ళీ సుగ్రీవుడు మాట్లాడాడు. ప్రభువు అంటే ప్రభువు నమ్మకం ఈయన మీద ఉంది. వెంటనే రాముడు పిలిచాడు ఆంజనేయస్వామిని. పిలిచి –

**దదౌ తస్య తతః ప్రీతస్స్వనామాఙ్కోపశోభితమ్ ।**
**అఙ్గులీయమభిజ్ఞానం రాజపుత్ర్యాః పరన్తపః ॥**

రామచంద్రమూర్తి తన అంగులీయం, అభిజ్ఞానం, రాజముద్ర – "శ్రీరామ" అని వ్రాయబడిన ఉంగరాన్ని తీసి హనుమ చేతికి ఇచ్చి దీన్ని అభిజ్ఞానం గుర్తుగా తీసుకెళ్ళి సీతమ్మకిమ్మన్నారు. అంటే అసలు ముందు ఎంత తెలివైనవాడు, ఎంత బలవంతుడైన భ్రుత్యుడికి వశపడి ఉండాలి. ఎప్పుడూ కూడా సంస్థ గౌరవాన్ని సంస్థ అధినేత గౌరవాన్ని ఆలోచించాలి. మీరు సుందరకాండలో చూడండి హనుమ ఒకటికి పది మాటలు అంటారు.

**భూతా శ్చార్థా విపద్యంతే దేశకాల విరోధితాః**
**అర్థానఅర్థాన్తరే బుద్ధిర్ని శ్చతాపినశోభతే**
**ఘాతయంతి హి కార్యాణిదూతాః పండిత మానినః**

నేను పండితుడిని, నేను బలవంతుడిని, నేను పరాక్రమవంతుడిని అని అతిశయం పొందినటువంటి వ్యక్తి ఎప్పుడూ ఏదీ సాధించలేడు. దేశకాలములకు అనుగుణంగా అవసరమైతే ప్రభువు గౌరవాన్ని నిలబెట్టడానికి తనను తాను తగ్గించుకు ప్రవర్తించిన వారే ప్రభుకార్యాన్ని సాధించగలరు. అందుకే అంత గొప్ప శక్తిమంతుడు – సూర్యాస్తమయం అయిపోయిన తర్వాత లంకా పట్టణంలో అన్వేషణం చేయవలసి వస్తే పిల్లిపిల్ల అంత సంకోచించి అంత చిన్నవారై పోయారు. నేనేమిటి ఇంత చిన్నవాడిని అయిపోవడం అంటే కార్యాన్ని సాధించలేరు. ఆ లంకిణిని గట్టిగా కొడితే అరుస్తుంది. స్త్రీని సంహారం చేయడం ఎందుకని చెప్పి ఎంత కోపం వచ్చినా సరే

**తతః సంవర్తయామాస వామహస్తస్య సోఽఙ్గులీః ।**
**ముష్టినాభిజఘానైనాం హనుమాన్ క్రోధమూర్ఛితః ॥**

ఎడం చేత్తో కొట్టారు తప్ప కుడి చేతితో కొట్టలేదు. కొడితే గట్టిగా దెబ్బ తగులుతుంది అని. వెంటనే ఆవిడ ఆయన పరాక్రమానికి ఆశ్చర్యపోయి "నన్ను గెలిచిన నాడు రావణాసురుడు పతనం ప్రారంభం అని బ్రహ్మగారి వరం కాబట్టి ద్వారం తీస్తున్నాను లోపలికి వెళ్ళు" అంది. ద్వారం లోంచి వెళ్తే మిత్రుడు వెళ్ళాలి. సకలశాస్త్ర పారంగతుడు ఆయన.

**అద్వారేణ చ మహాబాహుః ప్రాకారమభిపుప్లువే ।**
**ప్రవిశ్య నగరీం లఙ్కాం కపిరాజహితంకరః ॥**
**చక్రేణాఽథ పదం సవ్యం శత్రూణాం స తు మూర్ధని ॥**

ద్వారం నుంచి ఆ ప్రాకారం నుంచి దూకి లోపలికి వెళ్లి ఎడం పాదం లోపల పెట్టి వెళ్లారంటే శత్రుపురం లోకి ప్రవేశించినట్లు.

ఎక్కడైనా మాట్లాడితే అంత ఆలోచించి మాట్లాడతారు నిజానికి సీతమ్మకి ఉంగరం ఇచ్చేటప్పుడు– నేను ఇంతటి వాణ్ణమ్మా; ఇంత గొప్ప వాణ్ణమ్మా; నేను తెచ్చానమ్మా అని అనొచ్చు.

**వానరోహం మహాభాగే దూతో రామస్య ధీమతః ।**
**రామనామాఙ్కితం చేదం పశ్య దేవ్యఙ్గులీయకమ్ ॥**

**ప్రత్యయార్థం తవానీతం తేన దత్తం మహాత్మనా ।**
**సమాశ్వసిహి భద్రం తే క్షీణదుఃఖఫలా హ్యసి ॥**

అమ్మా నేను వానరుణ్ణి అమ్మా అని మొదలుపెట్టారు. బుద్ధిమంతుడైన రాముడి దూతనమ్మా. అమ్మా ఇదిగో ఉంగరమిస్తున్నానమ్మా నీకు దుఃఖం పోయింది సంతోషం పొందు తల్లీ అన్నారు. సుందరకాండలో వాల్మీకి మహర్షి అంటారు

**గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణమ్**
**భర్తారమివ సమ్ప్రాప్తా జానకీ ముదితాభవత్**

అన్ని నెలల నుంచి కంటికి మంటికి ఏకధాటిగా ఏకధారగా ఏడుస్తున్న సీతమ్మ ఆ ఉంగరం చేత్తో పట్టుకోగానే రాముడే వచ్చినంత ఆనందపడిపోయి ముఖం ఎఱ్ఱబడిపోతే, అంత సంతోషపడిన సీత ముఖం చూసిన ఏకైక వ్యక్తి స్వామి హనుమ. అంతటి మహానుభావుడు.

అంత శక్తిమంతుడై ప్రభుగౌరవం నిలబెట్టడం అంటే – యుద్ధకాండలో ఒక అద్భుతం జరిగింది. ఇంద్రజిత్తు వచ్చి బ్రహ్మాస్త్రప్రయోగం చేశాడు రామలక్ష్మణులతో కలిపి 67 కోట్ల మంది వానరులు పడిపోయారు. యుద్ధభూమిలో శత్రువులు ఎవ్వరూ లేరు. తప్పుకున్న వాళ్ళు విభీషణుడు, హనుమ – అస్త్రానికి కట్టుబడరు కాబట్టి. కాగడా పట్టుకుని వెతుకుతున్నారు. అక్కడ జాంబవంతుడు కనబడ్డాడు. అందర్లోకీ పెద్దవాడు. విభీషణుడు – తాతా ఎట్లా ఉన్నావు అని అడిగాడు. ఇంద్రజిత్తు కొట్టిన బాణాలకి కనురెప్పలు పైకి లేవట్లేదు.. హనుమ ఎలా ఉన్నారు? అని అడిగారు. విభీషణుడు అన్నాడు – తాతా రామలక్ష్మణులు కుశలమా అని అడగకుండా హనుమ కుశలమా అని అడుగుతున్నావు ఎందుకు? అని అడిగాడు.

**అస్మిన్ జీవతి వీరేతు హతమప్యహతం బలం ।**
**హనూమత్యుజ్ఝిత ప్రాణే జీవన్తోఽపి మృతా వయమ్ ॥**

మనం అందరం మరణించినా హనుమ ఒక్కరు బ్రతికి ఉంటే అందరం బ్రతికేస్తాం. మనం అందరం బ్రతికి ఉన్నా, హనుమ ఒక్కరు మరణిస్తే అందరం మరణిస్తాం అన్నారు. ఇంకొకరైతే – అహంకారంతో తాతా నేనిక్కడే ఉన్నాను అంటాడు. వంగి పాదములు పట్టుకుని – తాతా హనుమ నీకు నమస్కరించుచున్నాడు. అన్నాడు హనుమ.

ఎక్కడ దక్షిణతీరం? ఉత్తరదిక్కున ఎక్కడో ఓషధీపర్వతం ఉంది హిమవత్పర్వతానికి దగ్గర. వెళ్లి ఓషధులు తీసుకునిరా అంటే మెరుపు మెరిసినట్లు వెళ్లి ఓషధులు తీసుకొస్తే – మృతసంజీవని, విశల్యకరణి, సంధానకరణి, సావర్ణకరణి – అన్ని రకాలుగా దెబ్బలు తిన్నవారు, రక్తంపోయిన వాళ్ళు, ఎముకలు విరిగిపోయిన వాళ్ళు, ప్రాణాలు పోయిన వాళ్ళు – అందరూ ఒక్కసారి లేచి రామచంద్రమూర్తికి జై అని అరుస్తుంటే రావణాసురుడు తల్లడిల్లిపోయాడు. ఇదేమిటి ఇంతమంది ఎలా లేచి పోయారు అని.

అటువంటి భృత్యుడు అటువంటి దాసాంజనేయుడు, అంతటి మహానుభావుడు. ఆయన జీవితంలోనే విషమపరీక్ష. పైన శింశుపావృక్షం మీద కూర్చుని సీతమ్మని చూసి పొంగిపోతున్నారు అకస్మాత్తుగా సీతమ్మ అంది –

**నూనం స కాలో మృగరూపధారీ మామల్పభాగ్యాం లులుభే తదానీమ్ ।**
**యత్రార్యపుత్రం విససర్జ మూఢా రామానుజం లక్ష్మణపూర్వజం చ ॥**

నేను కాలం చేత వంచింపబడ్డాను. మృగరూపంలో వచ్చింది. ఆ జింక కావాలని కోరుకోవడం ఏమిటి? లక్ష్మణుని దూరంగా పంపించేశాను, రాముడూ దూరమైపోయాడు, ఇలా రావణుని చెరలో పడిపోయాను.

**అనన్యదైవత్వమియం క్షమాచ**
**భూమౌ చ శయ్యా నియమశ్చ ధర్మే**
**పతి వ్రతాత్వం విఫలం మమేదం**
**కృతం కృతఘ్నేరివ మానుషాణం**

భూమి మీద పడుకున్నాను. నియమాలు పాటించాను రాముడు వస్తాడు. నన్ను రక్షిస్తాడు అని నమ్మాను. రాముడు రాలేదు ఇక బ్రతికి

ఉండడం అనవసరం. ఇక నేను బ్రతకనంది. పైన కూర్చున్నాయన సీతమ్మ వైభవానికి సంతోషపడిపోయి శ్లోకాలు చెప్తున్నారు. ఆవిడ అకస్మాత్తుగా లేచి నిలబడి

**శోకాభి తప్తా బహుధా విచిన్త్య**
**సీతాథ వేన్యు ద్గ్రథనం గృహీత్వా**
**ఉద్బధ్య వెన్యు ద్గ్రథనేన శీఘ్ర**
**మహం గమిష్యామి యమస్య మూలం**

ఇక్కడ చనిపోతాను అంటే విషం ఇచ్చేవాడులేడు; కత్తి ఇచ్చేవాడు లేడు. నా దీర్ఘమైన కేశపాశంతోనే చచ్చిపోతానని, జడ విప్పి, ఆ కంఠానికి ముడి వేసేసుకుని పూచిన శింశుపావృక్షం కొమ్మను వంచి, దానికి తన జుట్టును కట్టేసింది. కొమ్మ వదిలేసిందో – చిక్కిపోయింది అప్పటికే.

**అశ్రు పూర్ణ ముఖీం దీనాం కృశామనశనేన చ ।**
**శోక ధ్యాన పరాం దీనాం నిత్యం దుఃఖపరాయణామ్ ॥**

తెలిపోతుంది శరీరం. పైనున్నాయన చూశారు. అయ్య బాబోయ్ ఈవిడకోసం ఇంత కష్టపడి వెతికాను. ఈవిడ ఉరి పోసుకుంటుంది. ఇప్పుడు నేనేం మాట్లాడాలి? వానర భాషలో మాట్లాడితే రావణాసురుడు ఈ రూపంలో వచ్చాడనుకుంటుంది. ఆవిడకు అర్థమవ్వాలని సంస్కృతంలో మాట్లాడితే, వానరం సంస్కృతంలో ఎందుకు మాట్లాడుతోందని అనుమాన పడుతుంది. మానవరూపాన్ని పొంది మాట్లాడినా అనుమాన పడుతుంది. నేనిపుడు ఎలా మాట్లాడాలి. గట్టిగా అరిస్తే రాక్షస స్త్రీలు లేస్తారు. యుద్ధం జరుగుతుంది. జయాపజయాలు విధి నిర్ణీతములు. దీనికి ఏం చేయాలి

**ఏవం బహువిధాం చిన్తాం చిన్తయిత్వా మహాకపిః ।**
**సంశ్రవే మధురం వాక్యం వైదేహ్యా వ్యాజహార హ ॥**

మనసులో కొట్టు మిట్టాడుకు పోయారు ఏం చేయాలో అర్థం కాలేదు. అటు తిరిగారు, ఇటు తిరిగారు. ఆవిడ ముడి వేసేస్తోంది, కొమ్మ వదిలేస్తోంది, లోపల్నించి ఆవేదన వచ్చేస్తోంది. మృతసంజీవని రామకథ. ఏంచెప్పాలో తెలియనపుడు రామకథ చెప్పేస్తాను. ఆవిడే వింటుంది. అని ఒక్కసారి మొదలుపెట్టేసారు.

**రాజా దశరథో నామ రథకుఞ్జరవాజిమాన్ ।**
**పుణ్యశీలో మహాకీర్తిరిక్ష్వాకూణాం మహాయశాః ॥**

గబగబా చెప్పకపోతే ఆవిడ అంతసేపు సావధానంగా రెండు గంటలు ప్రవచనం వింటుందా?

"ఒకానొకప్పుడు కోసలరాజ్యాన్ని పరిపాలించిన దశరథ మహారాజు గారు, సకల సుగుణములు కలిగినవాడు, గొప్ప ధర్మనిరతి కలిగినవాడు, యజ్ఞయాగములు చేసినవాడు, గొప్ప రాజర్షి, అటువంటి వాడికి నలుగురు కుమారులు కలిగారు; రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు, అందులో పెద్దవాడైన రామచంద్రమూర్తి గొప్ప ధర్మాత్ముడు, సకల గుణాభిరాముడు, అటువంటి వాడు తండ్రిగార్ని సత్యమునందు నిలబెట్టడంకోసం రాత్రికి రాత్రి కైకమ్మ అడిగిన రెండు వరాలు నిజం చేయడం కోసమని భార్యయైన సీతమ్మతో, తమ్ముడైన లక్ష్మణస్వామితో అరణ్యవాసానికి బయలుదేరి వెళ్ళిపోతున్న సమయంలో జనస్థానంలో రాక్షసులు అందర్నీ కూడా సంహరిస్తే, కోపం వచ్చిన రావణాసురుడు మారీచుని సహాయంతో సీతమ్మని అపహరించుకుని తీసుకునిపోతే, సీతమ్మ జాడ కనిపెట్టడానికి రామలక్ష్మణులు ఇద్దరు కూడా బయలుదేరి వెడుతున్నప్పుడు పంపాసరోవరతీరంలో సుగ్రీవుడితో స్నేహం చేసుకుని, వాలిని ఒక్క బాణంతో కొట్టి సంహరించి సుగ్రీవుడికి రాజ్యం ఇస్తే, కృతజ్ఞతతో ప్రత్యుపకారం చేయడానికి సుగ్రీవుడు అన్ని దిక్కులకూ వానరుల్ని పంపిస్తే, దక్షిణ దిక్కుకు వచ్చిన కొన్ని లక్షల వానరములలో నేను రాత్రి

బయలుదేరి యీ సముద్రాన్ని దాటి వచ్చే లంకా పట్టణాన్నంతటినీ వెతికి ఈ తెల్లవారుజాము కాలానికి శింశుపా వృక్షం మీద కూర్చుని ఇక్కణ్ణించి..

**యథారూపాం యథావర్ణాం యథాలక్ష్మీవతీం చ నిశ్చితామ్ ।**
**అశ్రౌషం రాఘవస్యాహం సేయమాసాదితా మయా ॥**

సీతమ్మ ఎటువంటి కాంతితో ఎటువంటి ఆభరణములతో ప్రకాశిస్తూ ఉంటుందని రాముడు నాకు చెప్పాడో, అటువంటి సీతమ్మ తల్లి దర్శనం చేసుకుని కృతకృత్యుణ్ణి అయ్యాను" అని ఆపేశాడు.

విన్న కథ వినని కథ వినబడేటట్టు ఆవిడ పొంగిపోయి, ఆ కొమ్మకు కట్టిన జుట్టు విప్పేసి పైకి చూసింది.

**తతశ్శాఖాన్తరే లీనం దృష్ట్వా చలితమానసా ।**
**వేష్టితార్జునవస్త్రం తం విద్యుత్సఙ్ఘాతపిఙ్గలమ్ ॥**

తెల్లనిబట్టలతో బంగారువన్నెలో కన్నులతో మెరిసిపోతున్నారు హనుమ. అది విన్నా చాలంటారు. సీతమ్మకి ఉంగరం ఇచ్చిన ఘట్టం, హనుమను చూసిన ఘట్టం. రెండూ గొప్పవే. రెండూ సిద్ధి సర్గలే అంటారు పెద్దలు. సీతమ్మ పొంగిపోయింది.

అబ్బ..! నిజంగా తర్వాత ఏమి మాట్లాడాడండి. మనిషికి భగవంతుడు వాక్కు దేనికి ఇచ్చాడంటే, పది మందిని సంతోషపెట్టమని ఇచ్చాడు. చిట్ట చివర చెప్తారు.

**తతోమయా వర్జిత దీన భాషితా శివాభి రిష్టా భి రఃభిప్రసాదితా**
**జగామ శాంతిం మమ మైథిలాత్మజా తవాఽపి శోకేన తదాభి పీడితా**

నా మాటలచేత చనిపోవాలన్నంత బాధ కలిగిన సీతమ్మ శోకం

పోగొట్టాను. నువ్వు తన గురించి బాధపడుతున్నావని బాధపడుతోంది తప్ప, ఇప్పుడు సీతమ్మ ఆత్మహత్య చేసుకోవాలన్నంత బెంగ పోగొట్టుకుంది. ఆమెకు శాంతినిచ్చానన్నాడు.

మాట దేనికి పనికి రావాలి అంటే ఇతరుల శాంతికి కారణం కావాలి. అశాంతికి కారణం కాకూడదు. భగవంతుడు మనిషికి మాత్రమే ఇచ్చిన అపూర్వవరం స్వరపేటిక. ఇరవైనాలుగ్గంటలూ రకరకాల పేర్లు చెప్పి వాడిని వీడు తిట్టుకోనూ, వీడిని వాడు తిట్టుకోనూ, వాడిమీద వీడూ, వీడిమీద వాడూ కలియపడడం కోసమా భగవంతుడు మాటను ఇచ్చింది? మాట అన్నది అపూర్వం. అవతలవాడి అజ్ఞాన దాహతత్వానికి పనికిరావాలి తప్ప, సమాజ సంస్కారాన్ని నాశనం చేయడానికి మాట పనికిరాకూడదు. అది రామాయణంలో హనుమ నిరూపించి మానవాళి ఎలా బ్రతకాలో చెప్పారు.

ఆ మాటే ఎంతటివాడికి చెప్పవలసివస్తే ఎంతగొప్పగా చెప్పవచ్చో అంత నిర్భయంగా చెప్తారు.

రావణాసురుడి దగ్గరికి వెళ్లి మాట్లాడినప్పుడు – "ఏమనుకుంటున్నావు సీతమ్మ అంటే –

**బ్రహ్మ స్వయంభూ చతురాణనోవా, రుద్రః త్రినేత్రః ।**
**త్రిపురాంతకోవా, స్థాతుం నశక్తా యుధి రాఘవస్య ॥**

రావణాసురుణ్ణి కాదు ఎవరినైనా సరే రాముడు చంపేస్తానని ప్రతిజ్ఞ చేస్తే ఇంక తప్పుకోవడం సాధ్యం కాదు. అది బ్రహ్మకావచ్చు, శివుడు కావచ్చు, ఇంద్రుడు కావచ్చు ఎవరైనా సరే రాముడు చంపేస్తానంటే ఆగలేరు.

నిజంగా సంస్కృత శ్లోకానికి భాస్కరుడు తెలుగులో అనువాదం చేశాడు–

**మండిత విస్ఫులింగ విషమ జ్వలితానల కీలలోజగ**
**ద్భాండము నిండ రామ వసుధాధిపు డీ చెడు వజ్ర సాధనా**
**ఖండిత పంక్తి కంఠ కల కంఠ పురాంతక శైల చాలనో**
**ద్దండ బల ప్రచండ పుర దండ విఖండన చండ కాండముల్**

**చరణాగ్రమున నీ భుజాదర్పమడచిన ధూర్జటివిలులీలత్రుంచివైచె**
**వాలపాశంబున వడి నిన్ను కట్టిన వాలినొక్కంబున కూలవేసె**
**అని నిన్ను చెరగొన్న అర్జును పురిగొన్న పరశురాముని యాజి**
**భంగపరిచె**

**కడిమియై యొక్కట ఖర,దూషణాదుల పదునాల్గు వీధుల భాహిసమరె**

**అమ్మహా ధనుర్ధరుని కెగ్గాచరించి**
**హరి హర బ్రహ్మ శక్రాదులైన యతని**
**బహిత నిర్ఘాత సంఘాత పాత శాత**
**బాణ ఘాత హతులు గాక బ్రతుక గలరె?**

**తురగ స్యందన మత్త వారణ రణ స్తోమంబుతో గూడ నీ**
**పురి భస్మంబుగ దాల్చి సైనిక సుహృత్ పుత్రాణి జిశ్రేణి నె**
**త్తురు గ్రక్కం బడ గ్రుద్ది చంపి మరి మృత్యు క్రూరతన్ బట్టి నీ**
**శిరమౌ త్రుంపగ నేనె చాలును జయశ్రీ లబ్ధి వర్ధిల్లగన్!**

అంటారు. నిర్భయంగా మాట్లాడాల్సివస్తే అలా మాట్లాడతారు హనుమ. అటువంటి భృత్యుడు లేడు, అటువంటి నవ వ్యాకరణపండితుడు లేడు. ఆయన కోసం ఆయన జీవితంలో చేసుకున్నది ఒక్కటి కనపడదు. అటువంటి మహా పురుషులు ఈ లోకంలో ఇద్దరే ఒకరు హనుమ, రెండు శంకరాచార్యుల వారు. వాళ్ళిద్దరూ ఎప్పుడూ ఏదీ తమకొరకు తాము చేసుకున్నది లేదు. విద్యాధరులంతటి వారు హనుమ ఆకాశంలో వెళ్లిపోతుంటే

**రామార్థం వానరార్థం చ చికీర్షన్ కర్మ దుష్కరమ్ ।**
**సముద్రస్య పరం పారం దుష్ప్రాపం ప్రాప్తుమిచ్ఛతి ॥**

అన్నారు. ఎవరికోసం? రాముడి కోసం! వానరుల కీర్తిప్రతిష్ఠల కోసం! ప్రభువు మాట నిలబెట్టడం కోసం! నిరాధారమైన ఆకాశంలో అలా వెడుతున్నాడు మహానుభావుడని కీర్తించారు.

**జగామ శాంతిం మమ మైథిలాత్మజా...**

సీతమ్మకి శాంతి ఇచ్చాను అన్నారు. అంతటి మహానుభావుడు హనుమ.

ఒక రాజు దగ్గర ఎట్లా ఉండాలో, ఎంత భక్తితో ఉండాలో, ఎంత వినయంతో ఉండాలో హనుమను చూసి నేర్చుకోవాలి. ఎన్నైనా ఉండొచ్చు కాక. వినయం లేకపోతే రాణించరు. సీతమ్మ ఒక ప్రశ్న వేసింది.. ''ఏమయ్యా అంతమంది వచ్చి అక్కడ ఉండిపోయారు కదా..! ఇవతలి దిక్కుకి లంక దాకా రాలేదు కదా..! మరి యుద్ధం వస్తే ఎవరొస్తారు?" అంది. ఇంకొకడైతే ఏమంటాడు? "నిజమేనమ్మా..!! ఆలోచించాలి. నేను కాబట్టి వచ్చాను" అంటాడు..!! కాని హనుమ అన్నారు –

**"మద్విశిష్టాశ్చ తుల్యాశ్చ సంతి తత్ర వనౌకసః ।**
**మత్తః ప్రత్యవరః కశ్చిత్ నాస్తి సుగ్రీవ సన్నిధౌ" ॥** అన్నారు.

"అమ్మా నీకు తెలుసు కదా. అంతఃపుర స్త్రీలదగ్గరికి పంపించేటప్పుడు అందరికన్నా తక్కువ బలం ఉన్నవాళ్ళను పంపిస్తారు. నన్ను నీదగ్గరికి పంపించారంటే సుగ్రీవుడి దగ్గర నాతో సమానులున్నారు, అధికులున్నారు కానీ, నాకన్నా తక్కువ వాళ్ళు ఎవ్వరూ లేరమ్మా..!!" అన్నాడు.

అంటే ఎంతటి మహానుభావుడు!! ఏమి ఆత్మపరిశీలన!! ఏమి వినయం!! ఏమి విధేయత!! ఏమి చిరంజీవిత్వం!!. ఇప్పటికీ –

**"యత్ర యత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృత మస్తకాఞ్జలిం**
**బాష్ప వారి పరిపూర్ణ లోచనం మారుతిం నమత రాక్షసాంతకం"**

రామాయణ ప్రసంగం జరిగితే వచ్చి హనుమ కూర్చుని తీరుతారు. శృంగేరిపీఠాధిపత్యం వహించిన చంద్రశేఖర భారతీస్వామివారు కూడా రామాయణ ప్రసంగం జరిగితే ఖాళీ ఆసనం పెట్టించేవారు హనుమ వస్తారని.

కాబట్టి – అంతటి మహానుభావుడు హనుమ. అంతటి గొప్ప సేవకుడు. ఆయనలాంటి మహానుభావుడు ఉండడు. హనుమస్మరణతో పూర్తిచేస్తూ మీ అందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తూ –

**మంగళా శాసన పరై ర్మదాచార్య పురోగమైః**
**సర్వైశ్చ పూర్వై రాచార్యై స్సత్కృపాయాస్తు మంగళమ్...**
**మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే**
**చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్...**

**ఉమాకాంతాయ కాంతాయ కామితార్థ ప్రదాయిని**
**శ్రీ గిరీశాయ దేవాయ మల్లినాథాయ మంగళమ్...**

**సర్వం శ్రీ ఉమామహేశ్వర పరబ్రహ్మార్పణ మస్తు..!!**

స్వస్తి

★★★★★

## ''శ్రీమద్రామాయణము - మానవీయ సంబంధాలు''

అన్న అంశంపై బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు గారి
నుండి రెండు రోజుల ప్రసంగాన్ని వారి ముఖతః
వినాలని ఆసక్తి గలవారు ఈ క్రింద ఇచ్చిన QR codes ను
వారి mobile ఫోన్ల ద్వారా scan చేసుకుని వినవచ్చు.



మొదటి రోజు ప్రవచనం



రెండవ రోజు ప్రవచనం

Please watch, like, comment and subscribe
**Yuvabharathi Youtube channel**
for more literary content.

ఆధునిక సమాజంలో నానాటికి దిగజారిపోతున్న నైతికవిలువల పరిరక్షణకు, ప్రపంచమంతటా ప్రబలుతున్న అసుర ప్రవృత్తి నిరోధానికి, మన ప్రాచీన వాఙ్మయం, పురాణేతిహాసాలు, ఎంతగానో ఉపకరిస్తాయి. మన ఆర్ష సంస్కృతికి అద్దం పట్టే ఆదికావ్యం శ్రీమద్రామాయణం. ధర్మాలను, ధర్మసూక్ష్మాలను అవగతం చేసుకోవడానికి, కాల ప్రవాహంలో కరిగిపోతున్న సంస్కృతీ సంప్రదాయాల పరిరక్షణకు, దృఢమైన మానవీయ సంబంధాలు మరుగునపడి మాసిపోకుండా కాపాడుకోవడానికి శ్రీమద్రామాయణ మహాకావ్యం పఠనీయం.

– వరప్రసాద్ రెడ్డి
ప్రచురణ కర్త



శాంతా వసంతా ట్రస్టు
హైదరాబాద్